# పరిచయం

ఈ అనువాదకర్త ప్రతిభావంతుడు. చాలాకాలంనుంచి మరుగు పడిన జానపదరీతులను పునరుద్ధరించటానికి కృషిచేస్తున్నట్టివాడు. అందుకు తనజీవితాన్ని అంకితం చేశాడని చెప్పవచ్చు.

అన్నిరకాల జానపదగేయాల బాణీల్లో ఈయన వ్రాయగలడు. జానపదగేయాలెన్నో పాడగలడు. వాటిని ప్రదర్శించి ప్రజల మన్ననలను పొందినట్టివాడు. గ్రామాలలో యున్న పల్లెపదాలన్నీ ఈయనకు నోటికి వచ్చు. ఈయన బహుముఖ ప్రజ్ఞావంతుడు.

చిన్నప్పటినుంచి ఈయనకు షేక్స్‌పియర్ నాటకాలంటే అభిమానం. షేక్స్‌పియర్ నాటకాలన్నీ ఈయనకు నోటికివచ్చు. నిద్రనుంచి మేల్కొలిపి షేక్స్‌పియర్ నాటకాలలోని ఎంత క్లిష్టవిషయాన్ని గురించి ప్రశ్నించినా ఇట్టే సమాధానం చెప్పగలడు.

షేక్స్‌పియర్‌ని గురించి ప్రముఖులు ప్రచురించిన వ్యాఖ్యానాలన్నీ ఈయనకు కరతలామలకములే. షేక్స్‌పియర్ విషయంలో ఈయనకు ఉన్న పాండిత్యం, షేక్స్‌పియర్ గ్రంథాలలోని అందాలను ప్రదర్శించటంలో ఈయన చూపే ప్రతిభ అద్వితీయమైనది; ఎటువంటి వారికైనా అచ్చెరువు కొలుపుతుంది.

ఇటీవల ఈయన 'షేక్స్‌పియర్ పాత్రలు' అనే గ్రంథాన్ని ఇంగ్లీషులో ప్రచురించి విజ్ఞుల మన్ననలను పొందాడు. గోకాక్, హుమయూన్ కబీర్‌వంటి [illegible]లు ఈ గ్రంథాన్ని ప్రశంసించారంటే దాని గొప్పతనాన్ని గురించి వేరుగా చెప్పనవసరంలేదు.

షేక్స్పియర్ రచించిన ప్రసిద్ధనాటకాల్లో 'ఒథెల్లో' ఒకటి. ఈ నాటకం తెలుగుదేశములో బహుళప్రచారంలో ఉన్నట్టిదే. అయితే ఈయన అనువాదం సరళంగాఉండి ఆ నాటకాన్ని అందరి అందుబాటులోకి తెచ్చింది.

గ్రంథకర్త భావాన్ని ఏ విధంగానూ చెడనీయకుండా, తెలుగుదనాన్ని ప్రదర్శించటంలో ఈ అనువాదకర్త అప్రతిహతమైన శక్తిని చూపాడు. అందువల్ల ఈ నాటకాలను కొన్ని కొన్ని పట్ల ఏ ప్రతిభావంతుడో తెలుగులో వ్రాసిన నాటకమే అని అనిపిస్తుంది. ఈ పని షేక్స్పియర్ సాకల్యంగా చదివి జీర్ణించుకున్న వారికి మాత్రమే సాధ్యమవుతుంది.

ఈ అనువాదకర్త ఇదే విధంగా మొత్తం షేక్స్పియర్ నాటకాలన్నిటిని తెలుగులోకి తీసుకురావాలనే సంకల్పంలో వున్నాడు. ఇందుకు ఆంధ్రలోకం తగిన ఉత్సాహ ప్రోత్సాహాల నివ్వగలదని నేను ఆశిస్తున్నాను.

ఈ రచయితకు నా ధన్యవాదాలు. ఈ దేశంలో రచయితలు నిష్కామకర్మ చెయ్యటానికి అలవాటు పడాలి. పరిస్థితులనుబట్టి అది తప్పనిసరికూడా అవుతూవుంది. నిష్కామకర్మచేస్తూ పోతుంటే ఎప్పటికో వొకప్పుడు అదృష్టదేవత తన చిరునవ్వులను రచయితల పైకి ప్రసరించకపోదు.

సూతాశ్రమం
తెనాలి
9-3-1961

త్రిపురనేని గోపీచంద్



# అనువాదకుని నివేదిక

## 1. వింతల్లో వింత

షేక్స్పియర్ షుమారు నాలుగువందల సంవత్సరాల నాటివాడు, ఇన్నేళ్ళు గడిచినా అతడి ప్రాభావం తగ్గలేదు. కారణం యేమిటి?

షేక్స్పియర్ని గురించి ఉన్నన్ని గ్రంథాలు మరే రచయితని గురించి, కళాకారుణ్ణి గురించి—బహుశా యీ జగత్తులో యే వ్యక్తిని గురించి కూడా—లేవు. ఎందువల్ల?

అతడికాలంలోనూ, ఆ తర్వాత, ఆఖరికి మనయుగంలోనూ, అతడి మీది అసూయతోనో, పెద్దవాణ్ణి తిట్టి పైకిరావాలనో, పత్రికలు అమ్ముకోవాలనో—యే కారణం చేతనైతే నేమి—అనేక కాకమ్మకథలు పుట్టినాయి. ఐనా షేక్స్పియర్ ధృవతారలాగా వెలుగొందుతూనే వున్నాడు. యేమిటీ విచిత్రం?

షేక్స్పియర్ రచనలు చదువుతూంటే టాజ్‌మహల్, పాలరాతి సంగీతం, అజంతా ఎల్లోరాల గుహాగానం మనకు వినపడతాయి. మన హృదయంలో కరుడుగట్టివున్న పదార్థమేదో కరిగిపోయినట్లనిపించుతుంది. మనమొక నూతన మానవుల మయ్యామని అనుకొంటాం యేమిటీ వింత?

కొద్దిమాటల్లో చెప్పాలంటే అది మనని ముగ్ధుల్నిచేసే అతడి హృదయసౌందర్యం!

ఇంకాకొంచెం వివరంగా చెప్పాలంటే—మానవసమాజంలోనూ, మానవ మనస్తత్వంలోనూ వున్న మిట్టపల్లాల్ని, లోతుపాతుల్ని అతడు

అద్భుతంగా చిత్రించాడు. ముందెలా వుంటుందో యీ అణుబాంబు యుగంలో జోస్యం చెప్పడం కష్టంగాని, యీనాటివరకూవున్న సత్య మేమంటే: మానవసమాజం ఎప్పుడూ ముందడుగు వేస్తూనేవచ్చింది. ఆది మానవుడు పచ్చిదుంపల్నీ పచ్చిమాంసాన్నీ తిన్నాడు; కాని మనం వండిన పదార్థాలు తింటున్నాం. అలనాటి మానవుడికి బట్టల్లేవు; కాని యీనాడు మనం రకరకాల బట్టలు కడుతున్నాం; రకరకాల యిళ్లల్లో వుంటున్నాం. ఇదంత మానవ సమాజం అభివృద్ధి అవటం వల్లనే. ఉన్నత దశపైపు పురోగమించటం వల్లనే జరిగింది. అయితే నాడూ నేడూ గూడా పాతకొత్తలకి ఘర్షణ జరుగుతూనే వస్తున్నది. మన నిత్య జీవితంలో మన పెద్దవాళ్లు ఒక రకంగా ఆలోచించటం యువకుల మైన మనం మరొక రకంగా ఆలోచించటం జరగటం లేదా?

సరే. మనచుట్టూ యెలాఘర్షణ జరుగుతూందో అలాగే మన మనస్సుల్లో గూడా ఘర్షణ జరుగుతూంది. ఒక్కసారి మీరు ఆలోచించండి, ఈ రెండు ఘర్షణలనూ షేక్స్పియర్ బ్రహ్మాండంగా చూపెట్టాడు.

అంతేగాదు. ధనికపేద అనే భేదభావం లేకుండా ఉన్న దున్నట్లు వర్ణించాడు. కులమత జాతి భేదాలు అతడు పాటించలేదు. సత్యాన్ని అతడు ఆరాధించాడు. అంత మాత్రంచేత కుక్కనూ గోవునూ యేకం చేసి మాట్లాడలేదు. అతడి సానుభూతి కంటికి కనరాకుండ పీడితుల తాడితుల పట్లనేవుంది. కానైతే చెడుగు అనేది ధనికుల్లో వున్నా దరిద్రుల్లోవున్నా — యెవరిలో వున్నా—నిస్సందేహంగా ఖండించాడు. ఇంటి దీపమని అతడు ముద్దాడలేదు: మూతి గాల్చుకోలేదు.

అందువల్లనే షేక్స్పియర్ అన్ని వర్గాల ప్రేమనూ పొంద గలిగాడు.



కానైతే అతడు పచ్చి వుద్రేకాన్నో, నిరుత్సాహాన్నో ప్రదర్శించ లేదు. మానవునిలో పూర్తి విశ్వాసముంచి అతడి అంతరాత్మను అతడికి చూపించాడు. సర్వమానవ కళ్యాణాన్ని తన ఆదర్శంగా పెట్టుకొని, అది జరగాలంటే వున్న ఆటంకాలను అపూర్వసృజనాత్మక కళాదృష్టితో పరిశీలించాడు. అందుకనే అతడు అమరుడై వెలుగొందుతున్నాడు.

జీవితం ఒక సాటిలేని మేటిగ్రంథం. దాన్ని పఠించి జీర్ణం చేసికొన్నవాడే మానవజాతిని ముందుకు నడపగలడు. హృదయం అనేది అంతులేని అగాధసముద్రం; దాని లోతుపాతుల్ని పరిశీలించినవాడే మానవాభ్యుదయనావను గమ్యస్థానం చేర్చగల్గుతాడు. ఈ రెంటివిషయం లోనూ మనం వెనుకబడివున్నాం. వివిధనాయకులూ. రచయితలూ, కళాకారులూ యీ సత్యాన్ని గుర్తించాలి.

షేక్స్పియర్ తర్వాత పఠించదగిన వారున్నారు. వారు — ఎమీల్‌జోలా, మొపాసా, ఆంటిన్‌ఛెకోవ్, ఇబ్సన్, టాల్‌స్టాయ్, మాక్సింగోర్కీ, స్టీన్‌బెక్, షొలోఖోవ్, మోలియర్‌లు. వీరిని పఠించని వాడు యే రచయితకైనా, కళాకారుడికైనా, సృజనాత్మకదృష్టి అలవడటం అసంభవమని నా అభిప్రాయం.

కాగా, షేక్స్పియర్‌ని పూర్తిగా అర్థం చేసికోవాలన్నా మానవ మన స్తత్వాన్ని గురించి బాగా తెలిసివుండటం అవుసరం. ఎందుకంటే అతడు నిత్యజీవితంలో వుండే మనస్తత్వాల్ని చిత్రించాడు; నిత్య జీవితంతో సంబంధం లేకుండా మనం అతడి నాటక పాత్రల్ని అర్థం చేసికోలేము.

షేక్స్పియర్ అమరత్వానికి గల కారణం మరొకటుంది. అతడు మానవ మనస్తత్వంలోని మూలసూత్రాల్ని ఆకళింపు చేసికొన్నాడు.

ఆ మూలసూత్రాలు నాటికీ నేటికీ ఉన్నవే. అవి మారాలంటే వాటిని సృష్టించిన సమాజం మారాలి. ఆ సమాజం మారిన తర్వాత గూడా అవి కొంతకాలం వుండనే వుంటాయి.

పై ముఖ్య కారణాలవల్ల షేక్స్పియర్ నాటక పాత్రలు బూజి పట్టకుండా నిలిచాయి. మానవులున్న యే ప్రాంతంలో ఆ నాటకాలు ప్రదర్శించినా వాటిని అర్థంచేసికో గలరు. ఆ గౌరవం, ఆ అమరత్వం అతడి కొక్కడికే దక్కింది.

## 2. మరొక విషయం

ఇక్కడ మరొకవిషయం తడమాలి. ఎవరైనా యొక ఘనకార్యం సాధించితే, అది ఆ వ్యక్తి తనచుట్టువున్న పరిస్థితుల ప్రభావం వల్లనే సాధించ గలిగాడని అనుకొనేవారు కొందరున్నారు. నిజం, పరిస్థితుల ప్రభావాన్ని యెవరూ తక్కువ అంచనా కట్టడానికి వీల్లేదు. అయితే కేవలం పరిస్థితులకే ప్రాధాన్యత యిచ్చేటట్లయితే వొక వ్యక్తికయే వ్యక్తిత్వమూ లేదని మరొక రూపాన చెప్పడమే అవుతుంది. అప్పుడు మానవుడు కేవలం పరిస్థితుల కొక బానిస అని అంగీకరించ వలసి యుంటుంది.

సరే, పరిస్థితుల వాదాన్ని మనం కొంత పరిశీలించుదాం. షేక్స్పియర్ కాలంలో అతడి చుట్టూవున్న పరిస్థితులే, అతడితోటి నాటక రచయితలైన మార్లో, బెన్‌జాన్సన్ లాంటి వారికున్నాయి. మరి వారు షేక్స్పియర్ నాటక పాత్రలవంటి పటిష్టమైన పాత్రల్ని యెందుకని సృష్టించ లేక పోయారు?

దానికి సమాధానం రావాలంటే మనకు చాలా దగ్గరగా వుండే విషయాలు గమనించితే చక్కని సమాధానం వస్తుంది. ఒకే తరగతిలో



వున్న బాలబాలికలకు వొకే పుస్తకాల ద్వారా, వొకే పద్ధతి ద్వారా పాఠాలు చెబుతుంటే అందరూ వొకే విధమైన తెలివి తేటల్ని ప్రదర్శించ పోవడానికేమికారణం? ఏమి కారణమంటే అందరికీ ఒకే విధమైన తెలివి తేటలు లేవు గనుక; అందరూ వొకే విధమైన మెదడుతో పుట్టలేదు గనుక! మనుష్యుల్లో యెలాగైతేపొట్టివాళ్లూ, పొడుగాంటివాళ్లూ, బలహీనులూ—రకరకాల వాళ్లూ —వున్నారో, అలాగే మనుష్యుల మెదడుల్లో గూడ ఆ తేడావుంది. అలా కానట్లయితే టాల్‌స్టాయ్‌తో పాటు చదివిన ప్రతివాడూ అంత ప్రతిభ కలిగివుండాల్సింది; ఐన్‌స్టీన్‌తో చదివిన ప్రతి బాలుడూ అంత ప్రతిభ చూపెట్టవలసింది. కాని, అలా జరగలేదు. కాబట్టి షేక్స్పియర్ ప్రతిభకి అతడి పుట్టుక ముఖ్యకారణం; తర్వాత అతడి చుట్టూవున్న పరిస్థితులు పదోవంతు కారణం. ఈ సత్యాన్ని మనం కాదన్నామంటే ప్రతివాడూ ఒక గొప్ప శాస్త్రవేత్త. ప్రతివాడూ ఒక గొప్ప రచయిత—ప్రతివాడూ ప్రతిదీ—అవగలడని వితండ వాదన చేయడమవుతుంది.

## 3. షేక్స్పియర్ అనే వాడు అసలు లేనేలేడా?

ఇటీవల నా ఇంగ్లీషు పుస్తకం—SHAKESPEARE'S MEN AND WOMEN—ప్రచురింపబడింది అందులో షేక్స్పియర్ ఉన్నాడాలేడాఅనేవిషయం చర్చించడం అనవసరం అనుకొనిమానివేశాను. ఎందుకంటె అతడు ఉన్నాడనేది ఖచ్చితంగా తిరుగు లేకుండా ఋజువయింది. కాని తీరాచూస్తే కనీసం మనదేశంలో మనప్రాంతంలో ముఖ్యంగా విద్యావంతులు ఆ సందేహంలో ఉన్నట్లనిపించింది. అందుకు కారణం వారా విషయాన్ని లోతుగా పరిశీలించక పోవడమే. మన వారికి అదికారణమైతే విదేశీయుల్లో కొందరికి రకరకాలకారణాలున్నాయి. ఉష్ట్ర పక్షుల్లాగా ఆ పెద్దలింకా తమకళ్ళు మూసుకొనే వున్నారు. వారికి పేరు

రావడం, పత్రికలు అమ్ముడు పోవడం యిత్యాదులు కావాలి; అంతేగాని సత్యంతో పనిలేదు. షేక్స్పియర్ నాటకాల్ని బేకన్ రాశాడని వొక ప్రబుద్ధుడు లేవనెత్తాడు. అదికొంత కాలం ప్రచారం అయింది. దాన్ని పండితులు సకారణంగా తుంపులు తుంపులుగాచేసి వుఫ్ అని ఊదేశారు. ఆ తర్వాత మళ్ళీ యీనాడు మరొక గుడ్డివాదన మొదలైంది. అసలు ఆ నాటకాల్ని ఎలిజెబెత్‌రాణి రాసిందని ఒక అమెరికన్ రాశాడు. పైగా అతడు శాస్త్రవేత్త గూడానట! ఆయన శాస్త్రం మండినట్లుంది; తానే రాశానంటే బాగుండేదిగా!

సరే. అవలావుంచుదాం. ఇకను యథార్థవిషయాలు చూద్దాం.

1. విలియం షేక్స్పియర్ అనేవాడు 1564 లో ఏప్రిల్ 23 న పుట్టినట్లూ 1616 లో అదే నెలలో అదే తేదీని చనిపోయినట్లూ అతడు పుట్టిన ఊరైన స్ట్రాట్‌ఫర్డ్ రిజిస్టరులో వుంది.

2. షేక్స్పియర్ సమకాలికులు అనేకమంది అతడినీ, అతడి పాత్రల్ని తమ తమ రచనల్లో వుటంకించారు. బెన్‌జాన్సన్ అనే సమకాలిక నాటక రచయిత షేక్స్పియర్‌ని కవుల్లో అగ్రగణ్యుడుగా (Star of poets) సంబోధించాడు; అతడి కాలంలోనే ఒక పబ్లిషర్ అతడి పద్యాలు కొన్నిట్ని తన సంకలనంలో చేర్చుతూ అతడు సాటిలేని మేటికవి అని ప్రస్తుతించాడు.

3. షేక్స్పియర్ తన రచనల్ని కొందరికి అంకితం యిచ్చాడు. అంకితం యిస్తూ అతడు రాసిన తొలిపలుకులు రికార్డుల్లో ఉన్నాయి.

4. అతడు మొదట లార్‌ఛేంబర్లేను కంపెనీలోనూ, తర్వాత ఎలిజబెత్‌రాణీ ఆస్థాననటక బృందంలోనూ ఉన్నాడు. అందుకు సంబంధించిన రికార్డులు ఉన్నాయి.

5. అతడు రాసిన వీలునామా ఉంది.

6. అతడితోటి నటకుల అభిప్రాయాలున్నాయి.



7. అతడుకొన్ని ఆస్థిపాస్తుల్ని కొన్నాడు. అందుకు సంబంధించిన రికార్డులున్నాయి.

8. అతడి పుస్తకాల ప్రచురణకర్తలు అతడి ఘనతను వుగ్గడించారు. ఇంకా అనేక రికార్డులు, ప్రత్యక్ష నిదర్శనాలు వున్నాయి. ఇన్ని వుండగా, ఇంతసాక్ష్యం ఉండగా, షేక్స్పియర్ అనేవాడు లేడనీ అతడి నాటకాల్ని ఎవరో రాశారనీ అని వాదించే పెద్దల్ని యేమనాలో అర్థంగావడం లేదు.

ఇంతకంటే యీ విషయాన్ని గురించి చర్చించ నవసరంలేదను కొంటాను.

## 4. ముగింపు మాట

మొత్తం షేక్స్పియర్ రచనల్ని నేను తెలుగులోకి అనువాదం చేయాలను కొన్నాను. ఇప్పటి వరకూ కొంత పూర్తిచేశాను. మిగితాది ఎప్పుడు పూర్తిచేస్తానో చెప్పలేను. నా జీవితం చాలా దుర్భరంగా గడుస్తూ వచ్చింది. మిలిటరీ ఒక ఎనిమిది నెలలూ, సికిందరాబాదు కార్పొరేషన్లో రెండు నెలలూ మినహాయించితే నేను ఉద్యోగమంటే ఎలావుంటుందో యెరగను. ఒక ప్రక్క నిరుద్యోగంతో, దారిద్ర్యంతో నరకం అనుభవించుతూ మరొక ప్రక్కన రచనలు సాగించవలసివచ్చింది. పెద్దలకు వంగి వంగి నమస్కారాలు కొట్టడంలో, ఉద్యోగం కోసం దేబరించడంలో వేలగంటల కాలం గడిచిపోతూ వస్తున్నది. కుల తత్వాలు, ప్రాంతీయ తత్వాలు, అసూయలు, అజ్ఞానాలు, అనుమానాలు నన్ను క్రిందికి తొక్కివేయాలని నా చుట్టూ ప్రయత్నం చేస్తున్నాయి. మెడమీద తలకాయవున్న నాయకమ్మన్యుడల్లా కళను గురించి సాహిత్యాన్ని గురించి గొంతుబొంగురు పోయేట్లు ఉపన్యాసం దంచుతాడు. తీరా నాబోటి వానికి(నాలాంటి అనేక మందికి)సహాయం చేయవలసివచ్చే

సరికి బిర్రబిగదీసుకొని పోతాడు. ఐనా నాలోని అగ్ని చల్లారలేదు. చల్లారదు. అదే నన్నుముందుకు తీసుకొని పోతున్నది. ఎన్ని ఆటంకాలు వచ్చినా నా కలం రాయటం మానదు; నా గొంతుపాడటం మానదు.

యే రచనసైనా మరొక భాషలోకి అనువాదంచేస్తే దాని పటుత్వం కొంతన్నా తగ్గుతుందనేది అనువాదకులందరికీ తెలిసిన సత్యం. స్వేచ్ఛగా అనువాదంచేస్తే రచయితకు అన్యాయంచేసిన వాళ్ళమవుతా మేమోనని భయంపట్టి పీడిస్తూంటుంది వొకపక్క; మరొకపక్క ఆ పదాలకు సరైనపదాలు యితరభాషల్లో దొరకవు. అందువల్ల యే భాషలో రచనల్ని ఆ భాషలో చదివితేనే వాటి ఘనత అర్ధమవుతుంది.

ఐనా నా శక్తికొలదీ నేను ప్రయత్నించాను. షేక్స్పియర్ రచనలు మల్లెపువ్వుల్లాగా కోమలమైనట్టివి; సుగంధ పూరితమైనట్టివి. ఆ కోమలత్వం, ఆ సుగంధం యెక్కడ చెడిపోతాయోననే భయంతోనే నేను యీ నాటకాల్ని అనువాదం జేశాను. యేమైనా లోపాలుంటే క్షమించమని పాఠకుల్ని కోరుతున్నాను. ఇంగ్లాండు దేశంలోపుట్టి, ఇంగ్లీషుభాష మాతృభాషగా గలిగి, ఇంగ్లీషులో మహాపండితులైన భాష్య కారులే యీ నాటకాల్లో కొన్ని కొన్నిచోట్ల అర్ధం గావడం లేదని వదిలి వేశారు. అలాంటప్పుడు ఇకను తెలుగుదేశంలో పుట్టి, తెలుగు మాతృ భాషగా గలిగి, ఫోర్తుఫారం వరకూ చదివి, అప్పటినుండీ యిప్పటి వరకూ నిత్యదారిద్ర్యం అనుభవిస్తున్న నా బోటివాడెంత ?

ఒక మహాపురుషుడు రచించిన ఈ నాటకాలను ప్రచురించడంలో ఈ ప్రచురణకర్తలు ఎంతో సాహిత్య సేవచేసినట్లయ్యారు. వారే నా ఇంగ్లీషు పుస్తకాన్ని—SHAKESPEARE'S MEN AND WOMEN ను—గూడా ప్రచురించారు. అంతర్జాతీయ ప్రాముఖ్యత గలిగిన సాహిత్యాన్ని వారు యికముందు గూడా యిలాగే ప్రచురిస్తారని ఆశిస్తూ, వారికి కృతజ్ఞతాభివందనాల్తో ముగిస్తున్నాను.

—లక్ష్మీకాంతమోహన్.

## ఈ నాటకంలోని పాత్రలు

వెనిస్ డ్యూకు

బ్రాబన్షియో—సెనెట్ సభ్యుడు; డెస్‌డెమోనా తండ్రి

ఇతర సెనెట్ సభ్యులు

గ్రాషియానో—బ్రాబన్షియో సోదరుడు } చిన్న ప్రభువులు

లోడొవికో—బ్రాబన్షియో బంధువు } చిన్న ప్రభువులు

ఒథెల్లో—సిద్దీ

కేషియో—అతడి లెఫ్టినెంటు

ఇవాగో—ఒథెల్లో పతాకధారి. ఒక మోసగాడు

రోడరిగో—మోసపోయిన ఒక పెద్దమనిషి

మాంటేనో—రిటైరవుతూన్న సైప్రసు గవర్నరు

హాస్యగాడు—ఒథెల్లో నౌకరు

డెస్‌డెమోనా—బ్రాబన్షియో కుమార్తె; ఒథెల్లో భార్య

ఎమీలియా—ఇవాగో భార్య

బియాంకా—ఒక వేశ్య

ఇంకా—

నావికుడు, హర్కారు, దూత అధికార్లు, పెద్దమనుష్యులు, వాయిద్యగాళ్లు, పరిచారకులు....

కథ జరిగేస్థలం : వెనిస్; సైప్రస్.

---

# ఒథెల్లో

## మొదటి అంకం

### మొదటి రంగం : వెనిస్ నగరం : ఒక వీధి

(రోడరిగో, ఇవాగోల ప్రవేశం)

రోడరిగో : అహఁ పోదూ మాలావు చెప్పొచ్చావు. యిక నా కెప్పుడూ అలాంటి మాటలు చెప్పమాక ! నా డబ్బును నీ స్వంత డబ్బు ఐనట్లు ఒక పక్కన వాడుకొంటూ మరొక పక్కన యిలా చేస్తున్నావంటే నాకు చాలా బాధగా వుంది.

ఇవాగో : అబ్బబ్బ ! నేను చెప్పేది కాస్త వినరేమండీ !? నేను అలాంటి విషయాన్ని గురించి అసలు కలలోనైనా యెన్నడైనా అనుకొంటే నన్ను ఛీ అనండి.

రోడరిగో : వాడంటే నీకు సరిపడదని నువ్వు నా కిదివరకు చెప్పావు.

ఇవాగో : అదే అబద్ధమైతే నన్ను ఛీ అనండి. యీ నగరంలోని ముఖ్యులు ముగ్గురు నన్ను వాడికి లెఫ్టినెంటుగా చెయ్యాలనే వుద్దేశ్యంతో, వాడేదో మహా మొనగాడైనట్లు, వంగి సలాములు గొట్టి దేబిరించాడు. హఁ. యిటు చూడండి. నా విలువేమిటో నాకు తెలుసు. నేను అంతకంటే తక్కువ స్థానంలో వుండదగిన వాణ్ణేమీ గాదు. కాని, వాడు దర్పంతో దురాలోచనతో యేమిటేమిటో గప్పాలు గొడుతూ వారికి సూటిగా

సమాధానం యివ్వకుండా తప్పించు కొన్నాడు. ఇకను ఆఖరికి, నాతరఫున పోయిన పెద్దమనుషులకి నాస్తి అని తేల్చాడు. "నాకు అవుసరమైన మనిషిని యిదివరకే తీసుకొన్నా" నన్నాడు. యెవడామనిషి? యెటువంటి వాడు? వాడొక్తి అంటనాప. వాడిపేరు మైకేల్ కేషియో. ఫ్లారెన్సు నగరం వాడు. అందమైన పెళ్లాంవల్ల బొందలో పడిన బాపతు. వాడెన్నడూ యుద్ధరంగలో నొక్కదళాన్ని గూడా నడిపి యేడ్చిన రకంగాదు. అసలు యుద్ధతంత్రమంటే యేమిటో తెలిసిన మొఖంగాదు. పుస్తకాల్లో చదివినచెత్తని వల్లించమంటే మాత్రం వల్లించ గలడు. వాడి సైనిక జీవిత మంతట్లోనూ వక్తి వాగుడు తప్పితే ఆచరణ అనేది శూన్యం. కాని, హలాంటి వాడిప్పుడు మొనగాడయ్యాడు. మరి నేనో? నా తడాఖా యేమిటో వాడు రోడ్సులో, సైప్రసులో చూశాడు. అటువంటి నేను యీ లెక్కలు గిలికే గుమాస్తాకింద తీసికట్టు. అలాంటి వాడు లెఫ్టినెంటుగా వుంటే నేనా నీగ్రో క్రింద పతాకధారిగా బతకాలి.

రోడరిగో : హుం. నేనైతే వాణ్ణిప్పుడో పొడిచి చంపేవాణ్ణి.

ఇవాగో : యెబ్బే, ఆ చాకిరీ మనకు తప్పదండీ. మనమేం చెయ్యలేము అసలు ఉద్యోగమనేదే అటువంటిది. పలుకు బడివున్న వాడూ, మీది వాళ్ళకు యిష్టుడైనవాడూ మాత్రమే పైకొస్తాడు. అంతేగాని సీనియారిటీ ప్రకారం యెవడూ పైకిరాలేడు. యికను మీరే చెప్పండి నేనా నీగ్రోని ప్రేమించాల్సిన బాధ్యత నాకేమన్నా వుందేమో.

రోడరిగో : అలాంటి పరిస్థితుల్లో నేనైతే వాడికింద పని చెయ్యనే చెయ్యను.



ఇవాగో : అయితే బాబూకాస్త వినండి. నా అవుసరం కోసరం నేను వాడికింద పని చేస్తున్నాను. మనమందరమూ అందలం యెక్కలేం, అందలం యెక్కే వారందరికీ మనం మనస్ఫూర్తిగా పనిచేయలేం. వంగి సలాములు గొట్టే గులాములు చాలామంది గానుగయెద్దుల్లాగా యింత మేత కోసరం పని జేస్తారు. తీరా ముసలితనం వచ్చినప్పుడు మెడబట్టి బయటికి గెంట బడతారు. అలాంటి వాళ్ళను మీ యిష్టమొచ్చినట్లు దంచుకోండి! యికను వాళ్లల్లో యింకొక తరహా మనుషులున్నారు. వాళ్లపైకి యెంతో బాధ్యతగా చక్కగా పనిచేస్తున్నట్లు నాటక మాడతారు. తమ యజమానుల మూలకంగా బాగు పడుతారు. యిక తెగబలిసినాక, తిన మరిగిన కోడి యిల్లెక్కి కూసిందన్నట్లు, ప్రవర్తిస్తారు. యిలాంటి బాపతుకి కొంతమంచి చెడూ అంటూవుంటుంది. నేను అదుగో అలాంటి వాళ్లల్లో వొకణ్ణండీ. కనక నా పనేదో నేను చూసుకొంటున్నా గాని ఆ నీగ్రోగాడు యేగంగలో కలిస్తే నాకేంటి? దేవుడిమీద ప్రమాణం చేసి చెబుతున్నా: నేను ప్రేమతోనో, నా కర్తవ్యం నేను చెయ్యాలనే దాంతోనో వాడికింద పని జెయ్యడం లేదు; వూరికినే పైకిమాత్రం అలా అగుపిస్తూ నాపనేదో నేను చేసుకుంటున్నాను. పైకిమాత్రం నేను యెంతో నమ్మకస్తుడిలాగా వున్నా, అదెంకెంతో కాలం అలా చెయ్యను. తొందర్లోనే కుండ బద్దలు కొట్టేస్తాను. నేను నేనుగాదు.

రోడరిగో : వాడికోర్కె నెరవేరితే, కాకిముక్కుకి దొండపండు లాగా వుంటుంది గదూ!

ఇవాగో : ఆవిడ తండ్రిని కేకబెట్టి పిలవండి. నిద్ర లెగ్గొటండి. అతడివెంట పడండి అతడి సంతోషానికి చిచ్చుబెట్టండి.

బజార్లో పెద్దగా అరవండి. అతడి చుట్టపక్కాలను వుసి కొల్పండి. అతడు కడుపులో చల్ల కదలకుండావున్నా అతడి కడుపులో చిచ్చుబెట్టండి.

రోడరిగో : ఇదుగో ఆమె తండ్రియిల్లు. బిగ్గరగా పిలుస్తాను.

ఇవాగో : వూఁ కానివ్వండి. పట్టణాల్లో అగ్ని ప్రమాదాలు జరిగినప్పుడెలా భయంకరంగా గావుకేకలు పెడతారో అలా గావు కేకలు పెట్టండి.

రోడరిగో : యేమండోయ్, బ్రాబన్షియోగారూ! ఓ బ్రాబన్షియో గారూ!

ఇవాగో : లెగవండీ! యేమండోయ్ బ్రాబన్షియోగారూ! దొంగలు! దొంగలు! దొంగలు! మీ యిల్లు జాగ్రర్త, మీ అమ్మాయి జాగ్రర్త. మీపెట్టె బేడా జాగ్రర్త! దొంగలు! దొంగలు!

(పైన కిటికీవద్దకు బ్రాబన్షియో ప్రవేశం)

బ్రాబన్షియో : యేమిటయ్యా ఆ గగ్గోలూ? యేమిజరిగిందేమి ఎక్కడా ?

రోడరిగో : అయ్యా, మీ కుటుంబమంతా యింట్లోనే వున్నారా ?

ఇవాగో : మీ తలుపులకి భద్రంగా గొళ్లాలు పెట్టేవున్నయ్యా ?

బ్రాబన్షియో : యేమిటి, యెందుకయ్యా అలా అడుగుతున్నారూ ?

ఇవాగో : భలేవారండీ బాబూ! మీ యింట్లో దొంగలుపడ్డారండీ! సిగ్గుసిగ్గు! తొందరగా బట్టలేసుకోండి! మీ గుండె బద్దలైపోయే సంగతది. మీ ఆయుస్సులో సగం కుంగిపోయింది. ఇప్పటి కిప్పుడు, యీ సమయాన, యీ క్షణంలో ఒక నల్ల గొర్రెపొటేలు మీ తెల్లఆడగొర్రెమీద యెక్కుతూంది. లేవండి,



లేవండి! గురకలుబెట్టి నిద్రపోయే జనాన్ని గంటగొట్టి నిద్ర లేపండి. లేకపోతే మిమ్మల్ని భూతంపట్టి పీకుతుంది. లేవండి బాబూ, లేవండి!

బ్రాబన్షియో : యేమిటి, మీకేమన్నా మతిపోయిందా ?

రోడరిగో : అయ్యా! నా గొంతుగుర్తు బట్టారా ?

బ్రాబన్షియో : వుహూఁ యెవరుమీరు ?

రోడరిగో : నేను రోడరిగోని.

బ్రాబన్షియో : అయితే నీమాట నమ్మడానికే వీల్లేదు. నా యింటి చాలుకి రామాకమని యిదివరకు నీకు చెప్పాను. నా బిడ్డ నీకెన్నడూ దక్కదని నీకు దాపరికం లేకుండా చెప్పాను. యికను యిన్నిచెప్పినా గూడా వెర్రెత్తి, తిని, తాగి, మత్తెక్కి, రొచ్చుగుంట అబద్ధాలాడి నా నిద్ర చెడగొట్ట టానికి వచ్చావు.

రోడరిగో : అయ్యా, అయ్యా, అయ్యా—

బ్రాబన్షియో : కాని, నీకు ముందుకే వెనక్కి బుద్ధొచ్చేట్లు చెయ్యగల సత్తా నాదగ్గిరుంది.

రోడరిగో : కాస్త నిదానించి తెలిసికోండి బాబూ.

బ్రాబన్షియో : దొంగలని వాగుతున్నావేంటి? ఇది వెనిస్ నగరమనుకో నా యిల్లు అద్దాన్నపు అడివిలో యేమీలేదు.

రోడరిగో : అయ్యా, నేను సదుద్దేశంతోనే యిలా వచ్చానండీ.

ఇవాగో : అబ్బ, యేం మనుషులండీ మీరూ. మీరు మీ కీడుగోరే వారిమాట తప్పితే మీమేలుగోరే వారిమాట నమ్మరు. మేము మీమేలుగోరి వచ్చాంగనక మమ్మల్ని మోసగాళ్లనుకొంటు

న్నారు. మీ కూతురి మీద ఆఫ్రికా గుర్రాన్నెక్కిస్తున్నారు. యిక మీ మనుమలూ గినుమలూ అంతా గుర్రాలే పుడతారు.

బ్రాబన్షియో: యెవడ్రా నువ్వు లుచ్ఛాకోరు వెధవా ?

ఇవాగో : నేనా ? నేను మీకూతురూ ఆ నీగ్రోగాడూ గలిసి లుచ్ఛాపని చేస్తున్నారని మీకు చెప్పడానికి వచ్చిన మనిషిని.

బ్రాబన్షియో : నువ్వు లుచ్ఛాకోరువురా.

ఇవాగో : మరి మీరు సెనెటర్లు.

బ్రాబన్షియో : యిందుకు నువ్వు సంజాయిషీ యిచ్చితీరాలి. నిన్ను నేను బాగా యెరుగుదును, రోడరిగో.

రోడరిగో : అయ్యా, నేను దేనికైనా సంజాయిషీ యివ్వగలను. యింత అర్ధరాత్రిపూట మీకుమార్తె ఒక అలగా వెధవతో ఒక కులంతక్కువ మోటుముండా కొడుకుతో గలిసి కాలక్షేపం చేస్తూండటం మీ సమ్మతితోనే మీ యిష్టంతోనే జరుగుతూవుంటే మీకు మేం చాలా అన్యాయం చేసినవాళ్లమయ్యామనుకొంటాం; అలాగాక, ఆ విషయం మీకు తెలవనట్లయితే మీరు మమ్మల్ని అనవుసరంగా నానామాటలూ అన్నవాళ్లవుతారు. మంచీ చెడూ మర్యాదా సర్యాదా లేకుండా నేను మీతో అలా వేళాకోళం ఆడేమనీషనని అనుకోమాకండి. నేను మరోసారి చెబుతున్నాను. మీ కుమార్తె పనికి ఒకవేళ మీరుగిని సమ్మతించి వుంటే సరేసరి. లేకపోతే ఆమె తన విధినీ, అందాన్నీ వివేకతనీ, జీవితాన్ని ఒక దగుల్బాజీ దేశదిమ్మరికి ముడిపెట్టి మీకు పెద్ద అపచారం చేసిందన్నమాట. నేను చెప్పేది నిజమోకాదో యిప్పుడే తేల్చుకోండి. ఆమె తన గదిలో గానీ, లేక యింట్లో యెక్కడైనాగానీ వుంటే, మిమ్మల్ని నేను అనవసరంగా రొష్టు పెట్టినందుకు నాకు తగిన శిక్ష వెయ్యండి.



బ్రాబన్షియో : యెవరక్కడ ? దివిటీ వెలిగించి యిలా తీసుకరండి ? నా వాళ్లందర్నీ పిలవండి ! యిదేదో మాయకలగా వుంది. జరుగుతున్నట్లే వుంది. దీపం తెమ్మన్నా ! దీపం ! (పైన నిష్క్రమణ)

ఇవాగో : ఇకశెలవు. నేను వెళ్లిపోవాలి. నేనిక్కడుంటే ఆ నీగ్రోగాడికి వ్యతిరేక సాక్షిగా వుండాల్సి వస్తుంది. అందువల్ల నేనిక్కడుండటం నా స్థానానికి తగిందీగాదు, క్షేమమూగాదు. యెందుకంటే, యీ పనికి ప్రభుత్వంనుండి వాడికెలా చివాట్లు వచ్చినా వాడి వునికికి మాత్రం యేమొప్పమూరాదు. యెందుకో తెలుసాండి ? యిప్పుడు సైప్రెస్‌లో జరుగుతూన్న యుద్ధానికి వాడు పోతున్నాడు. అది చాలా ముఖ్యమైన విషయం. వాళ్లెంత తన్నుకుచచ్చినా వీడివంటి సత్తాగలమనిషి వాళ్లకి దొరకడు. అందువల్ల, వాడంటే నాకు చచ్చేంత దొబ్బిదాయివున్నా పైకి మాత్రం పేరిమవున్నట్లు కాలాన్నిబట్టి నడుచుకోవాలిమరి. ఆ వెతికేవాళ్ళని శాగిటరీ వద్దకు తీసుకురా అక్కడనేను వాడి దగ్గరుంటాను. శెలవ్ (నిష్క్రమణ)

(తనరాత్రి టంగీ తొడిగి బ్రాబన్షియో, దివిటీలతో నౌకర్లూ కిందకు ప్రవేశం).

బ్రాబన్షియో : ఆ పాపిష్టిపని జరగనే జరిగిపోయింది. యింకా నమ్మకుండా వుండేదెలాగు ? వెళ్లనే వెళ్లిపోయింది. యిక నీ ముసలితనంలో నాకిది గుండెబీకుడు తప్పితే మరేమీగాదు. ఆ(. రోడరిగో, నువ్వు ఆవిడ నెక్కడ చూశావు ?–యెంత మిడిమేళం తెచ్చావేపిల్లా! ఆ నీగ్రోతోననా అన్నావు?-అలాంటి దానికి తండ్రినని యెవడంటాడు?–ఆవిడేనని నీకెలాతెలి

సింది?—అబ్బా, నాకెంతమోసం చేసింది!—నీతోయేమన్నది?—యింకా కొన్నిదివిటీలు తెండి!—నావాళ్లనందర్నీ లేపండి!—అయితే యింతకీ వాళ్ళు పెళ్లిచేసుకున్నారంటావా ?

రోడరిగో : చేసుకున్నారనే అనుకుంటున్నా నండీ.

బ్రాబన్షియో : హారి భగవంతుడా ! అసలు బైటికెలా పోగలిగిందంట : అబ్బా, తండ్రికి ద్రోహమా !? ఆడపిల్లలగన్న తండ్రులారా యికనుండీ మీ కూతుళ్ల వటనలుజూసి వాళ్ళని నమ్మకండి. వయసొచ్చిన ఆడపిల్లల్ని వశపర్చుకొనే మందులూ మంత్రాలూ లేవంటావా ? అలాంటి వాటిని గురించి మీరు చదవలేదా, రోడరిగోగారూ ?

రోడరిగో : అవునండీ. నేను చదివాను.

బ్రాబన్షియో : నా తమ్ముణ్ణి పిలవండి !—అబ్బా, ఆవిణ్ణి నువ్వన్నా పెళ్ళి చేసుకొంటే యెంత బాగుండేది !— కొందరిటూ, కొందరటూ—ఆవిడా, ఆ నీగ్రో మనకెక్కడ దొరకుతారో మీరు చెప్పగలరా ?

రోడరిగో : మీరు దిట్టమైన మనుషుల్ని తీసుకొని నావెంబటొస్తే నేను అతడెక్కడున్నాడో చూపగలనండీ.

బ్రాబన్షియో : అలాగే కానివ్వు బాబూ. ఇంటింటికీ వెళ్లి మనుషుల్ని రమ్మని పిలుస్తాను. చాలామంది నామాట వింటారు—వోయ్, ఆయుధాలు తెండయ్యా ! రాత్రి కాపలాదారుల్ని కొంతమందిని తీసుకురండి-పదండి, రోడరిగోగారూ. మీరెంతో మంచి వారండీ. మీ శ్రమకి నేను ప్రతిఫలం యిచ్చుకొంటాను. (నిష్క్రమణ)



## రెండవ రంగం : వెనిస్ నగరం : సాగిటరీ ముంగిట

(ఒథెల్లో, ఇవాగో, పరిచారకులూ దివిటీలతో ప్రవేశం)

ఇవాగో: యుద్ధంలో నేను చాలామందిని చంపినప్పటికీ, బయట మాత్రం కావాలని ఖూనీ చెయ్యాలంటే ప్రాణం వొప్పదు సుమాండి. నాలో చెడుబుద్ధి లేనందువల్ల కొన్ని సమయాల్లో నాపనులు చెడిపోతున్నాయి. వాడి డొక్కలో పొడవాలని తొమ్మిది పదిసార్లు అనుకొన్నా.

ఒథెల్లో : అది జరక్క పోవటమే మంచిది.

ఇవాగో : కాదండీ. వాడూ మిమ్మల్ని గురించి పరమ ఛండాలంగా పొగరుబోతుకూతలు కూశాడు. యిక నేను యెంతో పట్ట బలవంతాన నాలో పుట్టుకొచ్చిన కోపం ఆపుకో గలిగాను. అది సరే గానండి, మీరు యింతకీ పకడ్బందుగా పెళ్ళిచేసు కొన్నారా లేదా ? అది ముందు గట్టి పరుచుకోండి. యెందుకంటే, చూడండీ, ఆ పెద్దమనిషికి డ్యూకు కున్నంత పలుకుబడి వుంది. మీకు విడాకులు యిప్పించి యిద్దరికీ యెడబాటన్నా తెస్తాడు, లేదా. ప్రభుత్వం మీద తన పలుకుబడంతా వుపయోగించి మీకు తాను చేయ గలిగిన కీడంతా చేయించి తీరతాడు.

ఒథెల్లో : ఆయన యిష్ట మొచ్చింది చెయ్యనియ్యి. ప్రభుత్వానికి నేను చేసిన సేవవల్ల, ఆయన ఫిర్యాదులు నన్నేమి చెయ్యాలేవు. నేను రాజకుటుంబానికి చెందిన వాణ్ణనేది యింకాయెవరికీ తెలీదు. (గప్పాలు కొట్టటం గౌరవమైన విషయం అయినప్పుడు నేనా రహస్యం అందరికీ చెప్తాను.) నేను గుణం తక్కువవాడి నేమీ గాదు. యిదుగో చెప్పేది విను, ఇవాగో

నేను డెస్ డెమోనాని ప్రేమించాను. అందుకోసం భూమి తలకిందు లైనా నేను బెదరను.

(కేషియో, కొంతమంది అధికారులూ దివిటీల్తో ప్రవేశం)

అదుగో చూడు. దివిటీల్తో యెవరో వస్తున్నారు.

ఇవాగో : వారు ఆమెతండ్రీ, ఆయన స్నేహితులూనూ. మీరు లోపలికి పోవటం మంచిది.

ఒథెల్లో : ఉహూం. వారికి నేను కనపడాలి. దాక్కోనేందుకు నేను చెడు పనేమీ చెయ్యలేదు. తక్కువ స్థానంలో వున్న వాణ్ణేమీగాదు. వారేనా వచ్చేది ?

ఇవాగో : కాదనుకొంటానండీ.

ఒథెల్లో : డ్యూకు గారి నౌకర్లా? అందులో నా లెఫ్టినెంటు గూడానా ? మిత్రులారా, నమస్కారం. యేమిటి విశేషాలు ?

కేషియో : జనరల్ గారూ, డ్యూకు మీకు స్వాగతం చెప్ప మన్నారు. మిమ్మల్నెందుకో తక్షణం వున్నపాళాన రమ్మన్నారు.

ఒథెల్లో : యెందుకో మీకేమన్నా తెలుసా ?

కేషియో : నే నూహించినంత మట్టుకు అది సైప్రెస్ వ్యవహార మేదో ననుకొంటాను. అదేదో ముఖ్యమైన విషయమేనండీ. పడవల వద్దనుండి ఒకరి వెంట ఒకరు పన్నెండు మంది హర్కారు లొచ్చారు. చాలామంది సలహాదార్లు నిద్రలేచి వెళ్ళి డ్యూకుగారింట్లో వున్నారండీ. మిమ్మల్ని తక్షణమే రమ్మన్నారు. మీరు మీ మకాంలో లేనందువల్ల సెనేట్ సభ్యులు మీకోసం మూడు దిక్కులకు ముగ్గుర్ని పంపిచారు.



ఒథెల్లో : అయితే మీకు నేను కనపడటం మంచిదే అయ్యింది. యిదుగో యీ యింట్లోకిపోయి ఒక్కమాట చెప్పి మళ్ళా వెంటనే తిరిగొస్తా. యిద్దరం కలిసి పోదాం (నిష్క్రమణ)

కేషియో : యేమండీ, మీరిక్కడున్నారేం ?

ఇవాగో : ఆయన భూపడవ యెక్కారీరాత్రి. అది చట్ట సమ్మత మైందైతే చిరకాలం సుఖిస్తారు.

కేషియో : మీరనే దేమిటో నా కర్థం గావటం లేదు.

ఇవాగో : ఆయన పెళ్ళిచేసి కొన్నారు.

కేషియో : యెవర్ని ?

(ఒథెల్లో పునఃప్రవేశం)

ఇవాగో : యెవరికంటే– రండి, వస్తారా కాప్టెన్‌గారూ ?

ఒథెల్లో : మంచిది, పోదాంపదండి.

కేషియో : మీ కోసరం యిదుగో యిబెవరో వస్తున్నారు.

(బ్రాబన్షియో, రోడరిగో, దివిటీలతో ఆయుధాలతో అధికారులూ ప్రవేశం)

ఇవాగో: ఆ మనిషి బ్రాబన్షియో. నామాటవిని జాగ్రర్త పడండి, జనరల్‌గారూ. అతడు దురుద్దేశంతో వస్తున్నాడు.

ఒథెల్లో : యెవరది ! నిలబడండి !

రోడరిగో : అదుగో ఆ అరిచింది ఆ నీగ్రోయేనండీ.

బ్రాబన్షియో : పొడవండి దొంగ వెధవని !

(రెండువైపుల వారూ కత్తులు దూస్తారు)

ఇవాగో : అరే రోడరిగో. రా. నీకు నేను ఉజ్జీ

ఒథెల్లో : మీ మెరిసే కత్తుల్ని ఒరల్లో దోపండి. యెందుకంటే వాటిమీద మంచు బిందువులు పడితే తుప్పు పట్టగలవు.

అయ్యా బ్రాబన్షియోగారూ, అంత వయస్సులో మీరు కత్తులు దూయటం మంచిదిగాదు. పెద్దవాని మాటే చాలదా ?

బ్రాబన్షియో : అరే లుచ్చాకోరు దొంగ వెధవా, నాకూతుర్నెక్కడ దాచావురా ? పాపిష్టి ముండా కొడుకువి నాబిడ్డని మాయ మంత్రాల్తో మోసగించావు ! అంత కోమలంగా, అందంగా, హాయిగావుండే బిడ్డ; అసలు పెళ్ళే వద్దని మా జాతిలోని మణిపూసల్నే వద్దని కాలదన్నిన బిడ్డ తన తల్లి దండ్రుల్ని వదిలి పెట్టి నలుగురి చేతా నవ్వించు కొనేందుకు నీవంటి లఫంగు దగ్గిర కొచ్చిందంటే నువ్వు యేమందుమాకులు పెట్టి మాయ జేయ్యందే యింతపని జరిగిందీ ? అదిన్నూ నీవల్ల సుఖపడడానికా దిగులుతో చీకి పోటానికి గాని ? నువ్వు ఆ అమాయికురాల్ని మాయలమారి తంత్రాలుచేసి, మాందులు బెట్టి, మంచేదో చెడోదో తెలవకుండా చేసి, లోబర్చు కొన్నావో లేదో లోకాన్నే చెప్పనియ్యి. చూడు, ఆ సంగతి నిజమోకాదో తేల్చు కొంటానుమరి. ఆలోచిస్తే అదేమీ అసాధ్యమైన విషయమేమీగాదు. కనక నువ్వు లోకాన్ని మోసగించే వాడవనీ, మాయలమారి మంత్రగాడివనీ అరెస్టు చేయించుతున్నాను. వాణ్ణి పట్టుకోండి. యెదురుతిరిగితే విరగ్గొట్టి పట్టుకోండి.

ఒథెల్లో : ఉహూం. వద్దు. నాకు వ్యతిరేకులూ అనుకూలురూ గూడా చెయి చేసుకోకుండా ఆగండి. పోట్లాటే అవుసరమైతే ఒకరు చెప్పకుండానే ఒకరి వత్తాసు లేకుండానే నేనాపని చేయ గల్దును. నేనిందుకు సంజాయిషీ చెప్పుకొనేందుకు యెక్కడికి రావాలంటారు ?



బ్రాబన్షియో : యెక్కడికా ? కోర్టులో సంజాయిషీ యిచ్చుకొనే సమయం వచ్చేవరకూ జైలువుండటానికి జైలుకి.

ఒథెల్లో : నేనందుకొప్పుకొంటే యేమవుతుందో తెలుసా ? ఒక ముఖ్యమైన ప్రభుత్వ వ్యవహారం విషయమై నన్నుపిలుచు కొని రమ్మని డ్యూకుగారు పంపిన హర్కారులు నాకోసం యిక్కడ కాచుకు కూచున్నారు. నేను వెళ్లకపోతే డ్యూకు గారేమనుకొంటారు మరి ?

అధికారి : అదినిజమేనండీ. డ్యూకుగారు సమావేశంలో వున్నారు. మీకోసం కబురంపింది నాకుగట్టిగా తెలుసు.

బ్రాబన్షియో : యేమిటీ ? డ్యూకుగారు సమావేశంలో వున్నారా ? యింత రాత్రిలోనా ? సరే. తీసుకుపదండి! నాది చిన్న విషయమేమీగాదు. డ్యూకుగారైనా, ప్రభుత్వంలోవున్న నా అన్నదమ్ములైనా యీ అపచారం తమకు జరిగినట్లుగానే భావించగలరు. యెందుకంటే, యిలాంటి పనులకు పట్టపగ్గాలు లేకుండాపోతే, బానిసలూ భడవాకోర్లూ మన ప్రభువులవుతారు.

## మూడవ రంగం : సెనేట్ గృహంలో వొకగది

(డ్యూకూ, సెనేట్ సభ్యులూ, దివిటీల్తో పరిచారకుల్తో, వొక మేజాబల్ల వద్దకు ప్రవేశం)

డ్యూకు : యీవార్తల్లో ఒకదాని కొకటి సంబంధంలేదు.

మొదటి సెనేట్ సభ్యుడు : అవునండీ. అవి అతుకులబొంత లాగానే వున్నాయి. నాకొచ్చిన జాబుల్లో నూటదెబ్భయ్యి పడవలని వుంది.

డ్యూకు : నా కొచ్చివాటిల్లో నూటనలభై వుంది.

రెండవ సెనేట్ సభ్యుడు : నా వాటిల్లో రెండువందలుంది. వాటిల్లో వొకదాని కొకటి అవి అతక్క పోయినప్పటికీ (యిలాంటి సందర్భాల్లో అలాంటి తేడాలుండటం మామూలు) మొత్తం మీద అన్నివార్తలూ రూఢిపరిచేదేమంటే అది టర్కీ నావికాదళమనీన్నీ సైప్రెస్ మీదకు వస్తూందనీన్నీ.

డ్యూకు : అవును. అదినిజమే. అసలు యెంత పొరపాటుపడ్డా ప్రమాదం యెంతవుందో అర్ధంగాకుండా యేమీలేదు.

నావికుడు : (లోన) యేమండోయ్! యేమండోయ్! యేమండోయ్!

(నావికుని ప్రవేశం.)

అధికారి : యితడు నౌకల వద్దనుండి వచ్చిన హర్కారు.

డ్యూకు : యేంపని ?

నావికుడు : టర్కీవాళ్లు రోడ్సువైపు వస్తున్నారు. అంజెలోగారు యీ విషయాన్ని తమకి మనవి చెయ్యమన్నారు.

డ్యూకు : యీ మార్పునిగూర్చి మీ అభిప్రాయం యేమిటంటారు?

మొ॥ సెనేట్ సభ్యుడు : యిది యెంతమాత్రం నమ్మదానికి వీల్లేకుండా వుంది. యిదంతా మనని మోసగించటానికి చేసిన తంత్రం. యెందుకంటే సైప్రస్ టర్కీవాళ్లకి యెంత అవుసరమైనదో చూస్తే, రోడ్సుకున్న బలమైన రక్షణలు సైప్రస్‌కి లేవుగనుక వాళ్లు దాన్ని తేలికగా ఆక్రమించుకోగలరనే విషయం మరోసారి చూస్తే, తనకుముందు అవుసరమైనదాన్ని వెనక్కినెట్టి సులువుగా లభించేదాన్నీ లాభసాటిదాన్నీ విడిచిపెట్టి గోటితో పోయేదాన్ని గొడ్డలితో పోయేంత పొరపాటుచేసే టటువంటి తెలివి తక్కువవాళ్లు గాదని తేటతెల్లమవుతుంది.



డ్యూకు : అవును. వాళ్లు పోదలిచింది రోడ్సు కెంతమాత్రమూగాదు.

అధికారి : యిదుగో మరింత సమాచారం తెస్తున్నారు.

(ఒక హర్కారుని ప్రవేశం.)

హర్కారు : మహాప్రభూ, రోడ్సుకుపోతూన్న బిటోమైట్ల నావికాదళంతో మరొకదళం వచ్చిచేరింది.

మొ॥ సెనేట్ సభ్యుడు : అవును. నేనలాగే జరుగుతుంది అనుకొన్నాను. యెన్ని నౌకలని నీవూహ ?

హర్కారు : ముప్పయ్యి. అవిప్పుడు వెనక్కుతిరిగి నేరుగా సైప్రస్‌కి పోతున్నాయి. ప్రభులవారి వీరసేవకుడైన మాంటనో గారు యీ వార్తను తమకు విన్నవించవలసిందిగానూ వారి మాటను నమ్మవలసిందిగానూ ప్రార్థించు తున్నారు.

డ్యూమకు : అయితేవాళ్ళు సైప్రస్‌కి పోయేది యధార్ధమన్నమాట మార్కస్ లుక్కికోసు వూళ్లోలేరా ?

మొ॥ సెనేట్ సభ్యుడు : ఆయనిప్పుడు ఫ్లోరన్సులో వున్నారు.

డ్యూకు : మా తరపున ఆయనకు రాయండి. తక్షణమే మనిషిని పంపండి.

(బ్రాబన్షియో, ఒథెల్లో, కేషియో, ఇవాగో, రోడరిగో, అధికారులూ ప్రవేశం.)

మొ॥ సెనేట్ సభ్యుడు : బ్రాబన్షియోగారూ, వీర ఒథెల్లోగారూ యిటే వస్తున్నారు.

డ్యూకు : వీరఒథెల్లో, మనందరి శత్రువైన టర్కీవాడి మీదకు మేము మిమ్మల్ని తక్షణమే పంపాల్సిన అవుసరం కలిగింది.

(బ్రాబన్షియోతో) మిమ్మల్ని నేను చూడలేదండీ. స్వాగతం. యీ రాత్రి మీరు మావద్ద లేనందువల్ల మా సమాలోచనల కెంతో లోటుగలిగింది.

బ్రాబన్షియో : అలాగే నా విషయంలో గూడా, మీరు లేనందువల్ల, లోటుగలిగింది. నన్ను తమరు క్షమించాలి. నా పదవీ బాధ్యత వల్లగానీ, మరే యితర వ్యవహారంవల్లగానీ నేనిలా మంచం మీదినుండి లేచిరాలేదు. అంతేగాదు. ప్రజావ్యవహారాలవల్ల గూడా యిలారాలేదు. యెందుకంటే నాకు వ్యక్తిగతంగా కలిగిన దుఃఖం తక్కినవాటన్నిటికంటే మించివుంది. అదొక్కటే నన్ను కుంగదీస్తోంది.

డ్యూకు : అయ్యో, యేమిటదీ ?

బ్రాబన్షియో : నా కూతురు! అయ్యో, నా కూతురు!

అందరు : చచ్చిపోయిందా ?

బ్రాబన్షియో : ఆఁ. నావరకూ అంతే! నాకూతుర్ని పాడుచేశారు. దొంగిలించారు. మాయమంత్రాల్తో. కోయమందుల్తో చెడ గొట్టారు. యెందుకంటే కుంటిదిగానీ గుడ్డిదిగానీ వెర్రిదిగానీ పిచ్చిదిగానీ కానటువంటి నా కూతురు అలా మారిపోయిందంటే అదంతా మచ్చుజల్లి మటుమాయలు జెయ్యందే జరగలేదు మహాప్రభో.

డ్యూకు : మీ కుమార్తెను అలా మోసగించి మీకు దూరంచేసిన వాడెవడైనాసరే అందుకు మీ నోటిమీదగానే మీరు తీర్పు యివ్వవచ్చు. అవును. అది చేసింది మా కుమారుడైనా సరే.

బ్రాబన్షియో : అందుకు కృతజ్ఞుణ్ణి. ఆ మనిషి ఇడుగో—మీరు ప్రభుత్వ వ్యవహారం విషయమై ప్రత్యేకంగా పిలిపించిన యీ నీగ్రో.



అందరు : అందుకు మేము చాలా విచారించు తున్నాం.

డ్యూకు : (ఒథెల్లోతో) ఇందుకు మీరేం చెబుతారు ?

బ్రాబన్షియో : యేమీలేదు, అది నిజమని వొప్పుకోటం తప్పితే.

ఒథెల్లో : వీరాధి వీరులైన, పూజ్యులైన పెద్దలారా! ఉదాత్త హృదయులైన నా యజమానులారా! యీ వృద్ధుడి కుమార్తెను నేను తీసికెళ్లాననేది అక్షరాలానిజం. ఆమెను నేను పెళ్లిచేసి కొన్నాననేది గూడానిజం. నేను చేసిన అన్యాయమంతా అదే. అంతకంటే యింకేమీలేదు. నావి మోటుమాటలు మృదువుగా మాట్లాడటం నాకు చాతగాదు. తొమ్మిది నెలలక్రితం వరకూ యీ నాచేతుల్లో యేడుసంవత్సరాల శక్తివుంది. అవి యుద్ధ రంగంలో అత్యంత తీవ్రంగా పనిచేశాయి. అందువల్ల యుద్ధ రంగంలోని విషయాలను గురించి తప్ప నేనీ మహాప్రపంచం లోని విషయాలు నాకు బహుకొద్ది మాత్రమే తెలుసు. కనక నా వ్యవహారం గురించి నేను చక్కగా వాదించుకోలేను. అయినప్పటికీ, తమరు వోర్పుతోవింటే, నాప్రేమగాధ అంతా గూడా వున్నదున్నట్లు మనవి చేస్తాను—యే మందుల్తో, యే మంత్రాల్తో, యే తంత్రాల్తో, యే ఇంద్రజాల మహేంద్ర జాలంతో (అవి నేను చేశానంటున్నారు గనక) నేను వారి కుమార్తెని లోబర్చుకొన్నానో వివరిస్తాను.

బ్రాబన్షియో : వొకరి కంటబడటానికిగానీ వొకరికి యెదురు చెప్ప టానికి గానీ వెఱిచేబిడ్డ; యెంతో సిగ్గుతో వొకమూల వొదిగి వుండే బిడ్డ—గుణం తనం చూడకుండా, జాతీకులం మతం వయస్సూ చూడకుండా, తాను కన్నెత్తి చూడటానికే భయ పడే దాన్ని ప్రేమించడమా ! యిది నమ్మరాని విషయం.

ప్రకృతి విరుద్ధం. యెంతటి టక్కుటమారీ విద్యలవల్ల యిది జరిగిందో తెలిసి కోవలిసిన అగత్యం యెంతవుందో దీన్ని బట్టి తేలుతూంది. అందువల్ల నేను మరోసారి గట్టిగా చెబుతున్నాను. అతడు మందుమాకులు బెట్టి మనసు విరగదీసి నాబిడ్డని బుట్టలో వేసుకొన్నాడు.

డ్యూకు : ప్రత్యక్ష నిదర్శనాలేమీ లేకుండా మామూలు మాటల్తో వాదనల్తో యెంత గట్టిగా చెప్పినా యేంప్రయోజనం లేదు.

మొ॥ సెనేట్ సభ్యుడు : సరే. ఒథెల్లోగారూ, మీరు చెప్పండి మీరు కుయుక్తులద్వారా కుతంత్రాలద్వారా ఆ యువతి మనసు విరిచారా? అలాగాక మంచితనంవల్ల, హృదయం హృదయం కలవటంవల్ల ఆమెప్రేమ సంపాదించారా?

ఒథెల్లో : నామాటవిని సాగిటరీనుండి ఆమెని తీసుకురావటానికి యెవర్నయినా పంపండి. తన తండ్రిగారెదట నిలబడి నన్ను గురించి చెప్పమనండి. ఆమె నన్నుగురించి చెడుగా చెప్పితే యికనన్ను జన్మ జన్మానా నమ్మమాకండి నా వుద్యోగం తీసి వెయ్యండి. అంతేగాదు నాకు మరణశిక్షగూడా వెయ్యండి.

డ్యూకు : డెస్‌డెమోనాని యిక్కడికి తీసుకురండి.

ఒథెల్లో : ఇవాగో, వారిని తీసికెళ్లు నువ్వాచోటు బాగా యెరుగుదువు. ఇవాగో, యిద్దరు ముగ్గురు పరిచారకులూ నిష్క్రమణ.

యికను, ఆమె ప్రేమ నేనెలా సంపాదించానో ఆమె నాప్రేమ నెలా పొందగలిగిందో, ఆమె వచ్చేలోగా భగవత్సాక్షిగా మీకు వినిపిస్తాను.

డ్యూకు : చెప్పు, ఒథెల్లో.



ఒథెల్లో : ఆమె తండ్రిగారికి నేనంటే ప్రేమవుండేది. వారునన్ను తఱచుగా తమయింటికి పిలుస్తుండేవారు. నా జీవిత చరిత్రను గురించి—నేను చేసిన యుద్ధాలనుగురించీ, వేసిన ముట్టడుల్ని గురించీ, నా కష్టసుఖాల్ని గురించీ—చెప్పమని వారు నన్ను అప్పుడప్పుడూ అడుగుతూండేవారు. నేను నా బాల్యంనుంచీ గూడా కథ మొదలెట్టి వారు యెంతవరకూ చెప్పమన్నారో అంతవరకూ ఆకథ చెబుతూండేవాణ్ణి. నాకెదురైన గొప్ప గొప్ప ఆపదల్నిగూర్చి. భూమిమీదా నీటిమీదా నే ననుభవించిన బాధల్ని గూర్చి. వెంట్రుకవాసిలో నాకు చావుతప్పిన సంఘటనల్ని గూర్చి, నన్ను వొకప్పుడు శత్రువు బందీచేసిన బానిసగా అమ్మివేసిన గాథగూర్చి, అక్కడినుండీ నేను విముక్తి జెందినాక చేసిన ప్రయాణంలో నా నడతనుగూర్చి, ఆ ప్రయాణంలో నేను చూసిన పెద్దపెద్ద కొండ గుహల్నీ, యెడారుల్నీ, వేట జంతువుల్నీ, బండరాళ్లనీ, ఆకాశాన్నంటే పర్వతాల్నిగూర్చి, నేను చెప్పేవాణ్ణి. అలా జరిగేది మా సంభాషణ. అంతేగాదు. వొకర్నొకరు తినే నరమాంస భక్షకుల్ని గూర్చి, భుజాలక్రింద రొమ్ముమీద తలలుండే మనుషుల్ని గూర్చిగూడా చెబుతుండే వాణ్ణి. యీ కథలు వినటమంటే డెస్‌డెమోనాకి యెంతో ఇష్టం. పనుంటే పోయి త్వర త్వరగాచేసి మళ్లా తిరిగి వచ్చేది. నెను చెప్పేదంతా యెంతో శ్రద్ధగా వినేది. అదంతా నెను గమనించాను. వొకసారి వీలు చిక్కినప్పుడు ఆమెతో మాట్లాడాను. నా కథంతా సవిస్తరంగా అప్పటికప్పుడే చెప్పాలని హృదయ పూర్వకంగా అడిగింది. నా కథను ఆమె కొద్ది కొద్దిగా అక్కడక్కడా విన్నదేగాని సొంతం వినలేదు. అదిగూడా పరాకు

గాను. అందువల్ల నేను అంగీకరించాను. నాయువ కత్వంలో
నాకు వచ్చిన విపత్తుల్ని కొన్నిటిని గురించి చెబుతూంటే
ఆమెకి జలజలా కన్నీరు గారేది. తరచూ నేను వోదార్చేవాణ్ణి.
నా కథ ముగించినాక ఆమె సానుభూతితో నిట్టూర్పులు విడి
చేది. అదంతా వింతగా యెంతో వింతగా వుందనీ, జాలి
కరంగా యెంతో జాలికరంగా వుందనీ ఆమె వొట్టు పెట్టు
కొని అనేది. అలాంటి కథ వినకుండా వుంటే బాగుండే
దనేది. అయినప్పటికీ, తనని భగవంతుడు అలాంటి పురు
షుడుగా పుట్టించి వుండరాదా అనుకొనేది. నా కథకు నన్నామె
అభినందించింది. ఆమెను ప్రేమించిన నా మిత్రు డెవరైనా
వుంటే నేను ఆ కథ చెప్పడం యెలాగో అతడికి నేర్పితే సరి
అతణ్ణి తాను తనని పెండ్లాడమని కోరుతానన్నది. అది అవ
కాశంగా తీసుకొని నేను నాహృదయంలో వున్నది వెల్లండి
చాను. నేను గడిచి గట్టెక్కిన గండాలకు ఆమెనన్ను
ప్రేమించింది ; ఆమె వాటిపట్ల సానుభూతి చూపి నందుకు
నేనామెను ప్రేమించాను. నేనుపయోగించిన మంత్రవిద్య
అంతా యిదే. అదుగో ఆమెరానే వస్తున్నది. ఆమె నోటిమీద
గానే ఆ విషయం చెప్పనివ్వండి.

(డెస్‌డెమోనా, ఇవాగో, పరిచారకులూ ప్రవేశం)

డ్యూకు : యీ కథవింటే నా కుమార్తె అయినా గూడా వశమై
పోతుందను కొంటాను. బ్రాబన్షియోగారూ, అయిందేమో
అయిపోయింది. అయినదానికి విచారించకుండా ఆనందించ
టానికి ప్రయత్నించండి. సజ్జనులు సన్మార్గాలే చేబట్టుతారుగాని
చెడుమార్గాలూ వెదకరు.



బ్రాబన్షియో : నా బిడ్డ చెప్పేదేమిటో వినమని మిమ్మల్ని
ప్రార్థిస్తున్నా. యిందులో సగం నిజమైనా అతణ్ణి అన్యాయంగా
నిందించినందుకు నాతల పగిలిపోతుంది! యిలారామ్మా.
యింతమంది పెద్దమనుషుల్లోనూ నువ్వెవరిపట్ల యెక్కువ
వినయ విధేయతలు చూపాలో తెలుస్తూందా ?

డెస్‌డెమోనా : నాన్నా, యిక్కడ వినయవిధేయత లనేవి విభాగించ
బడి వున్నాయను కొంటున్నాను. నన్ను కని పెంచి విద్యా
బుద్ధులు నేర్పినందుకు నీకునేను ఋణపడివున్నాను. నా జీవి
తమూ చదువు సంధ్యలూ నేను నిన్నెలా గౌరవించాలో నేర్పు
తున్నాయి. నీపట్లనాకు ప్రధాన బాధ్యతుంది. ఇంతకు క్రితం
వరకూ నేను కేవలం నీబిడ్డను మాత్రమే. కాని, ఇడుగో
నాభర్త. నాతల్లి తన తండ్రికి బదులు నిన్నెంచుకొని నీపట్ల
తన విధిని యెలా నిర్వహించుకొందో అదేవిధిని నేను
నా సిద్దీభర్తకు చూపాలని కోరుతున్నాను,

బ్రాబన్షియో : అయితే యిక దేముడేనీకుదిక్కు యిక నాపని
తీరిపోయింది. ప్రభువుగారిక ప్రభుత్వ వ్యవహారాలు చూసుకో
వచ్చు. కన్నబిడ్డలకంటే పెంపుడుబిడ్డలు మేలు. యిలారా,
సిద్దీ. నేను మనసారా నావద్ద వుంచుకో గోరేదాన్ని, నీకిది
వరకే అది లేకపోతే, మనసారా నీకిచ్చివేస్తున్నాను. చిట్టీ,
నిన్నూ నీ నడతనూ చూస్తే యిక నాకేబిడ్డలూ లేనందుకు
దిగులుగా లేదు. యెందుకంటే వాళ్లేవున్నట్లయితే కటిక
వాణ్ణయ్యిపోయి మెడకీ కాలికీ గుదిబండలు కట్టేసి వుండే
వాణ్ణి. యిక నాపని తీరిపోయింది ప్రభూ.

డ్యూకు : నేను గూడా మీహుందా తనానికి తగినవిధంగానే
మాట్లాడి యీ ప్రేమికులు మీ ప్రేమకు అర్హులయేట్లు చేయ

నివ్వండి. యేదైనా వ్యాధికి మందులేనప్పుడు ఆశలన్నీ వదులుకొని యిక నావ్యాధి నయం కాదనుకొంటే యేదిగులూ చింతా వుండదు. విధిరాతకు వోర్పువహించినవాడే విజ్ఞుడు. బాధపడేవాడు పక్కన నవ్వితే బాధకొంత తగ్గుతుంది. అలాగాక బాధపడేవాడు పెద్దపెట్టున యేడుస్తూ కూచుంటే ఫలితం పూజ్యం.

బ్రాబన్షియో : అయితే టర్కీవాణ్ణి సైప్రసును దొంగిలించనివ్వండి. మనం పక్కన నవ్వినంతసేపూ మనకే బాధా వుండదుగద మరి. ముల్లు గుచ్చుకోనివాడికి ముల్లుబాధ యెలా వుంటుందో తెలీదు. కాని ముల్లు గుచ్చుకొన్నవాడు వోర్పు చూపాలి గాబట్టి ముల్లునీ, బాధనీ రెంటినీ భరిస్తాడు. సుఖానికో దుఃఖానికో యీ రెండూ రెండువిధాలా సమానమే కాని మాటలంటే మాటలేగద. ఐనా మాటలు చెవులగుండా జొరబడి మూల్గుతూన్న గుండెలో ములుకుల్లాగా గుచ్చుకొంటాయనే సంగతి నా కిప్పుడే అనుభవమయింది. యిక ప్రభుత్వ వ్యవహారాల విషయం చూసుకోమని మిమ్మల్ని ప్రార్థిస్తున్నాను.

డ్యూకు : టర్కీవాడు బలమైన నావికాదళంతో సైప్రస్ మీదకు పోతున్నాడు. ఒథెల్లో, సైప్రెస్ యెంత కట్టు దిట్టంగావుందో మీకుతెలుసు. గతంనుండీ అదెంత బలవత్తరం వున్నప్పటికీ మా అభిప్రాయ మేమంటే మీ నాయకత్వంవుంటే అది సురక్షితమని. అందువల్ల మీరు మీకు కొత్తగా లభించిన సుఖాన్ని వదులుకొని, కష్టాలకూ నష్టాలకు సిద్ధమై అక్కడ పోవాలిసుంది.



ఒథెల్లో : పూజ్య సెనేట్ సభ్యులారా, కర్తవ్యం అనే దానివల్ల నాకు కత్తుల పరుపుమీద పడుకొనే అలవాటుంది. కష్టాలంటే సునాయాసంగా చురుకుగా యెదుర్కొనే సత్తా నాకుంది. అందువల్ల ఒటోమైట్లకు వ్యతిరేకంగా యీ యుద్ధం నడపటానికి నేను సిద్ధంగా వున్నాను. కనక నాభార్యకు తగిన విధంగా యిక్కడ వుండే యేర్పాట్లు చేయవలసిందిగా మిమ్మల్ని వినయపూర్వకంగా ప్రార్థిస్తున్నాను. ఆమెకు తగిన వసతీ ఆహారమూ సమకూర్చండి.

డ్యూకు : మీకిష్టమైతే ఆవిణ్ణి తన తండ్రిగారింట్లో వుండనివ్వండి.

బ్రాబన్షియో : నేకోప్పుకోను.

ఒథెల్లో : నేనుగూడాను.

డెస్‌డెమోనా : నేనుగూడా అక్కడుండటానికి యిష్టపడను. యెందుకంటే నిత్యమూ ఆయన కళ్లెదటవుంటే నిత్యమూ ఆయనకు బాధకలిగించిన దాన్నవుతాను. మహాప్రభూ. నేను మనవి చేసేదివిని నా మనవిని ఆమోదించండి.

డ్యూకు : అదేమిటో చెప్పమ్మా, డెస్‌డెమోనా.

డెస్‌డెమోనా : ఈ సిద్దీతో కలిసి జీవించటానికే నేను వారిని ప్రేమించాననేది నా తండ్రికినేను యెదురుతిరుగటంలోనూ కష్టాలు భరించటానికి సిద్ధంగావటంలోనూ అందరికీ స్పష్టంగా తెలుస్తూనేవుంది. నా గుణం నా భర్తగుణం వంటిదిగానే మారిపోయింది. ఆయన హృదయ సౌందర్యం యెలాంటిదో నేను చూశాను. ఆయన కీర్తి ప్రతిష్టలకూ శౌర్య పరాక్రమాలకూ నా ఆత్మనూ నా జీవితాన్నీ అంకితం చేశాను. అందువల్ల, ప్రియమైన ప్రభువులారా, ఆయన యుద్ధానికిపోగా నేను

యింట్లో గోళ్లు గిల్లుకొంటూ కూచుంటే నేనెందుకు ఆయన్ని ప్రేమించి పెళ్లాడానో అదంతా బూడిదలో పోసిన పన్నీరవుతుంది. ఆయన నాసరసన లేకపోతే నా జీవితం అడివికాచిన వెన్నెలవుతుంది. కనకనన్ను ఆయనవెంట వెళ్లనివ్వండి.

ఒథెల్లో : ఆమె కోర్కెకు మీ ఆమోదం తెలపండి. నా ప్రేమ దాహం తీర్చుకొనడానికిగానీ, కామోద్రేకం చల్లార్చుకోడానికిగానీ, నేనిలా అనడంలేదని భగవత్సాక్షిగా చెబుతున్నాను. ఆమె హృదయానికి వుల్లాసమూ ఆనందమూ కలిగించటానికే అలా అంటున్నాను. అంతేగాదు ఆమె నా సరసన వున్నంత మాత్రంచేత మీ గురుతరకార్య నిర్వహణలో అలసత్వం చేస్తానని మీరు అనుకోవద్దని కోరుతున్నాను. ఉహూఁ. వొకవేళ కామకలాపాలతో మత్తెక్కినా కళ్లు మూసుకుపోయినా కర్తవ్యం మరిచిపోతే ఇలాల్లిను నాముఖాన పేడకళ్లాపి కొట్టనివ్వండి; సిగ్గుతో అవమానంతో నా కీర్తి ప్రతిష్టలు మంటగలవ నివ్వండి!

డ్యూకు : ఆమె యిక్కడ వుండటమో లేక మీవెంబడి రావటమో అది మీరే నిర్ణయించుకోండి. పోతే యికను మన వ్యవహారం చాలా ముఖ్యమైనది. శీఘ్రంగా కదలట మొక్కటే దానికి జవాబు. యీ రాత్రే మీరు బైలుదేరి వెళ్లాలి.

ఒథెల్లో : హృదయ పూర్వకంగా.

డ్యూకు : వుదయం తొమ్మిదింటికి మళ్లా మనమిక్కడ కలిసికొందాం. ఒథెల్లో. యెవరైనా ఒక అధికారిని వెనకదిగ విడిచి వెళ్లండి. అలాచేస్తే మావుత్తర్వు లేమిటో మీకు పంపుతాము. మీకు అవసరమైన సలహాలూ సూచనలూ యేమిటో తెలియపర్చుతాం.



ఒథెల్లో : చిత్తం నా పతాకధారి నిజాయితీపరుడు. నమ్మకస్తుడు. నాభార్యను తీసికొచ్చే బాధ్యతా. అంతేగాక మీరు యే సమాచారం పంపాలనుకొంటారో అది తీసికొచ్చేబాధ్యతా అతడి మీద వదిలిపెడుతున్నాను.

డ్యూకు : సరే అలాగే కానివ్వండి. అందరికీ నమస్కారం (బ్రాబన్షియోతో) దొడ్డగుణానికి తగిన దేహకాంతి లేకపోయినా, నీ అల్లుడు దేహకాంతికంటే దొడ్డ సౌందర్యం గలవాడు.

మొ॥ సెనెట్ సభ్యుడు : వీరసిద్ధీ. శెలవు. డెస్‌డెమోనాని చక్కగా చూసుకోండి.

బ్రాబన్షియో : నీకు కళ్లుంటే ఆమెవంకచూడు, సిద్ధీ. తండ్రిని మోసగించింది నిన్నుగూడా మోసగించవచ్చు. (డ్యూకుతో, సెనెటర్లతో, అధికారులు మొ॥ వారితో నిష్క్రమణ)

ఒథెల్లో : ఆమె విశ్వాస పాత్రురాలనేందుకు నా ప్రాణంపణంగా వొడ్డుతాను!—ఇవాగో, నా డెస్‌డెమోనాని నీ చేతుల్లో పెడుతున్నాను. నీ భార్యను ఆమెకు పరిచర్య చేయమనిచెప్పు. తగిన సమయం చూసి వారిని తీసుకురా. రా, డెస్‌డెమోనా. యిక మన సరస సల్లాపాలకీ వాటికీ వొక్కగంట మాత్రమే అవకాశముంది. మనం కాలధర్మానికి కట్టుబడాలి. (డెస్‌డెమోనా ఒథెల్లోల నిష్క్రమణ)

రోడరిగో : ఇవాగో!

ఇవాగో : యేమిశెలవు, మహారాజా ?

రోడరిగో : నేనిక యేంచెయ్యా లంటావు ?

ఇవాగో : యేముందీ, యింటికెళ్లీ మంచంమీద పడుకొనిహాయిగా నిద్రపొమ్మంటాను.

రోడరిగో : నేను తక్షణమే నీటిలోదూకి చస్తాను.

ఇవాగో : నువ్వాపనిచేస్తే, నిన్నిక యెంతమాత్రమూ ప్రేమించను. వారెవా, యెంత వెర్రివాడివయ్యా!

రోడరిగో : బతుకు భారమైనప్పుడు బతకటం వెర్రితనం. చావటమే అందుకు తగినమందు అయినప్పుడు చావేసుఖం.

ఇవాగో : ఛీ, అదినీచం ! యీలోకాన్ని యేడు సంవత్సరాల కాలంలోనూ నాలుగుసార్లు చూశాను. లాభమేదో నష్టమేదో నాకు తెలుసు గనక, తనని తానెలా ప్రేమించు కోవాలో యెరిగిన మనిషిని నేనింతవరకూ చూడలేదు. కానీడబ్బు కోసం కాటికి పోవడానికి సిద్ధమయ్యేకంటే గాడిదగా పుట్టి గంతలూ బొంతలూ మోయటం మంచిది.

రోడరిగో : అయితే నేనేం చెయ్యాలిమరి ? అంత వెర్రి మోహంలో పడిపోవటం సిగ్గుచేటని నాకు తెలుసు. కాని మనసులో పుట్టిన దాన్ని మార్చుకోగల గుణం నాలోలేదు.

ఇవాగో : గుణమా ! వట్టి చెత్తమాటది ! మనం యిలాగో అలాగో వున్నామంటే అందుకు బాధ్యతమనదే. మనదేహాలు మన తోటలు. మనసంకల్పం అనేది ఆ తోటల్లోని తోటమాలి. కనక ఆ తోటల్లో జీల్లేళ్ళూ మల్లేళ్ళూ నాటాలో, తుమ్మ చెట్లూ దురదగొండె చెట్లూ పెంచాలో, లేక, గులాబీ మొక్కలూ పారిజాతం మొక్కలూ, పండ్ల మొక్కలూ నాటాలో, కలుపు తియ్యాలో అక్కర్లేదో- యెరువేసి నీరెట్టి వాటిని బాగా పెంచాలో లేక బీడు భూమిగా



మార్చాలో-ఆ మంచీ చెడూ అంతా మన సంకల్పంలోనే వుంధి. యేదిమంచో యేది చెడో, యేది ఉత్తమమో యేది అధమమో తెలిసికొనే శక్తి మనలో శూన్యమైతే మనలోని నీచబుద్ధి మనల్ని నీచాతి నీచమైన స్థితికి దిగ జార్చుతుంది. కాని, మన ఆవేశాలనూ వుద్రేకాలనూ, అడ్డూ అపూలేని కామాలనూ తామసాలనూ చల్లబర్చుకునే వివేచనా జ్ఞానం మనకుంది. కనక నువ్వు ప్రేమ అనీ పిలిచేది వట్టి వెర్రి మాత్రమేనని నేనంటాను.

రోడరిగో : కాదు.

ఇవాగో : అది వేడిరక్తంలో పుట్టిన కామోద్రేకం మాత్రం. అందుకు నీ సంకల్పం జాగా యిచ్చింది. రా. అది వదిలి పెట్టు. పురుషుడిలాగా ప్రవర్తించు ! మునిగి చావటమా ? పిల్లులూ, గుడ్డి కుక్క పిల్లలూ మాత్రమే మునిగిచస్తాయి ! చూడు. నేను నీ మిత్రుణ్ణని చెఖుతున్నాను. నువ్వుగూడా అందుకు తగినట్లుగా గట్టిగానిలబడు. నీకు సహాయం చెయ్యటానికి నాకింతకంటే మంచిసమయం దొరకదు. డబ్బును సంచిలోవేసుకో ఆ యుద్ధం జరిగేచోటికిపో. మారువేషం వేసుకో చూడూ, డబ్బును నీసంచిలోవేసుకో ఆ సిద్దీగాణ్ణి డెస్డెమోనా యింకెంతోకాలం ప్రేమించదు—డబ్బును నీసంచిలో వేసుకో — యికను వాడుగూడా అంతే. అదంతా అనుకోకుండా వొక్కసారిగా వుద్రేకాల్తో ఆరంభమైంది, యెంత పెరుగుడకి అంత విరుగుడుందని తెలిసికో. డబ్బుని మాత్రం నీసంచిలో వేసుకో యీసిద్దీ వాళ్లది గడియ కొకమాట గంట కొకపాట నీసంచిని డబ్బుతో నింపుకో యిప్పుడు వాడికి మామిడిపండులాగా మధురం వున్నది రేపు కాకరకాయలాగా

కట్టుచేదుగా వుంటుంది. యివాళో రేపో ఆమె యవ్వనంలో వున్న యువకుడివైపు మొగ్గకమానదు. వాడంటే తృప్తితీరి నాక తానెంత త్వరపడి తప్పుచేసిందో ఆమెకి తెలిసి వస్తుంది. కొత్త వాకవింత, పాతవాకరోత అది తప్పదు. కనక డబ్బును నీసంచిలో వేసుకో. ఒకవేళ నువ్వు చావదలుచుకొంటే నీటిలో మునిగి చచ్చే చావుకంటె మంచి సున్నితమైన చావు వెతుక్కో. యెంతడబ్బు పోగుచెయ్యగలవో అంత డబ్బూ పోగుచెయ్యి వాక అడివిమనిషీ జిత్తులమారి వెనీసు ఆడదీ చేసుకొన్న ప్రమాణాలూ బాసలూ లోని పస యెంత వుందో నాకేగనక తెలిసివున్నట్లయితే నీకు ఆమె దక్కుతుందని ఘంటాపథంగా చెప్పగలను. కనక డబ్బు పోగుచెయ్యి. ఛీ, నీటిలో మునిగి చావటమా! దానిసంగతి యెత్తనే గూడదిక ఆమెని అనుభవించకుండా నీటిలో మునిగి చచ్చేకంటె, ఆమెని అనుభవించి వురిశిక్షపడి చావు.

రోడరిగో : నేను నువ్వు చెప్పింది చేస్తానుగాని మరినువ్వు నీమాటమీద నువ్వు నిలబడతావా ?

ఇవాగో : నా విషయంలో యేమాత్రమూ సందేహించమాక. పో. డబ్బు పోగుచెయ్యి ఆ సిద్దీగాడంటే నాకు చచ్చేంత ద్వేషముందని యిదివరకు నీకు అనేకసార్లు చెప్పాను, మళ్లీ యిప్పుడు వందసార్లు చెబుతున్నాను. నా ద్వేషం నా గుండెలో పుట్టింది. నీదీ అంతకన్నా తక్కువేమీగాదు. కనక పగ సాధించడంలో మనం యేకమై పగసాధించుదాం. నువ్వు వాడి భార్యని వశపర్చుకో గలిగితే నీకు సుఖం నాకు సరదా ముందుముందు యెన్నోవిషయాలు జరగవలసి వున్నాయి.



కనక వెనక్కితిరుగు! ముందుకు నడువ్! డబ్బు పోగుచెయ్యి. దీన్ని గురించి రేపు మనం మరింత మాట్లాడుకొందాం. శెలవు.

రోడరిగో : రేపుదయం యెక్కడ కలిసి కొందా మంటావు ?

ఇవాగో : నా బసలో ?

రోడరిగో : అయితే నేను పెందరాళే నీ దగ్గిర కొస్తాను.

ఇవాగో : యికపద. శెలవ్—విన్నావా, రోడరిగో ?

రోడరిగో : యేమిటది ?

ఇవాగో : మునగటం గినగటం యిక పనికిరాదు సుమా. తెలిసిందా ?

రోడరిగో : నేను మనసు మార్చుకున్నా. పోయి, నా భూమంతా అమ్మి పారేస్తా. (నిష్క్రమణ)

ఇవాగో : వెర్రి వెంగళప్పలన్ని అలా డింకీ కొట్టించి సొమ్ము సంపాదిస్తున్నాను. సరదాకీ, సొమ్ముకీ గాకపోతే మరి అలాంటి దద్దమ్మల కోసం చచ్చు పెద్దమ్మలకోసం నా తెలివి తేటల్ని వృధా చేస్తానా ? ఆ సిద్దీగాడంటే నాకు సచ్చేంత ద్వేషం. నేను కన్నంలో కత్తిలాగా నా పని చేస్తూంటాననే వాడుకొకటివుంది. ఆ పుకారు నిజంగా వుందో లేదో నాకు తెలవదుగాని అది నిజంగా వుందనుకొనే అలా నడుచుకొంటాను. నేనంటే వాడికి మంచి నమ్మకముంది. అది నా పనికి మరింత మంచిది. కేషియో అందగాడు. ఆఁ, యేంచెయ్యాలో చూడనియ్యి వాడి స్థానం నాకు దొరికేట్లు చేసుకోటం, నా కోరిక తీర్చుకోటం—భేష్, వొకే దెబ్బకు రెండు పిట్టలు! అయితే మరి యింతకీ అది జరిగేదెలా, యెలా ? ఒథెల్లో భార్యతో వాడు బాగా కలిసి మెలిసి తిరుగుతున్నాడని కొంత కాలమై

నాక ఒథెల్లో చెవుల్లో వూది వాడిమనసు చెడగొట్టాలి. కేషియో అందం చదం చూస్తే అనుమానం కలగక మానదు. అలాంటి అందమే ఆడవాళ్లని బొందలో పడ గొట్టేది. ఆ సిద్దీ గాడు కపటంలేని మనిషి. నిజాయితీగల మనిషి పైకి నిజా యితీగా కనిపించే వాళ్లని చూసి నిజంగా వాళ్ల అలాంటి వాళ్లేనని నమ్ముతాడు. వాణ్ణి యెటుబడితే అటు బొమ్మలాట ఆడించొచ్చు. ఆఁ. చిక్కిందిరా మిడతంభొట్లూ! అదీ సంగతి! యెంత మోసమైనాచేసి యిది జరిగేట్లు చెయ్యాలి.

(నిష్క్రమణ)

---

# రెండవ అంకం

## మొదటి రంగం : సైప్రసులో ఒక నౌకాశ్రయం. దాని ముంగిట ఒక ఖాళీ స్థలం

(మాంటేనో, యిద్దరు పెద్ద మనుష్యులూ ప్రవేశం)

మాంటేనో : అదుగో అగ్రం నుండి మీకేం కనపడుతూందో చెబుతారా?

మొదటి పెద్ద మనుష్యుడు : యేమీ లేదండి. అదొక పెద్ద అల. అంతే. సముద్రం మీద నౌక వొక్కటి గూడా అగుపించటం లేదు.

మాంటేనో : భూమి మీద గాలి బాగా విసిరికొట్టిందనుకొంటాను. యెందుకంటే దాని తాకిడికి మన బురుజు గోడలు వూడి పోయాయి. అంత గాలి నేనిది వరకు చూడలేదు. సముద్రం మీదే అంత గాలి లేస్తే యే నౌకైతే మాత్రం బద్దలవకుండా వుంటుంది? మరిదాన్ని గురించిన సమాచార మేమిటంటారూ?

రెండవ పెద్దమనుష్యుడు : టర్కీ నౌకాదళం చెల్లాచెదరయింది. నురగలుగక్కే వొడ్డున నుంచుని చూస్తూంటే ఆకాశాన్ని యెరిగి తన్నుతూన్న అలలు కనపడుతున్నాయి. సముద్రపు వాగలు జీరు భేరుమని యెగిరి నక్షత్రాల మీద నీటిని గుమ్మ రించు తున్నాయి. యింత బ్రహ్మాండమైన తుపానును నేనిం తకు ముందు చూడలేదు.

మాంటేనో : ఆ టర్కీ నౌకాదళానికి రక్షణ దొరక్క పోతే మునిగి చావటమే యిక మిగిలేది. వాళ్లు నిలదొక్కుకోటం అసాధ్యమనుకొంటాను.

(మూడవ పెద్ద మనుష్యుని ప్రవేశం)

మూడవ పెద్ద మనుష్యుడు : శుభవార్త, శుభవార్తోయ్! మన యుద్ధం ముగిసిందిక. తుపాను ధాటికి టర్కీవాళ్లు తుక్కు తుక్కు అయ్యారు. వాళ్ల పన్నాగం నీటగలిసింది. వెనిస్ నుండి వస్తూన్న నౌకలోనివారు టర్కీవాళ్ల చాలాభాగం దుగ్గు దుగ్గు అయివుండటం చూశారు.

మాంటేనో : యేమిటీ!? నిజంగానా?

మూ॥ పెద్దమనుష్యుడు : అదివెరోనాలో తయారైన నౌక. అక్కడుంది. ఒథెల్లో లెఫ్టినెంటైన మైకేల్ కేషియో వొడ్డుమీద కొచ్చాడు. ఒథెల్లో యింకా సముద్రంమీద వున్నాడు. సైప్రస్ సర్వాధికారిగా వచ్చాడు.

మాంటేనో : సంతోషం. వారు అన్నివిధాలా తగిన గవర్నరు.

మూ॥ పెద్దమనుష్యుడు : కాని, టర్కీ వాళ్లకి దెబ్బ బాగా తగిలిందని చెప్పిన యీ కేషియో యే ఒథెల్లో సురక్షితంగా వొడ్డు చేరాలని ప్రార్థిస్తున్నాడు. తాము తుపానులో చిక్కుకొని విడిబడి పోయారట.

మాంటేనో : వారు సురక్షితంగా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థించుదాం. వారిక్రింద నేను పని చేశాను. వారు ముమ్మూర్తులా యోగ్యమైన సైనికుడు. సముద్రపు వొడ్డుకి పోదాం పదండి! వచ్చిన నౌకనూ చూడొచ్చు. ఒథెల్లోగారున్న నౌకకనపడుతుందేమో గూడా చూడొచ్చు.



మూ॥ పెద్దమనుష్యుడు : రండి పోదాం. యే క్షణాన్నయినా యెవరైనా రావొచ్చు.

(కేషియో ప్రవేశం)

కేషియో : ఒథెల్లో నారిని అంత మెచ్చుకొంటూన్న యీ వీర ద్వీప వీరవాసులకి అభివందనాలు! భగవానుడు ఆయన్ని యీ తుపాను బారి నుండి తప్పించుగాక! తుపాను తీవ్రంగా వున్న సమయంలో మే మిద్దరం విడివడి పోయాం.

మాంటేనో : వారి నౌక దృఢమైందేనా?

కేషియో : వారి నౌక కుపయోగించిన కఱ్ఱ చాలా గట్టిది. నౌక నడిపేవాడు ఆ పనిలో అందెవేసిన చెయ్యి. అందువల్ల వారి కేప్రమాదమూ జరగదని నా నమ్మకం.

(లోన నుండి "నౌక, నౌక, నౌక"! అని వినపడుతుంది)

(ఒక హర్కారు ప్రవేశం)

కేషియో : యేమిటా ధ్వని?

హర్కారు : వూళ్లో వొక్క పురుగు లేదు. అందరూ సముద్రపు వొడ్డుకి పరుగెత్తుకు పోయి నుంచుని నౌక నౌకని అరుస్తున్నారు!

కేషియో : అది గవర్నరు గారిదేనని నా నమ్మకం.

(ప్రేలుడు ధ్వని)

రెం॥ పెద్దమనుష్యుడు : గౌరవ సూచకంగా ఫిరంగులు కాలుస్తున్నారు. వారు మన వారేయిక.

కేషియో : అయ్యా, దయచేసి మీరుపోయి చూసి ఆ వచ్చిందెవరో మాకొచ్చి చెప్పండి.

రెం॥ పెద్దమనుష్యుడు : సరే. (నిష్క్రమణ)

మాంటేనో : అది సరేగాని, లెఫ్టినెంటుగారూ, మీ జనరల్ గారికి పెళ్లయిందా?

కేషియో : భేషైన సమ్మధం. వారు యెంతో అదృష్టవంతులు. పెళ్లికుమార్తె యెటువంటిదో చెప్పటానికి మాటలు చాలవు. అంత మంచి గుణాలు గలది. అంత అందమైనది.

(రెండవ పెద్ద మనుష్యుని ప్రవేశం)

యేమిటివార్త? యెవరా వచ్చింది?

రెం॥ పెద్దమనుష్యుడు : అతడు ఇవాగో అనేవాడు. జనరల్‌గారి పతాకధారి.

కేషియో : అదృష్టం నోట్లోంచి వూడిపడ్డారు. చెలరేగే తుపానులూ, వుప్పొంగే సముద్రాలూ, బొబ్బరించే గాలులూ, కనపడకుండా దాక్కొని నౌకకు తాకే యిచ్చే నీటిలోని కొండలూ, నౌకకు బందాలు వేసే యిసుకదిబ్బలూ గూడా సౌందర్య ప్రీతితో తమ తాకిడీ లేకుండా చేసి దేవకన్య డెస్‌డెమోనాను సురక్షితంగా వొడ్డు జేరనిచ్చాయి.

మాంటేనో : ఆమె యెవరూ?

కేషియో : నేనింతకు మీతో చెప్పినామె. మన కెప్టెన్‌గారి కేప్టన్. ఇవాగోను తీసుకురమ్మని ఆమెని ఇవాగోకు అప్పగించారు. అతడిలా రావటంచూస్తే అనుకొన్నదానికి వారం రోజుల ముందే వచ్చాడన్నమాట. ఓ భగవాన్! ఒథెల్లో నౌక



యీ నౌకాశ్రయంలో ప్రవేశించి, ఒథెల్లో ప్రేమాతిరేకంతో డెస్‌డెమోనాని కౌగలించుకొని, దిగాలుపడివున్న మాకు వుత్సాహం కలిగించి, మొత్తం సైప్రసుకి వూరట కలిగించేందుకు నీ శ్వాసనంతా వుపయోగించి వారి తెరచాపలకు గాలి లభించేట్లు చేసి వారి నౌక శీఘ్రంగా యిక్కడికి వచ్చేట్లు చెయ్యి!

(డెస్‌డెమోనా, ఇవాగో, రోడరిగో, ఎమీలియా, పరిచారకుల్తో ప్రవేశం)

అదుగో చూడండి! నౌకలోని నిధంతా వొడ్డెక్కింది! సైప్రస్ జనులారా! ఆమెకు మోకరిల్లి నమస్కారం చేయండి. జేజేలు, నారీమణీ! భగవానుడు నీకు అన్నివిధాలా తోడ్పడుగాక!

డెస్‌డెమోనా : కృతజ్ఞురాలిని, వీర కేషియో. నా ప్రభువు సమాచారం మీ రేమన్నా చెప్పగలరా?

కేషియో : వారింకా రాలేదు. వారు క్షేమంగానే వున్నారనీ త్వరలోనే యిక్కడికి రాగలరనీ తప్పితే నా కింకేమీ తెలవదు.

డెస్‌డెమోనా : అయ్యో! అయినా నాకు అదటుగావుంది. మీ రెప్పుడు విడబడిపోయారు?

కేషియో : తుపాను వచ్చినపుడు.

(లోన నుండి "నౌక! నౌక! అనే కేకలు. ప్రేలుడు ధ్వని)

అదుగో వినండి! యేదో నౌక!

రెం॥ పెద్ద మనుష్యుడు : ఫిరంగులు కాల్చి స్వాగతం యిస్తున్నారు. ఇది గూడా మన మిత్రుల నౌకే.

కేషియో : యెవరో చూసిరండి (పెద్దమనుష్యుని నిష్క్రమణ) స్వాగతం, ఇవాగో. (ఎమీలియాతో) స్వాగతమమ్మా.

నా మర్యాదల్లో నేను కొంచెం అతిగాపోతే అపార్థం చేసికోమాక, ఇవాగో. ఇలా నేను సాహసించటం నాకు పెంపకంతో వచ్చిన అలవాటు (ఆమెను ముద్దుపెట్టుకొంటాడు)

ఇవాగో : అయ్యా, తరచుగా నన్నెన్నిటమాలంటుందో అన్నిసార్లు తమని ఆమె ముద్దు పెట్టుకొంటే మీకు సరిపోయినట్లు.

డెస్‌డెమోనా : పాపం! మాటా పలుకూ లేకుండా నిలబడి పోయింది.

ఇవాగో : అమ్మో, చాలా మాటలొచ్చు. సరిగ్గా నేను నిద్రపోవాలను కొన్నప్పుడే ఆమె నోరు గల గల లాడుతుంది. అమ్మగారూ, ఆమె యిది సమయంగాదని సరిపెట్టుకొని వూరుకొని వుంటుంది.

ఎమీలియా : మీరలా అనవలసిన అవుసరం లేదే.

ఇవాగో : వోస్పెబ్బో తాతకు దగ్గుట నేర్పుతావా? మీరు బయట బజార్లో పత్తిత్తులు. విందు సమయంలో వీణలు. యింటి పనుల్లో కొంటెగాళ్లు, యికను పడక మంచంమీద పచ్చి గయ్యాళులు.

డెస్‌డెమోనా : ఛీ, పో, నిందలమారీ!

ఇవాగో : కాదండీ, అది నిజం. నేనబద్ధమాడితే అడ్డగాడిద ననుకోండి. మీరు ఆడుకోటానికి నిద్ర లేస్తారు; పని జెయ్యటానికి పడుకొంటారు.

ఎమీలియా : నా పొగడ్తలు మీరేమీ పొగడొద్దులే.

ఇవాగో : అవును. పొగడనియ్యమాక.

డెస్‌డెమోనా : నన్ను గురించి పొగడవలసి వస్తే యేమని పొగుడుతావు?



ఇవాగో : అమ్మగారూ, నన్నది అడగమాకండి. వంకలు పెట్టటం తప్పితే నా కింకొకటి చేత గాదు.

డెస్‌డెమోనా : కానివ్వు మరేం ఫర్వాలేదు—నౌకాశ్రయానికి వొకరెళ్లారుగదూ?

ఇవాగో : అవునండీ.

డెస్‌డెమోనా : నాకు సంతోషంగాలేదు. అయినా సంతోషంగా వున్నట్లు నటించుతాను. కానివ్వు; నన్నెలా పొగుడుతావు?

ఇవాగో : అదే ఆలోచిస్తున్నా. కాని నాది నసాళాని కంటే పొగడ్త. మెదడూగి దడూ మంటెత్తిపోతుంది. ఆఁ నాబుర్ర పని చేస్తున్నది. యిదుగో వినండి: ఆమె సుందరీ సూక్ష్మబుద్ధిగలదీ అయితే, సౌందర్యం సూక్ష్మబుద్ధీ వుంటే, మొదటి దాన్ని రెండోది వుపయోగించుకొంటుంది.

డెస్‌డెమోనా : బాగుంది! మరి వొక వేళ ఆమె నల్లనిదీ సూక్ష్మబుద్ధీ గలదీ అయితే?

ఇవాగో : ఆమె నల్లనిదీ సూక్ష్మబుద్ధి గలదీ అయితే. తన నల్లదనానికి తగిన తెల్లదనాన్ని చూచుకొంటుంది.

డెస్‌డెమోనా : యీ వర్ణనేం బాగాలేదు!

ఎమీలియా : తెల్లనిదే తెలివి తక్కువదీ అయితే?

ఇవాగో : తెల్లనిదైతే తెలివి తక్కువదవటం యెన్నడూ జరగలేదు. యెందుకంటే ఆమె తప్పు జేసినా ఒప్పనిపించుకొంది.

డెస్‌డెమోనా : ఇవి సారాకొంపలో వెర్రి వెంగళప్పలు వొకరికొకరు చెప్పుకొని నవ్వుకొనే కాకమ్మ పిచ్చికమ్మ కథలు మరి కురూపీ తెలివి తక్కువదీ ఐన ఆమె నెంతపాడుగా వర్ణించుతావు?

ఇవాగో : బాగా కురూపీ, బాగా తెలివి తక్కువైనదీ యెవరూ లేరు. ఆమె గూడా సుందరులూ, సూక్ష్మబుద్ధి గలాళ్లు చేసిన పెంకెపనులే చేస్తుంది.

దెస్‌డెమోనా : అబ్బ, యెంత అజ్ఞానం! నువ్వు అధముల్ని ఉత్తములుగా పొగుడు తున్నావు. అలాంటి వాడివి నిజంగా ఉత్తమురాలైన స్త్రీ నెలా పొగడగలవు? అంటే అది దుష్టులచేత గూడా మెయ్యనిపించుకోగల సద్గుణాలున్న స్త్రీ యని నా భావం

ఇవాగో : నిత్య సౌందర్యమూ, నిత్య వినయమూ గల స్త్రీ యెప్పుడవుసరమో, యెంత అవుసరమో యెలా మాట్లాడాలో అలా మాట్లాడుతుంది. అదిగూడా గంపనోటితో గళ్లు గళ్లు మనదు. నిగ్రహం వుంటుంది. అయినప్పటికీ "యిప్పుడు నేనిది చేయవచ్చు" ననుకొంటుంది. తనకు అన్యాయమూ అక్రమమూ జరిగి ఆగ్రహం వచ్చి పగసాధించే అవకాశం దొరికినా తనకు జరిగిన అన్యాయాన్ని మింగి వూరుకొంటుంది. తన ఆగ్రహాన్ని అవతలకు పారదోలుతుంది. మేడి పండు జూసి మోసపోదు. యేది మంచో యేది చెడో ఆలోచించగల శక్తి గలిగి వుంటుంది. అయినప్పటికీ తన మనసులో యేముందో బైటికి పొక్కనివ్వదు. తన నెవరు మోహించు తున్నారో తన వెంట యెవరు పడుతున్నారో తెలుసు కొంటుంది. కాని వెనక్కి తిరిగి వాళ్లవంక చూడదు. అసల లాంటి స్త్రీ అంటూ యెవరైనా యీ భూమ్మీద వుంటే: స్త్రీ అంటే ఆమెయే స్త్రీ.

దెస్‌డెమోనా : యేం చెయ్యటానికి?



ఇవాగో : వెర్రి మొఖాలకి పాలిచ్చి పెంచటానికీ, యింట్లో చిల్లర లెక్కలు రాయటానికి.

దెస్‌డెమోనా : అబ్బ. యెంత కొరగాని కుంటివూహ అది! ఎమిలియా, అతడు నీ భర్తే అయినా అతణ్ణుంచి ఆ చెడుబుద్ధులుగిని నేర్చుకొనేవు సుమా. మీరేమంటారు కేషియో? అతడు పచ్చి బూతుల కోరుగదూ? పచ్చి పోకిరీగదూ?

కేషియో : అమ్మా, అతడు పుల్లవిరుపుగా పెళాసుగా మాటాడు తున్నాడు. అతడు పండితుడే మీగాదు. అందువల్ల సైనికుణ్ణిగా అతణ్ణి అర్థంచేసి కొంటేనే అతడి మంచితనం మీకు బోధ పడుతుంది.

ఇవాగో : (తనలో) "ఆమె చెయ్యి పట్టుకొంటున్నాడు. సరే బాగుంది. కానివ్వండి గుసగుసలు! యింత చిన్న సాలి గూడుతో కేషియో అంత పెద్ద యీగను పట్టేస్తాను. అవును, ఆమెని చూసి చిరునవ్వులు నవ్వు. కానివ్వు! నువ్వు సత్యం చెప్పావు. నిజంగా అంతేమరి! యిలాంటి జిత్తులకే నీ వుద్యోగాన్ని వూడ బెరికే సత్తా వుంటే, అన్నిసార్లు నువ్వు నీ చేతి వేళ్ల ముద్దు పెట్టుకొని వుండాల్సిందిగాదు. ఆఁ అదేపని మళ్లా చేయటానికి తయారుగా వున్నావు గూడాను. చాలా భేషుగా వుంది! బాగా ముద్దెట్టుకొన్నావు! భలే మర్యాద! అవును. అది నిజంగా అంతే మరి. మళ్లా వొక సారి ముద్దెట్టుకో బోతున్నావా? ఆ వేళ్లు నీకు ఎనెమాగొట్టాలైతే యెంత బాగుంటుంది! (లోన బాకా ధ్వని) సిద్దీ! వాడి బాకా నేను యెరుగుదును.

కేషియో : యధార్థమండీ.

డెస్‌డెమోనా : వారిని కలిసికొని స్వాగతం చెబుతాం.

కేషియో : చూడండి, వారు యిటు వస్తున్నారు!

(ఒథెల్లో, పరిచారకులూ ప్రవేశం)

ఒథెల్లో : ఓ నా వీర సుందరీ!

డెస్‌డెమోనా : నా ప్రియ ఒథెల్లో!

ఒథెల్లో : "నిన్నిక్కడ నా కళ్లముందర చూస్తే యెంత ఆశ్చర్యంగా వుందో అంత ఆనందం కలుగుతూంది. నువ్వు నా హృదయరాణివి! ప్రతి తుపాను తర్వాత యింతటి తియ్యని ఆనందం గలిగేట్లయితే మృత్యువు మింగే వరకూ తుపాను గాలిని తీవ్రంగా చెలరేగనియ్యి! తుపానులో చిక్కుకొన్న నౌక అలలమీద అమాంతం పైకి లేచి ఆసాంతం పాతాళానికి దిగిపోనియ్యి! చావుకి యిది మంచి సమయం. యెందుకంటే తృప్తితో ఆనందంతో చని పోవటానికి యింతకంటే మంచి సమయం రాదు.

డెస్‌డెమోనా : అలాగాక భగవంతుడు మన ప్రేమ సుఖాలు దిన దినాభివృద్ధి అయ్యేట్లు ప్రసాదించుగాక!

ఒథెల్లో : తథాస్తు, ప్రియదేవతలారా! నాకు యెంత ఆనందంగా వుందో చెప్పలేను. యిక చెప్పలేను. అంతులేని ఆనందం. మన మధ్య యేదైనా అపశ్రుతులు వసపడితే యిదిగో దీని కంటే (అంటూ ముద్దాడుతారు) అపశ్రుతులు రాకుండుగాక!

ఇవాగో : (తనలో) ఒహో, యిప్పుడు మీ శ్రుతి బాగానే వుంది! కాని నేనే గనక నిజాయితీ పరుణ్ణయితే మీ శ్రుతులూ మతులూ చెడగొట్టుతాను చూడండి తమాషా!



ఒథెల్లో : రా, కోటకుపోదాం. మిత్రులారా, శుభవార్త! మన యుద్ధం ముగిసింది. టర్కీవాళ్లు మునిగిపోయారు. ఇక్కడి నా పాతమిత్రు డెలావున్నారు? చిట్టీ, సైప్రసు ప్రజలు నిన్ను ప్రేమతో ఆదరిస్తారు. వారి హృదయంలో యెంతో ప్రేమ వుంది. ఓ నా చిట్టీ, నేను మతిపోయి మాటాడుతున్నా. ఆనందంతో వెర్రివాగుడు వాగుతున్నా. ఇవాగో, నౌకాశ్రయానికి పోయి నా సామాన్లూ సరంజాం నౌకలోంచి దింపించు. నౌక కాప్టెన్ని కోటకు తీసుకురా. అతడు చాలా మంచివాడు. చాలా మర్యాదగా చూడదగినవాడు. రా, డెస్‌డెమోనా, మనం సైప్రసులో కలిసికోటం చాలా ఆనందకరమైన విషయం. (ఇవాగో, రోడరిగోలు తప్ప మిగతా అందరూ నిష్క్రమణ)

ఇవాగో : నౌకాశ్రయంలో నన్ను వెంటనే కలిసికో. యిలారా. నీకే గనక పౌరుషం పరాక్రమం వుంటే—అల్పులు మోహంలో పడినప్పుడు తమ తాహతుకు మించిన హుందాతనం చూపుతారని పెద్ద లన్నట్లు – నేను చెప్పేదివిను. ఇవాళ రాత్రి ఆ లెఫ్టినెంటు కాపలా దళానికి కాపు దారిగా వుంటాడు. మొట్టమొదట నేను నీకు చెప్పేదేమంటే డెస్‌డెమోనా పూర్తిగా వాణ్ణి ప్రేమించింది.

రోడరిగో : వాణ్ణా? అసంభవం.

ఇవాగో : గమ్మున నోరుమూసుకొని నేను చెప్పేదివిను. చూడూ, గప్పాలు కొట్టటానికే అంతనా పొంతనా లేని వెర్రిమొర్రి అబద్ధాలు చెప్పడానికే గాక మొదట ఆవిడ ఆ సిద్దీగాణ్ణి యెందుకు ప్రేమించిందంటావూ? ఆ వాగుడు కోసం యింకా వాణ్ణి ప్రేమిస్తుందంటావా? యెన్నడూ అలా అనుకోమాక బుద్ధికి బుద్ధి చాపల్యం, జిహ్వకు జిహ్వ చాపల్యం అన్నారు.

ఆమె కంటికి కొత్తదనం కనపడి తీరాలి. మరి కొరివి దయ్యాన్ని చూస్తే ఆమెకేమి ఇంపు? సయ్యాటలకు పోగా రక్తం చల్లబడితే, తిరిగి ఆ రక్తానికి వేడి బుట్టించి సంతృప్తి కలిగేట్లు చెయ్యాలంటే ముఖంలో అందం, తగిన యీడూ జోడూ, నడతలో తీరూ సొరూ, చక్కని రూపూ చూపూ రావాలి. అవి ఆ సిద్దీగాడిలో లేవు. ఆ అవుసరాలు శూన్యమైనందువల్ల ఆమెలోని కోమలత్వం యెండి వడిలిపోతుంది, వెగటూ వికారమూ పుడతాయి, అయిష్టత కలుగుతుంది. చివరికి ఆ సిద్దీగాడంటే ద్వేషం పుట్టుకొస్తుంది. అది మానవ ప్రకృతి. అదే ఆమెనలా తయారు చేస్తుంది. ఆమె మరొకణ్ణి వెతుక్కొనేట్లు చేస్తుంది. ఆం చూడూ. అలా జరుగుతుందని స్పష్టం పైకి కనపడుతూనే గనుకా అలా జరగటం సహజం గనకా, యికను అందుకు అన్నివిధాలా తగినవాడు కేషియో మరింకొకడెవడున్నాడంటావు? అంతకంటే పచ్చి కంత్రీ, తన పని ముగించుకొనేందుకు లోన వొకటి పెట్టుకొని పైకి తియ్యగా కమ్మగా కపట నాటకమాడే నీతిమాలిన దగా కోరూ యెవడున్నాడంటావ్? యెవడూ లేడు! యెవడూలేడు! అవునా కాదా? వాడు పక్కా మాదర్చేదు. యేరోటికాడపాట ఆరోటి కాడపాడేరకం. మంచి అవకాశాలు దొరక్క పోయినా వాటి కోసం వెతికిపట్టుకొనే బాపతు వట్టి టక్కులమారి! అంతేగాదు వాడు మనిషి చూపరి. మంచి యవ్వనంలో వున్నాడు. అంతేగాదు. అనుభవం లేని వాళ్లనీ వెర్రివాళ్లనీ మోసగించ గల లక్షణాలన్నీ వాడిలో వున్నయ్యి. పరమపాపిష్టి జిత్తులమారి ముండాకొడుకు: అలాంటివాడు ఆవిడకి దొరకనే దొరికాడు.



రోడరిగో : ఆమె అలాంటి దని నేను అనుకోను. ఆమెకెంతో సుఖంగా ఆనందంగా వుంది జీవితం.

ఇవాగో : హుం జీలకర్రపాస! ఆవిడా మనలాగే మనిషిగాని దేవలోకంలోంచి వూడిపడ్డ దేవతగాదు. ఆవిడకి సుఖమంటే యేమిటో ఆనందమంటే యేమిటో తెలిస్తే ఆ సిద్దీగాణ్ణి ప్రేమించేదేగాదు. సుఖమూ చట్టు బండలూనూ! వాడి అర చేతిని తాకటం అదీ నువ్వు చూడలా? అది గుర్తించావా లేదా.

రోడరిగో : అవునూ, చూశాను. కాని అలా చేయటం అది ఆచారంగదా?

ఇవాగో : ఆచారంగాదయ్యా, వ్యభిచారం! కామకలాపానికీ కుళ్లు ఆలోచలనకీ అదొక లక్షణం; వొక రహస్యగుర్తు, వాళ్లిద్దరూ పెదిమలూ పెదిమలూ కలిసేంత దగ్గరగా, వొకరి శ్వాస వొకరి నోట్లో పడేంత దగ్గరగా నుంచున్నారు చూశావా? లుచ్ఛాకోరు ఆలోచనలు, రోడరిగో! మర్యాదలు యిలా యిచ్చు కోటమూ పుచ్చుకోటమూ సాగి అవి ముందు దోవ తీస్తూంటే, యిక ఆ అసలు పని దానంతటదే ఆరంభమవుతుంది. ఛీ ఛీ! హుం. కాని, చూడు, నామాట విని నేను చెప్పింది చెయ్యి బాబూ. నేను మిమ్మల్ని వెనిస్ నుండి తీసుకొచ్చాను. నా మాట విని యీ రాత్రికి నువ్వు కాపలాగాయండి. కాపలా బాధ్యత నేను మీ కిస్తాను. యెందుకంటే మీ రెవరో కేషియో యెరుగడు. నేను మీకు దగ్గర్లోనే చాటున వుంటాను. తగిన సమయం చూసి బిగ్గరగా మాట్లాడటం వల్లనైనా సరే, లేదా వారి చెడు మాటలు అనటం వల్లనైనాసరే వాడికి కోపం కలిగేట్లు చెయ్యి.

రోడరిగో : సరే.

ఇవాగో : బాబూ, వాడు దుడుకు మనిషి. వాడి కెప్పుడూ ముక్కు మీద కోప ముంటుంది. అందుచేత మిమ్మల్ని కర్రతో నాలుగు బాద వచ్చుగూడాను. వాడది చేసేట్లు చెయ్యండి. ఆ వంకతో నేను సైప్రసు ప్రజలు తిరుగుబాటుచేసేట్లు చేస్తాను. వాళ్ళొక సారి యెదురు తిరిగితే కేషియోని వుద్యోగం నుండి వూడ బెరికి పారేసేదాకా వూరుకోరు. దాంతో మీరొట్టె కొంత విరిగి నేతిలో బడుతుంది. మీకున్న పెద్ద అడ్డంకి తొలిగి పోతుంది. ఆ అడ్డంకే వుంటే మన పప్పులు వుడకవు.

రోడరిగో : దానివల్ల యేదన్నా మేలు జరిగేట్లుంటే ఆ పని తప్పకుండా చేస్తాను.

ఇవాగో : ముమ్మాటికీనూ నా మాట నమ్మండి. కాపలా కోటవద్ద నన్ను కలిసికోండి. వాడి సామాన్లు నేను పోయి నౌకలోంచి తేవాలి. శెలవు.

రోడరిగో : మళ్లీ కలిసి కొనేదాకా శెలవు (నిష్క్రమణ)

ఇవాగో : కేషియో ఆమెని ప్రేమిస్తున్నాడని నా గట్టి నమ్మకం. పోతే యిక ఆమె వాణ్ణి ప్రేమించుతూందని నమ్మటం యింకా తేలిగ్గా నమ్మదగిన విషయం. ఆ సిద్దీ అంటే నా కెంత సరి పడక పోయినా వాడు నిజాయితీ గల మనిషి; వాడిది మెత్తని మనసు; గొప్ప హృదయం గలాడు. వాడు డెస్‌డెమోనాకు యెంతో తగిన భర్త ననిపించు కొనేది తథ్యం. నాగ్గూడా ఆవిడంటే ప్రేముంది. అయితే అది మదపిచ్చతోగాదు ,అంత పాపం మూటగట్టుకోటానికి నేను వెనక్కి తగ్గపోయి నప్ప టికీ అలా నేను ప్రేమించేది కొంత పగ సాధించటానికి. యెందుకంటే మద పిచ్చతో మత్తెక్కిన ఆ సిద్దీగాడు నాకు అన్యాయం చేశాడు. అది తలుచుకొంటే చాలు నాకు రంపపు



కోతగా వుంది. వాడికీ వాడి పెళ్లానికీ యెడబాటు చేసే వరకూ నాకు ఆత్మశాంతి వుండదు. అది వీలుపడకతే వాడికి ఆవిడ మీద తీరని అనుమానం పుట్టేట్లు చేస్తాను. పనిగట్టుకొని నిత్యమూ నేను ముందుకు నెట్టుకొస్తూన్న యీ వెనిస్ అంట నాపమీదా ఆ కేషియో గాడిమీదా ఆ సిద్దీ గాడికి అతుకులూ మాసికలూ చెప్పుతాను ఆ సిద్దీ గాణ్ణొక గుడ్డిగాడిదను చేసి ఆడిస్తాను. అందుకు వాడు నన్ను అభినందించేట్లూ, ప్రేమిం చేట్లూ, బహుమతి యిచ్చేట్లూ చేస్తాను. అది జరిగే అవకాశం యెంతోవుంది. యికను నా ప్లానులు పూర్తి చేసుకోట మొక్కటే తరువాయి. మోసం అనేది జరిగేదాకా దాని ముఖ మెలావుంటుందో యెవరికీ తెలీదు.

## రెండవ రంగం : సైప్రస్

### ఒథెల్లో కోట ముంగిట

(ఒథెల్లో హర్కారు వొక ప్రకటనతో ప్రవేశం. అతడి వెనకాల ప్రజలు ప్రవేశం)

హర్కారు : మన వీర జనరల్ ఒథెల్లోగారు యావన్మందికి యిందు మూలంగా శెప్పేదేమంటే : టర్కీ వాళ్లు సముద్రం మీద పూర్తిగా పేరు మాసిపోయారుగనకా, ప్రతి మనిషీ పండుగజేసుకోవాలహో. అంతేగాక కొంతమంది నాట్యమూ, కొంతమంది భోగి మంటలూ, యెవరికిష్ట ముండటి వాళ్లు చెయ్యాలహో, యెందుకంటే ఆ సుబవార్త వొక్కటేగాక యీ దినాన ఒథెల్లో దొర గోరి డెస్‌డెమోనమ్మ దొరసాని

గోరి గర్భాదానం గూడా నహో అందుకని అందరూ సంతో సంతో పండగ శేసుకోవాలహో అన్ని సారాకొట్లూ తెరిశి వుంటయ్యో యీ ఆయిదు గంటలనుండీ పదకొండు గంటలు వరకూ అందరూ పూర్తిగా జల్సా గిల్సా శేసుకోవచ్చుహో సైప్రసు ద్వీపాన్నీ మన వీర ఒథెల్లో జనరల్‌గారినీ బగవం తుడు దయ సూడాలహో.... ...(నిష్క్రిమణ)

## మూడవ రంగం : సైప్రస్

### కోట లోపల

(ఒథెల్లో డెస్‌డెమోనా, కేషియో, పరిచారకులూ ప్రివేశం)

**ఒథెల్లో** : మైకేల్, యీ రాత్రికి మీరు కాపలా వ్యవహారం చూడండి. జల్సాలు శృతిమించి రాగానపడకుండా చూసు కొందాం.

కేషియో : యేం చెయ్యాలో ఇవాగోకు చెప్పాను. అయినా నేను దగ్గరుండి అంతాసక్రిమంగా వుండేట్లు చూస్తాను.

ఒథెల్లో : ఇవాగో యెంతో నమ్మకస్థుడు. శెలవు, కేషియో. రేపు యెంత పెందరాడే రా గలిగితే అంత పెందరాడే రా. మాట్లా డాలి—రా, చిట్టీ, మొక్క నాటాం. యిక పూలు పూచి కాయలు కాయటమే తరువాయి. అది మన కింకా జరగాల్సి వుంది. శెలవ్.



(ఒథెల్లో, డెస్‌డెమోనాలు, పరిచారకుల్తో, నిష్క్రమణ. ఇవాగో ప్రివేశం)

కేషియో : స్వాగతం, ఇవాగో. మనం కాపలాకి పోవాలి.

ఇవాగో : అప్పుడే గాదు, లెఫ్టినెంటుగారూ. యింకా పది గంటలు కాలేదు. డెస్‌డెమోనా గారితో సరససల్లాపాలాడేందుకు మన జనరల్ గారు మనల్ని తొందరగా మన పనికి పురమా యించారు. అందుకు మనం వారినేమీ నిందించొద్దు. వారా మెతో యింత వరకూ వొక్క రాత్రి గూడా సరిగా కాలక్షేపం చెయ్యలేదు. మరి ఆమేమో మంచి యవ్వనంలో వుంది.

కేషియో : ఆమె బంగారు బొమ్మ.

ఇవాగో : యెంతో వుల్లాసంగా వుండే మనిషి.

కేషియో : నిజం అప్పటి కప్పుడు పూసిన పువ్వులాంటిది.

ఇవాగో : అబ్బా, ఆమెచూపు లేం చూపులు! పిలుస్తూన్నట్లుం టాయి.

కేషియో : అవును. చిరునవ్వులు చిలికించే చూపులు కాని, ఆ చూపుల్లో యెంతో వినయముంది.

ఇవాగో : ఆమె మాట్లాడుతూంటే, ప్రేమసంజ్ఞ చేసినట్లుండదూ?

కేషియో : ఆమె నిజంగా పరిపూర్ణమైన మనిషి.

ఇవాగో : భేష్. వారిని హాయిగా కాలక్షేపం చెయ్యనియ్యి! రండి, లెఫ్టినెంటు గారూ. నా దగ్గిర పెద్ద చెంబెడు ద్రాక్షసారావుంది. బయట సైప్రస్ మొనగాళ్లు కొందరున్నారు. మన నల్ల ఒథెల్లో ఆరోగ్యం కొరకు తాగటానికి సిద్ధంగా వున్నారు.

కేషియో : ఇవాళరాత్రి వద్దు ఇవాగో, నా మనస్సు సరిగా లేదు. అంతకంటే మంచి ఆచార మేదన్నా కనిపెట్టి వుంటే యెంత బాగుండేది!

ఇవాగో : చూడండీ. వాళ్లు మన మిత్రులు. వొక్క గిన్నంటే వొక్క గిన్నె పుచ్చుకోండి చాలు! అప్పుడు నేను మీ ఆరోగ్యం కోసం తాగుతాను.

కేషియో : ఇప్పటి కప్పుడే యీ రాత్రి నేనొక గిన్నెడు తాగాను. అందులో నీళ్లు గూడా కలపటం జరిగింది. అయినప్పటికీ ఆ కాస్త దానికే నాకు మత్తుగావుంది. నేను తాగి తట్టుకోలేను. ఆ బలహీనత నాలోవుంది దాన్నింకా యెక్కువ చెయ్యడం నా కిష్టం లేదు.

ఇవాగో : ఓహో భలేవాడివే మొత్తానికి! యిది తాగి తందనా లాడే దినం. ఆ మొనగాళ్లు కావాలని పట్టుబడుతున్నారు.

కేషియో : వారెక్కడున్నారు?

ఇవాగో : యిక్కడే నండీ! తలుపు దగ్గర దయ చేసి వాళ్లని లోపటికి పిలవండి.

కేషియో : సరే పిలుస్తా. కాని యీపని నా కేమంత యిష్టంగా లేదు (నిష్క్రమణ)

ఇవాగో : వాడి చేత యింకా వొక్క గిన్నెడు సారా తాగించానా అంటే యికను కదిలిస్తే కంపరమెత్తి పోయేట్లు తయారౌ తాడు. పోతే యిక మదపిచ్చితో పుతిజెడి పోయిన వెర్రిశుంఠ రోడరిగో డెస్‌డెమోనా ఆరోగ్యం కొరకంటూ తప్పదాగాడు. మరి యీ రాత్రికి వాడే కాపలా మీదుంటాడు. వాడే గాక, చిన్నమెత్తు మాటంటె సర్రుమని యెగిరి ముక్కేసు వాటమైన సైప్రెస్‌కుర్రాళ్లు ముగ్గురు గూడా కాపలా మీదుం టారు. వాళ్లచేత చెడతాగించాను. యికను యీ తాగుబోతు మందలోకి కేషియోని మెల్లగా యెలాగైనా దూర్చి సైప్రస్ వాళ్లని రెచ్చగొట్టే పనేదైనా వాడు చేసేట్లు చెయ్యాలి.



(కేషియో, మాంటెనో, పెద్దమనుష్యులూ, దాశీ సారాతో నౌకరూ ప్రవేశం)

ఆఁ వాళ్లు రానే వస్తున్నారు. నా పాచిక పారితే నా బండి అడ్డూ ఆపూ లేకుండా సాగిపోతుంది.

కేషియో : వొట్టంటేవొట్టు. నా చేత బలవంతాన మస్తుగా తాగించారు.

మాంటేనో : ఆఁ గోంగూర కొద్దిగానేగా; రెండు గ్లాసుల కంటె యెక్కువ గాదులే.

ఇవాగో : సారా తెండయ్యోయ్!

(పాడతాడు)

ధసిడీ! గిన్నెను టింగు టింగు తాకించ నివ్వండి
తిన్నగ టింగు టింగు మని తాకించ నివ్వండి
సైనికుడూ వొక మనిషే ననేది సత్యం
జీవిత మది కాదు నిత్యం

కనుక సైనికుణ్ణి
కమ్మగా తాగ నివ్వండి

సారా తెండోయ్ కుర్రాళ్లూ!

కేషియో : వొట్టంటే వొట్టు, భలేపాట!

ఇవాగో : నేనీ పాటను ఇంగ్లండులో నేర్చుకొన్నా అక్కడి వాళ్లు తాగటంలో వస్తాదులు. సీదేనూను నీ జర్మనునూ, నీ బాన పొట్ట హాలండు వాడూ - ధసిడీ!–ఇంగ్లీషు వాడి కాలి గోటికి పనికిరారు.

కేషియో : అయితే తాగుడులో నీ ఇంగ్లీషువాడు అంత తోడా వేసుకొన్న మొనగాడా?

ఇవాగో : హుం కాకపోతే యేందనుకొన్నావు మరి? ఇంగ్లీషు వాడిలాగా తాగాలంటే డేనుగాడి తాతలుదిగి రావాలి మరి. యిక జర్మను వాణ్ణి గోటితో మీటి పారెయ్య గలడు. హాలండు వాణ్ణి ఉఫ్ అని వూదెయ్య గలడు.

కేషియో : మన జనరల్ గారి ఆరోగ్యం కొరకు!

మాంటేనో : నేనూ తయారే, లెఫ్టినెంటుగారూ. మీ గిన్నెకి నా గిన్నె తాకిస్తాను.

ఇవాగో : ఓ నా పి్రియమైన ఇంగ్లండ్!

(పాడతాడు)

ప్రభువు స్టీపనూ । పెద్దరాజారు
కాని - రెండున్న రేవారి । రంగు ఇజారు
ఐనా అది - ఆరణాలేయని । ఐరి బేజారు
దర్జీ మీదేమి । దూసికైజారు
దర్జీ వాణ్ణేమి । దద్దమ్మన్నారు
మరి వారిజూడ । మహ గొప్పవారు
మిమ్మల్ని జూడ । మరి తక్కువారు
దేశనాశమ్ము । తగని గర్వమ్ము
కాబట్టి - తీసి చుట్టండి । తమరి అంగీ సుమ్ము
సారా! సారా! తెండయ్యో తెండి!

కేషియో : వొట్టంటె వొట్టు ఆ పాటకంటె యీ పాట భలే బాగుంది.



ఇవాగో : మరో సారి పాడనా ?

కేషియో : వొద్దు. అలాంటి పనులు చేసేవాడు ఆస్థానానికి అనర్హుడని నా అభిప్రాయం. సరే అందరికీ పైన భగవంతుడున్నాడు. శిక్షించదగిన పాపులెవరో, రక్షించదగిన పుణ్యాత్ములెవరో ఆయనకే తెలుసు.

ఇవాగో : సత్యం పలికారు, లెఫ్టినెంటుగారూ.

కేషియో : నా మట్టుకు నేను రక్షించ బడాలనే కోరుకొంటున్నా. అంటే మన జనరల్‌గారో, మరొక సజ్జనుడో తక్కువ వారని గానీ వారిని నొప్పించాలని గానీ నేనీ మాటలు అనలేదు.

ఇవాగో : నేనూ మీలాగే కోరుకొంటున్నా: లెఫ్టినెంటుగారూ.

కేషియో : అవునుగాని అది నా ముందుగాదు. లెఫ్టినెంటు పతాకధారి ముందు రక్షించబడాలి. అంతే యికను మనం ఆ విషయం యెత్తుకోనేవద్దు. మన పనేంటో మనం చూసుకొందాం పట్టండి. భగవంతుడు మన పాపాలకి మన్ను క్షమించుగాక! పెద్ద మనుష్యులారా, మన పని మనం చూసుకొందాం పట్టండి. బాబూ, నాకు కైపు యెక్కిందని అనుకోమాకండి. ఇతడు నా పతాకధారి. ఇది నా కుడిచెయ్యి. ఇది నా యెడమచెయ్యి. నా కిప్పుడు కైపు యెక్కలేదు. తూలకుండా నిలబడగల్గుతాను, తొణక కుండా మాట్లాడ గల్గుదును.

అందరు : వారెవా! భేషు భేషో!

కేషియో : సరే. అయితే చాలా మంచిది. మరి మీరు నాకు కైపెక్కిందని అనుకో గూడదుసుమా (నిష్క్రమణ)

మాంటేగో : కాపలా స్థలం వద్దకు పోదాం పదండి బాబూ. రండి, కాపలా కాద్దాం.

**ఇవాగో** : ఇప్పుడు పోయిన మనిషిని చూశారుగద. అతడు సీజరు పక్షాన నిలబడి సలహా యివ్వ దగినంత గొప్ప సైనికుడు. కాని, పాపం, అతడిలో అదొక్కటేలోపం. అతడిలో సద్గుణ మెంతుందో దుర్గుణం గూడా అంతవుంది. అతణ్ణి చూస్తే జాలేస్తుంది. ఒథెల్లో అతడికీ ఆ బాధ్యత యివ్వటం మంచిది గాదని నా భయం. యెందుకంటే యే తిక్కలేచి నప్పుడో అతడీ ద్వీపంలో యేదైనా పెడకొలిమి తెచ్చి పెట్టొచ్చు.

**మాంటేనో** : అసలు అత నెప్పుడూ అలాగే వుంటాడా?

ఇవాగో : ఆఁ అతడు నిద్రపోయే ముందు యెప్పుడూ అంతే. తాగుడు మత్తుతో నిద్రరాకపోతే యిరవై నాలుగు గంటలూ అదేపనిగా తాగుతూనే వుంటాడు.

**మాంటేనో** : అయితే మరి యీ విషయం జనరల్‌గారికి తెలియ జెయ్యటం మంచిది. బహుశా ఆయన కావిషయం తెలవక పోవచ్చు; తెలిసినా అతడు సమర్థుడు గదా అనే దృష్టితో అతడి లోపాన్ని చూసీ చూడనట్లు వూరుకుండనూవచ్చు. నిజమంటారా కాదంటారా యిదీ?

(రోడరిగో ప్రవేశం)

ఇవాగో : (అతడితో రహస్యంగా) యిదేమిటయ్యా యిలా వచ్చావు, రోడరిగో? నా మాట విని ఆ లెఫ్టినెంటు వెంటబడు. పో! (రోడరిగో నిష్క్రమణ)

మాంటేనో : అదిన్నూ తన స్థానం తర్వాత తనంత గొప్ప స్థానాన్ని ఒక తాగుబోతుకి ఒథెల్లోగారు అప్పగించటం నిజంగా యెంతో విచారకరం అందుకని, అసలు సంగతేమిటో ఒథెల్లోగారికి చెప్పటం మంచిది.



**ఇవాగో** : నేను మాత్రం చస్తే చెప్పను! కేషియో అంటే నా కెంతో ప్రేమ. అందువల్ల అతడి లోపాన్ని సరిదిద్దటానికి నేను చెయ్యగలిగిందంతా చేస్తాగాని, చాడీలుమాత్రం చెప్పను. (లోన "సహాయం! సహాయం!" అని కేకలు) వినండి, వినండి! యేమిటా గడ బిడ?

(రోడరిగోను తరుముతూ కేషియో ప్రవేశం)

కేషియో : డొక్కదీసి డోలుగడతా, దొంగవెధవా! బద్మాష్ వెధవా!

**మాంటేనో** : యేం జరిగిందండీ, లెఫ్టినెంటుగారూ?

కేషియో : దొంగా దొరకి నీతులు నేర్పేదీ? ఆ బద్మాషుని చావ గొట్టి చెవులుమూస్తా.

రోడరిగో : నన్నా?

కేషియో : యింకా వాగుతున్నావా, దొంగవెధవా!? (అతణ్ణి కొడ తాడు)

**మాంటేనో** : ఆగండీ, లెఫ్టినెంటుగారూ (అతడి చేయి పట్టు కొంటాడు) నామాట విని వూరుకోండిక.

కేషియో : నన్నొదలండి. లేకపోతే నీ బుర్ర పగల గొడతాను.

**మాంటేనో** : తగ్గు తగ్గు, తగ్గవయ్యా తగ్గు! తాగిన మాటలు మాట్లాడమాక!

కేషియో : తాగిన మాటలా? (వారు కత్తులు దూసి పోరాడుతారు)

ఇవాగో : (రోడరిగోతో రహస్యంగా) పోవయ్యా బాబూ! పోయి తిరుగుబాటని పెద్దగా కేకలు బెట్టు! (రోడరిగో నిష్క్రమణ) ఆగండి, లెఫ్టినెంటుగారూ. పైన భగవంతు

డున్నాడు బాబూ!—రండయ్యో రండి,—లెఫ్టినెంటుగారూ—అయ్యో – మాంటేనోగారూ — బాబూ – సహాయం, సహాయం!- వారెవా, భలేకాపలా మొత్తానికి!- (గంట మోగుతూంది) ఆ గంట కొట్టేదెవరు? అబ్బా, యమలోకమే! యికను అందరూ నిద్రలేస్తారు. పైన భగవంతుడున్నాడు. లెఫ్టినెంటుగారూ, ఆగండి! చూడండి, అంతా ఐనాక అయ్యో అనుకుంటె లాభంలేదు.

(ఒథెల్లో పరిచారకులూ ప్రవేశం)

ఒథెల్లో : యేమిటయ్యా యిక్కడ గోలా?

మాంటెనో : నాకింకా నెత్తురు కారుతూనేవుంది. యిక నేను బతకను. వాడు చచ్చి తీరతాడు!

ఒథెల్లో : ఆగండి!

ఇవాగో : ఆగండి, ఆగండి! లెఫ్టినెంటు గారూ - అయ్యో - మాంటేనోగారూ - బాబూ! మీరెవరో యెక్కడున్నారో అదంతా మరిచిపోయారా? ఆగండి జనరల్‌గారు మాట్లాడుతున్నారు. ఆగండి ఆగండి! సిగ్గుండాలి కాస్త!

ఒథెల్లో : అరె, యేమిటయ్యా అదీ? అసలిదె యెలా బైలుదేరింది? మనం వొక్కసారిగా టర్కీవాళ్లుగా మారిపోయి భగవంతుడు వాళ్ల మనకు తెచ్చేవి నాశనాన్ని తేకుండా ఆపిన దాన్ని మనంతటమనమే మనకు తెచ్చుకొంటున్నామా యేమిటి? సిగ్గుండాలి! ఆగండి! మొదట కదిలిన వాడికి మూడి తీరుతుంది. కదులుతుండగానే తెగనరుకుతాను! ఆ వెధవ గంటను ఆపమనండిక! అది విని నిద్రపోయే వాళ్లకి భయంతో మతులు



పోగలవు. యేమిటయ్యా యీ గోలా? ఇవాగో, బాధలో నీ గుండె పగిలిపోయినట్లుంది. యిదంతా యేమిటో చెప్పు. అసలు యిది మొదలు పెట్టిందెవరు? నా మీదే గనక నీకు నిజంగా ప్రేమనేది వుంటే. యెవరోచెప్పు.

ఇవాగో : నాకు తెలవందే. యింతకుముందే, వొక్కక్షణంముందే యిద్దరూ చక్కగా మొగుడు పెళ్లాలలాగా మాట్లాడుకొంటున్నారు. మరి యింతలోనే, రాతసరిగా లేకనో యేమో మరి, కత్తులు దూసి వొకరి మీదొకరు కలబడ్డారు. అసలీ చిలిపి కయ్యం యెలా మొదలైందో నేను చెప్పలేను. యీ అల్లరి చిల్లరి తగాదా చూసేకంటే యే యుద్ధరంగంలోనో నేను వీరుడుగా చచ్చి పోయుంటే బాగుండేదను కొంటున్నాను!

ఒథెల్లో : అంతవొళ్లు మరిచి పోయే అవుసర మెందుకు కలిగిందండి, మైకేల్ గారూ?

కేషియో : దయయుంచి క్షమించండి. నేనేమీ చెప్పలేను.

ఒథెల్లో : యేమండీ మాంటేనోగారూ మీరిదివరకు సభ్యతగా ప్రవర్తించేవారు. మీరు నిండు కుండలాగా యెంత నింపాదిగా వుండే యువకులో అందరికీ తెలుసు. పెద్దవాళ్లు గూడా మిమ్మల్ని జూసి ముక్కుమీద వేలేసుకొన్నారు. అలాంటి ఆ పరువూ ప్రతిష్ఠలన్నీ గంగలో కలిపి యిలా తాగుబోతులాగా రాత్రిపూట తందనాలు తొక్కే దెందుకు? యెందుకో సమాధానం చెప్పండి.

మాంటెనో : ఒథెల్లోగారూ, నాకు ప్రమాదకరంగా గాయం తగిలింది. యీ విషయాన్ని గూర్చి మీ వుద్యోగి ఇవాగో చెప్పగలడు. నాకు తెలిసింది చెప్పాలంటే, నా కెందుకో బాధకరంగా వుంది. అంతేగాదు. కొన్ని వేళల్లో స్వయం సహాయం

చెడ్డదైతే తప్పు, వొకరు మన మీద దౌర్జన్యం చేస్తూంటే ఆత్మరక్షణ చేసుకోవటం నేరం అయితే తప్పు. యీ రాత్రి నేను ఒక తప్పుడుమాట అనటంగానీ, తప్పుడు పని చేయటం గానీ జరగలేదు.

ఒథెల్లో : నాకు కోపం పెరిగి పోతూంది. ఆ కోపాన్ని ఆపుకో లేకుండా వున్నాను. ఒక్కసారి నేను అలా కదిలినా, అలా యీ చేతిని పైకెత్తినా మీ లోని మహా మహా మొనగాళ్లు గూడా ముక్కలు ముక్కలై తెగిపోతారు. అందుకని ముందుగానే జాగర్తపడి అసలు యీ లుచ్ఛా జగడం యెందుకు మొదలైందో, యెవరు మొదలు పెట్టారో మర్యాదగా చెప్పండి. యిందులో నేరస్తుడని తేలిన వాడు నా కవల సోదరుడైనా నేను కాలదన్ని పారేస్తాను. ఆఁ–! యెంతపొగరు! యుద్ధపు గడబిడలో వున్న పట్నంలో, యింకా అల్లకల్లోలంగా వున్న పట్నంలో, ప్రజలింకా భయంతో బిక్కుబిక్కుమంటూన్న సమయంలో చిల్లర మల్లర తగాదా లేవదీసి చిందులు తొక్కటమా! అందులోనూ రాత్రిపూట కాపలామీదున్నప్పుడు కాపలా చోటులో నా యిదంతా!? యెంతఘోరం! చెప్పు ఇవాగో, యెవరు మొదలు పెట్టారిది?

మాంటేనో : ప్రేమతోనో మిత్రభావంతోనో జరిగిన దాన్ని గోరంతలు కొండంతలు జేసో, కొండంతలు గోరంతలు జేసో చెబితే నువ్వు సైనికుడివే గాదు.

ఇవాగో : మీరు అంతగా నన్ను నొప్పించవద్దు. మైకేల్ కేషియో గారికి అన్యాయం చేసేకంటే నేను యీ నాలుకను కోసివేసుకోవటం మంచిది. అయినప్పటికీ, యదార్థం చెబితే వారికి నష్టంజరగదని సరిపెట్టు కొంటున్నాను. అసలు ఆ కథంతా



యిదుగో యిలా జరిగిందండీ, జనరల్‌గారూ. యెవడో వొకడు సహాయం అంటూ అరుస్తూవచ్చాడు. వాడి వెనకాలే కత్తిదూసి కేషియో గారు పరుగెత్తు కొచ్చారు అయ్యా, ఆ మీదట వీరు కేషియో గారికి అడ్డం వచ్చి ఆగమని బతిమాలారండి. యిక నేను ఆ అరిచే వాడెంబడిపడ్డాను. యెందుకంటే వాడలాగగ్గోలు పెడుతూంటే పట్నమంతా తత్తరపడి పోతుందను కొన్నాను. (అనుకొన్నట్లే జరిగింది గూడాను) వాడు నా కంటే విసురుగా పరుగెత్తి పారిపోయాడు. అందుమీదట యేమి చేశానంటే, కత్తుల ఖణఖణలూ, కేషియోగారు బిగ్గరగా తిట్టటమూ విని మరింత త్వరగా వెనక్కు తిరిగొచ్చేశాను. అలా జరగటం నేను యీ రాత్రి చూడటం యిదే ప్రథమ మనుకోండి సరే, నేను వెనక్కి తిరిగి వచ్చేసరికి ఆ యిద్దరూ వొకరి మీద వొకరు కలబడి, మీరు చూసేసరికి యెలా కొట్టుకొంటూ పొడుచుకొంటూ వున్నారో అలావున్నారు. ఇక నింతకంటే నేనేమీ చెప్పలేను. కాని, మనమంత మానవ మాత్రులం. యెంత గొప్పవాడైనా వొక్కొకసారి తప్పటడుగు వేస్తాడు. కోపంలో వున్న మనుష్యులు తెలీక తమకంటిని తామే పొడుచుకొన్నట్లు చేస్తారు. అలాగే కేషియోగారు గూడా వాడిని వొక చిన్నదెబ్బ వేశాడు. అయితే ఆ పారిపోయినవాడు ఆయన నేదో అవమానించినట్లుంది. అవమానం జరిగినప్పుడు వోర్పుండదు.

ఒథెల్లో : ఇవాగో, వస్తుధా నీకున్న మంచి బుద్ధివల్లా, అతడంటే వున్న ప్రేమవల్లా జరిగినదాన్ని నువ్వు తగ్గించి చెబుతావని నాకు తెలుసు. కేషియో, నువ్వంటే నాకు ప్రేమవుంది. కాని యికనుండీ నువ్వు నా వుద్యోగిగా వుండవలసిన అవుసరంలేదు.

(పరిచారకుల్తో డెస్‌డెమోనా ప్రవేశం).

నా ప్రియురాలు యెలా నిద్రలేచి వచ్చిందో చూడండి! నిన్నుజూసి అందరూ గుణపాఠం నేర్చుకొనేట్లు చేస్తా.

డెస్‌డెమోనా : యేంజరిగిదండీ ?

ఒథెల్లో : యిప్పుడంతా సక్రమంగావుంది, చిట్టీ పోదాంపద. (మాంటేనోతో) అయ్యా, మీ గాయాలకు నేను కట్లుగట్టి మందువేస్తాను, రండి ఆయన్ని తీసుకు పదండోయ్ (పరిచారకుల్తో మాంటేనో నిష్క్రమణ) ఇవాగో, పట్నంలో జాగర్తగా తిరిగిచూడు. యీ వెధవ గల్లంతుకి లేచినవాళ్ళకి చక్కగా సమాధానంచెప్పి సంతృప్తిపరుచు. రా, డెస్‌డెమోనా సైనికుడి జీవితమే అంత. చల్లగా సుఖంగా నిద్రపోయేప్పుడే యిలాంటి మిత్తవేదో వచ్చిపడుతుంది.

ఇవాగో, కేషియోలు తప్ప మిగతా అందరూ నిష్క్రమణ.

ఇవాగో : యేమండీ, మీకు గాయం తగిలిందా, లెఫ్టినెంటుగారూ?

కేషియో : అవును మానని గాయం.

ఇవాగో : అయ్యో! భగవానుడది రాకుండా చేయుగాక!

కేషియో : పరువు, పరువు, పరువు! అయ్యో, నాపరువు పోగొట్టుకొన్నాను. నాలోని అమరత్వం పోగొట్టుకొన్నాను. యిక మిగిలిందల్లా పశుత్వమే. నా పరువు, ఇవాగో, అయ్యో నాపరువు!

ఇవాగో : అలాచెప్పరూ! నేనింకా మీ వొంటిమీదేదో గాయం తగిలిందనుకొన్నా యీ పరువనే మాటకంటే ఆ మాటంటే యింకా అర్థముండేది. పరువు అనేది పనికిమాలినచెత్త. అది



వొట్టి మోసంతో మనమీద రుద్దినట్టిది. తరుచుగా అది అసమర్థులకి వుంటుంది. సమర్థులవద్దనుండి చెప్పకుండానే పోతుంది. మీరు అలాంటి వాళ్ళు అయితే తప్ప మీకేపరువూ పోలేదు, హుం. భలేవాడివయ్యా మొత్తానికి! భయపడమాక జనరల్‌గారి ప్రేమను తిరిగి సంపాదించే అవకాశంముంది. మీరిప్పుడు ఖచ్చితంగా ఆయన అనుకొన్నరీతిగానే అనుకొంటున్నారు—యిదంతా యేమీలేదు. బడిపంతులు మిగతా పిల్లలందరికీ బుద్ధివచ్చేందుకని మెత్తని పిల్లవాణ్ణొకణ్ణి చూసి బెత్తంతో బాదినట్లుంది. అంతే—మళ్ళా ఆయిన్ని బతిమాలండి. ఆయనే మెత్తబడతాడు.

కేషియో : తాగి కైపెక్కి కిందూమీదూ కానకుండా గంతులేసి అంతమంచి కమాండర్ని మోసగించిన నేను ఆయనని క్షమాభిక్ష అడగటమా ? హుం. ఆయన కాలిగోటికి గూడా సరిపోలనునేను. తాగటమా ? తాగివాగటమా ? ఆమీద గిల్లికజ్జా పెట్టుకోవటమా ? అహంకారంతో అదిరిపడటమా ? బూతులు కూయటమా ? ద్రాక్షసారాని పిలవడానికి పేరేమి లేకపోతే దయ్యం అని పిలవటం బాగుంటుంది!

ఇవాగో : మీరు కత్తిదూసి తరుముకొచ్చిన వాడెవడు ? వాడు మీకేంచేశాడు ?

కేషియో : నాకు తెలవదు.

ఇవాగో : అదెలాసాధ్యం ?

కేషియో : బుర్రలో యేమిటేమిటో బొచ్చెడు సంగతులు మెసులుతున్నాయిగాని, వొక్కటీ స్పష్టంగా గుర్తులేదు. వొక జగడం; మరి అది యెందుకొచ్చిందో యేమో తెలవదు. హోరి

భగవంతుడా! మన బుర్రను మనమే పాడుచేసుకోటమా! జల్సాకోసం, సరసంకోసం జంతువులుగా మారిపోటమా!

ఇవాగో : అందులో యేముందండీ? మళ్ళా మీరిప్పుడు యెప్పటి లాగానే వున్నారుగద. అసలు అలాయెలా తిప్పుకోగలిగారంట?

కేషియో : అదా? దయ్యపు మత్తుపోయి దయ్యపుకోపం రావటం వల్ల వొకలోపం నాకు మరొకలోపాన్ని చూపుతూంది. నన్ను నేను దాపరికం లేకుండా అసహ్యించుకొనేందుకు.

ఇవాగో : ఇకచాల్లే వూరుకోండి మరీ అంతగా నీతినిగురించి ఆలోచించటం మంచిదిగాదు. అది జరిగిన స్థలమూ, సమయమూ, యీ దేశస్థితీ జూస్తే అది జరగకుండా వుంటే నేనెంతో ఆనందించేవాణ్ణి. పోతే యిక జరిగిందేమో జరిగిపోయింది గనక, దాన్నుంచి చక్కగా బయటబడే దెలాగో చూసుకోండి.

కేషియో : నా వుద్యోగం నా కిప్పించమని నేను ఆయన్ని అడిగితే, ఆయన నన్ను తాగుబోతా అంటాడు! నాకు వెయ్యి నోళ్లున్నా ఆ సమాధానం వొక్కటే ఆ నోళ్లంటినీ మూయించగలదు. యిప్పుడు మతి సరిగా వుండటం, యింతకుముందు మతిబోయి ప్రవర్తించటం, ఆవెంటనే పశువులాగా తయారవ్వటం! అబ్బా, యిది విపరీతం! అవుసరమైన దానికంటే యెక్కువ తాగితే అదంతా విషమే.

ఇవాగో : ఇక చాల్లే వూరుకోండీ. మంచిసారాని మంచిగా వుపయోగించుకొంటే అది అమృతంతో సమానం అవుతుంది. యికా విషయం గురించి మీరు మాట్లాడనేవద్దు. ఆఁ. చూడండీ, లెఫ్టినెంటుగారూ, మీరంటే నాకు ప్రేముందని మీరనుకొంటున్నారని నేననుకొంటున్నా. దానికేమంటారు?



కేషియో : అదినాకు బాగా తెలుసండీ, నాకు నిషా యెక్కిందా?

ఇవాగో : నువ్వుగానీ మరెవ్వడైనాగానీ తాగితే నిషా యెక్కుతుందయ్యా బాబూ. నువ్వేం చెయ్యాలో చెబుతావిను. మన జనరల్‌గారి భార్య యిప్పుడు జనరల్. ఆమాట యెందు కంటున్నానంటే యిప్పుడాయన మనసంతా ఆమె అందచందాలమీదా తీరుసొరులమీదా లగ్నమైవుంది. పోయి ఆమెతో దాపరికం లేకుండా జరిగినదంతా చెప్పుకో. నిన్నుమళ్ళీ నీ వుద్యోగంలో పెట్టించమని బతిమాలు. ఆమె వుదారబుద్ధి గలది. దయాగుణం వున్నమనిషి. ఆమెకిప్పుడెంతో బ్రహ్మానందంగా వుంది. అందువల్ల ఆమె అడిగినదానికంటే యింకా యెక్కువ మేలేచేస్తుందిగాని తక్కువజెయ్యదు. ఆమె భర్తకూ నీకూ మధ్య చెడిపోయిన సంబంధాలను బాగుచెయ్యమని చెప్పు. నువ్విది చేశావంటే నువ్వింతకుముందుకంటే గూడా ఆయన ప్రేమ యెక్కువ సంపాదించగలవని పందెంగట్టి చెబుతాను.

కేషియో : నీ సలహా బాగుంది.

ఇవాగో : ఆఁ అదేమంత బ్రహ్మాండమైన విషయమండీ. ఆపదలో వున్న మిత్రుడికి ఆ మాత్రం సాయంచెయ్యొద్దా?

కేషియో : నేనందుకు తగినవాణ్ణిగాదు. రేపుపొద్దున్నే పెందరాళే పోయి నా విషయం సరిజెయ్యండని ఆ మహాతల్లిని బతిమాలుతాను. నేను మెదలకుండా వూరుకొంటే నా గతేమవుతుందా అని నాకు అదటుగా యేమీ తోచకుండావుంది.

ఇవాగో : అదినిజం శెలవు. నేను కాపలాకి పోవాలిక.

కేషియో : శెలవు (నిష్క్రమణ)

ఇవాగో : ఆ సిద్దీని మంచి జేసుకోనేందుకు నేను దాపరికం లేకుండా హృదయ పూర్వకంగా తిరుగులేని సలహా యిచ్చినట్లు వొకపక్కన కళ్లకు కనపడుతూంటే నేను కపట నాటక మాడు తున్నానని యే వెధవ అనగలడు ? యే న్యాయమైన కార్యం విషయంలోనైనా డెస్‌డెమోనాను లొంగదీయటం యెంతో సులభం. ఆమె పంచభూతాల్లాగా స్వేచ్ఛాజీవి; ఫలకరమైన మనిషి. ఇకను ఆ సిద్దీని లోబర్చుకొనే విషయమంటే ఆమెకో లెఖ్ఖలోదిగాదు. ఆమెకోసం వాడు కులం మతం వూరూ పేరూ అన్నీ వదులుకోగలడు. వాడికి ఆమె మంటే యెంత ప్రేముందంటే వాడి బలహీనతల్ని ఆమె యిష్టమొచ్చినట్లు వుపయోగించుకోగలదు. వాణ్ణి నీట ముంచటమో పాలముంచటమో చెయ్య గలదు. ఆటబొమ్మలాగా ఆడించగలదు. కనక కేషియో స్వంతమేలు కోసరం నేనిచ్చిన సలహా యెలా కుచ్ఛితపు సలహా అవుతుంది ? ఇది ఫక్తు భూతవేదాంతం! మేడిపండుజూడ మేలిమైయుండు. పొట్టవిచ్చి చూడ పురుగులుండు! వొక పక్కన యీ పిచ్చిపుల్లాయిగాడు ఆమెని బతిమాలుతూంటే అమె ఆ సిద్దీగాణ్ణి వాడికోసరం బతిమాలుతూంటే, మరోపక్కన ఆమె తనకామాగ్ని చల్లార్చుకోటానికి ఆ పుల్లాయిగాణ్ణి తిరిగీ పనిలో పెట్టుకోమని చెబుతూందని నేను చల్లగా ఆ సిద్దీగాడిచెవులో వూదుతా. ఆమె



వాడికి యెంతమేలు చెయ్యాలనుకొంటే తనకు అంతకీడు గలుగుతుంది. ఆమె మంచితనమే ఆమె చెడుతనం అయ్యేట్లు చేస్తా. పుణ్యానికిపోతే పాపమెదురైనట్లు ఆమె మంచితనమే వొక పెద్ద వల అయ్యేట్లుచేసి ఆ వలలో వాళ్లంతా యిరుక్కుని విలవిల దన్నుకొనేట్లు చేస్తా.

(రోడరిగో ప్రవేశం)

యేమయ్యా, రోడరిగో, యేమిటి సంగతులు ?

రోడరిగో : నేనిక్కడ వేటగాడిలాగా గాక వేటాడబడే జంతువులాగా తిరుగుతున్నాను. నాడబ్బు దాదాపు ఖాళీ అయ్యింది. అందుకుతోడు యీ రాత్రి బాగా బుద్ధొచ్చేట్లు కర్రదెబ్బలు గూడా తిన్నాను. ఆ సమస్య అలాగే వుంటుంది; నా శ్రమకు ఫలితం అనుభవిస్తూ వుంటాను. కాబట్టి సొమ్ము సఫాజేసుకొని కాస్త బుర్రతో ఆలోచించి వెనిస్‌కి తిరిగి వెళ్తాను

ఇవాగో : ఓర్పులేని వాళ్లకి విజయం వుండదు! యెక్కడైనా మొక్క పుట్టగానే మ్రానవుతుందటయ్యా? మనం బుర్ర వుపయోగించి పనిజేస్తున్నామేగాని భూత మంత్రాల్తో చెయ్యటం లేదని నీకుతెలుసు అలాంటప్పుడు మన తెలివితేటలు ఫలించాలంటే కొంతకాలం పడుతుంది. యేమంటావు నేనన్నది బాగాలేదూ ? కేషియో నిన్నుకొట్టాడు; యికను ఆ చిన్నదెబ్బకే వాడివుద్యోగం కాస్తా సున్నా అయింది. యెండ అన్నిపువ్వులకే సమానంగానే తగులుతున్నప్పటికీ మొదట పూచిన పువ్వే మొదట కాయగాస్తుంది. కనకా

కొంచెం వోపికపట్టూ మరీ. అరే, తెల్లవారింది! వుల్లాసంవల్లా, పనివల్లా గంటలెంత వడిగా గడిచిపోతున్నాయో గూడా తెలవటంలేదు. యికవెళ్ళు. నీ బసకి నువ్వుపో, పొమ్మనిచెప్పా! యిటు తర్వాత శుభవార్త వినగలవు. అరె, పోవయ్యాబాబూ! (రోడరిగో నిష్క్రిమణ) యింకా రెండుపనులు చేయాల్సి వుంది. నా భార్యను కేషియో తరపున తన యజమానురాలితో చెప్పేట్లు చెయ్యాలి. ఆవిడది చేసేట్లు చేస్తాను. యికను యీలోగా సిద్దీగాణ్ణి దూరంగా తీసుకుపోయి కేషియో డెస్‌డెమోనాతో మాట్లాడుతున్నప్పుడు చూపించి ఆ సిద్దీగాడు యెగిరిపడేట్లు చెయ్యాలి. ఆఁ. అదీసంగతి! యీ విషయంలో యిక నత్తగుల్ల నడక నడిస్తే లాభంలేదు. (నిష్క్రిమణ)

---

# మూడవ అంకం

## మొదటి రంగం : సైప్రసు : కోటముంగిట

(వాయిద్య గాళ్ళతో కేషియో ప్రవేశం)

కేషియో : బాబూ, యెక్కడ వాయించండి. మీ శ్రమకు తగ్గ ప్రతిఫలం యిస్తాను. చిన్నపాట వాయించండి : "జనరల్, ఉదయాభివందనాలు." మొదలు పెట్టండి. (వారు వాయిస్తారు)

(హాస్యగాని ప్రవేశం)

హాస్యగాడు : యేమిటయ్యా బాబూ మీది నేపుల్సు వాయిద్యాల్లాగా ముక్కుతో మాట్లాడు తున్నాయి ?

వాయిద్యగాళ్ళు : అదేమిటండీ అలా అంటారూ ?

హాస్యగాడు : యివ్వి వూదే వాయిద్యాలు గాదటయ్యా ?

వాయిద్యగాళ్ళు : అవునండయ్యా.

హాస్యగాడు : ఒహో, దానికో వాలం వుంది.

వాయిద్యగాళ్ళు : దేనివాలకం ?

హాస్యగాడు : అదేనయ్యా. నే నెరిగిన చాలా వూదుడు వాయిద్యాలకు. కాని చూడండి బాబూ, యివిగో యీడబ్బు తీసుకోండి. మీ సంగీతం జనరల్ గారికి యెంత నచ్చిందంటే యిక నే మాత్రం వాయించవద్దంటున్నారు.

వాయిద్యగాళ్ళు : సరేనండయ్యా. వాయించం లెండి.

హాస్యగాడు : యికను వినపడని సంగీత మేదన్నావుంటే మీ యిష్టమొచ్చినంత కానివ్వండి. కాని, అన్నట్లు జనరల్ గారికి సంగీతమంటే యేమంత యిష్టంలేదు.

వాయిద్యగాళ్ళు : వినపడని సంగీతం మాదగ్గిర లేదండీ.

హాస్యగాడు : అయితే యిక మీ వాయిద్యాలు సంచుల్లో పెట్టెయ్యండి. నేను వెళ్తున్నామరి. పొండి. గాలిలోకి మాయమవ్వండి ! (వాయిద్యగాళ్ళ నిష్క్రమణ)

కేషియో : చెప్పేది వింటున్నావా, మిత్రమా ?

హాస్యగాడు : "చెప్పు" యేదీ వినడంలేదు. నా చెవులు తమరి మాటలు వింటున్నాయి.

కేషియో : దయచేసి నీ శ్లేషలూ గీషలూ దాచి పెట్టెయ్యి. యిదిగో యీ బీదవాడిచ్చే యీ చిన్న బంగారు నాణెం తీసికో. జనరల్ భార్యగారి దాసీలేచి తిరుగుతూంటే కేషియో అనే మనిషి ఆమెతో కొంచెం మాట్లాడాలంటున్నాడని చెప్పు. చెబుతావా ?

హాస్యగాడు : ఆమె లేచి తిరుగుతూందండి. యిక్కడకు వెళ్ళమని తెలియ జేస్తాను.

కేషియో : చెప్పు బాబూ కాస్త. (హాస్యగాని నిష్క్రమణ)

(ఇవాగో ప్రవేశం)

సరీగ్గా సమయాని కొచ్చారండీ మీరూ.

ఇవాగో : అయితే మీరు అప్పటినుండీ పడుకోనే లేదా ?

కేషియో : ఊహూం. మనవిడిపోక ముందే తెల్లవారిందాయె. ధైర్యంచేసి మీ భార్యకు కబురంపాను. యెందుకంటే డెస్డె



మోనా గారిని కలిసి కొనేందుకు యేదో వాక అవకాశం చూడమని అడగటానికి.

ఇవాగో : నేనిప్పుడే ఆవిణ్ణి మీ దగ్గిరకి పంపుతా. అంతేగాదు. మీరు స్వేచ్ఛగా మాట్లాడు కొనేందుకు మధ్యలో అడ్డం లేకుండా సిద్దీని దూరంగా తీసికెళ్తా.

కేషియో : అందుకెంతో కృతజ్ఞుణ్ణి. (ఇవాగో నిష్క్రమణ) ఫ్లారెన్సు పౌరుల్లో యింతకంటే దయగలాణ్ణీ నిజాయితీపరుణ్ణీ నేనింతవరకూ చూడలేదు.

(ఎమీలియా ప్రవేశం)

ఎమీలియా : నమస్కారం, లెఫ్టినెంటుగారూ. మీకు కష్టాలొచ్చినందుకు నాకు విచారంగావుంది. అయినా మరేం ఫర్వాలేదు. అన్నీ వాటంతటవే తప్పకుండా కుదటబడతాయి. జనరల్ గారూ ఆయనభార్యా మీ విషయం గురించే మాట్లాడు కొంటున్నారు. ఆమె మీ తరఫున గట్టిగా మాట్లాడు తున్నది. అందుకు సిద్దీగారేమంటున్నారంటే మీరు గాయపరిచిన మనిషికి సైప్రసులో గొప్ప పేరుందనీ గొప్ప చుట్టరికాలు వున్నాయనీ, అందువల్ల మిమ్మల్ని వుద్యోగంనుండి తొలగించకపోతే పెద్దచిక్కు వచ్చేదనీ అంటున్నారు. కాని, మీరంటే తనకు ప్రేముందనీ, మిమ్మల్ని పనిలోకి తీసుకొనమని తనకెవరూ చెప్పనవుసరం లేదనీ, సమయం వచ్చినపుడు తానే మిమ్మల్ని తిరిగి ఆ వుద్యోగంలో పెడతాననీ అంటున్నారు.

కేషియో : అయినప్పటికి మీరేమీ అనుకోకుండా వుంటే వొక్క మాట చెబుతాను. మీరు మంచిదనుకొంటే, జరిగే అవకాశ

ముంటే, డెస్‌డెమోనా గారితో వొంటరిగా వొక్కమాట మాట్లాడే అవకాశం యిప్పించండి.

ఎమీలియా : అయితే లోనికిరండి. మీరు స్వేచ్ఛగా మాట్లాడుకునే స్థలం చూపెడతాను.

కేషియో : మీమేలు మరువలేను. (నిష్క్రమణ)

## రెండవ రంగం : సైప్రసు : కోటలోపల

(ఒథెల్లో, ఇవాగో, పెద్దమనుష్యులూ ప్రవేశం)

ఒథెల్లో : ఇవాగో, యీ వుత్తరాలు నౌకసరంగుకి యివ్వు. అతడి ద్వారా సెనేట్ నావిధి నిర్వహణ జరిగేట్లుచెయ్యి. అదైనాక, నేను కోటగోడలమీద నడుస్తూంటాను. నువ్వు అక్కడికిరా.

ఇవాగో : చిత్తం, ప్రభూ అలాగే చేస్తాను.

ఒథెల్లో : యేమయ్యా, యీ రక్షణ ప్రాకారం మనం పోయి చూద్దామా ?

పెద్దమనుష్యులు : చిత్తం తమరి యిష్టం. (నిష్క్రమణ)

## మూడవ రంగం : సైప్రసు

### కోటలోని తోట

(డెస్‌డెమోనా, కేషియో, ఎమీలియాల ప్రవేశం)

డెస్‌డెమోనా : నామాటనమ్మండి, కేషియోగారూ మీకోసం నేను చేయగలిగినదంతా చేస్తాను.



ఎమీలియా : పాపం, చెయ్యండమ్మగారూ నా పెనిమిటి యీ వ్యవహారం తనదే అయినట్లు యెంతో విచారంగా వున్నారు.

డెస్‌డెమోనా : మంచివాడికి మనసూరుకొంటుందా మరీ ? కేషియోగారూ, యేమాత్రం సందేహించమాకండి. నా ప్రభువూ, మీరూ యిదివరకు యెంత స్నేహితంగా వున్నారో తిరిగి అంత స్నేహితంగానూ వుండేట్లు చేస్తాను.

కేషియో : అమ్మగారూ, మీరెంతో ఉదారబుద్ధిగల వారండీ. మీమేలు నేను జన్మజన్మానా మరువలేను. మీదాసుణ్ణి.

డెస్‌డెమోనా : మీరు విశ్వాస పాత్రులని నాకుతెలుసు. అందుకు మీకు అభివందనాలు. నా ప్రభువంటే మీకెంతో ప్రేముంది. వారిని మీరు చాలాకాలంగా యెరుగుదురు. నామాట నమ్మండి—ఆయన అవుసరం అయినదానికంటే మీ కెక్కువ దూరంగా వుండరని హామీ యిస్తున్నాను.

కేషియో : ఆ మాట నిజమే నమ్మగారూ. కాని, అవుసరాన్నిబట్టి వారు యెక్కువకాలం అలావుండొచ్చు. అప్పుడు అనేక స్వల్ప విషయాల్ని వారు పట్టించుకోవచ్చు. కాగా, కొత్త విషయాలు పుట్టుకురావచ్చు. యెందుకంటే నా వుద్యోగం మరొకరికిస్తే, నేను దగ్గరుండటం జరగదు. అందువల్ల నా ప్రేమనూ సేవనూ వారు మరిచిపోవటం జరగవచ్చు.

డెస్‌డెమోనా : ఆ అనుమానాన్ని మీరు యే కోశానా పెట్టుకోవద్దు. మీ స్థానాన్ని మీ కిప్పించుతానని ఎమీలియా ముందు నేను హామీ యిస్తున్నాను. నేనొకసారి గనక మాట యిచ్చానంటే ఆరు నూరైనా అది చేసి తీరతానని నమ్మండి. మీపని అయ్యేవరకూ వారికి మనశ్శాంతి లేకుండా చేస్తాను; వారికి నిద్రలేకుండా చేస్తాను; ఆఖరికి పడకగదిలో గూడా బోధ

లెడతాను. యిన్నెందుకు? ప్రతినిమిషమూ మీ విషయం గురించి వెంటబడతాను. కనక వుత్సాహంగా వుండండి. నేను ప్రాణాలన్నా వదులుకొంటా గాని మీ పని పూర్తిగాకుండా వూరుకోను.

(ఒథెల్లో, ఇవాగోల ప్రవేశం)

ఎమీలియా : అమ్మగారూ, ప్రభువు యిటే వస్తున్నారు.

కేషియో : శెలవు తీసుకొంటా నమ్మగారూ.

డెస్‌డెమోనా : యెందుకండీ? వుండండి, వుండి నేనేం మాట్లాడతానో వినండి.

కేషియో : యిప్పుడుగాదులెండి. నాకు మనసు యేమిటోగావుంది. మనస్సు సరిగ్గా లేనప్పుడు మెదలకుండా వూరుకోటం మంచిది.

డెస్‌డెమోనా : సరే మీయిష్టం. (కేషియో నిష్క్రమణ)

ఇవాగో : అఁ—! అది నాకిష్టంలేదు!

ఒథెల్లో : యేమిటి నువ్వనేదీ?

ఇవాగో : యేమీలేదు, ప్రభూ, ఐనా—అదే యేమిటో నాకు తెలవటంలేదు.

ఒథెల్లో : నాభార్య దగ్గర్నుండి వెళ్ళింది కేషియోగాదూ?

ఇవాగో : కేషియో వెళ్ళాడంటారా, ప్రభూ? ఉహూఁ మీరు రావటం చూసి ఆయనలా తప్పుచేసిన వాడిలాగా పక్కకి తొలిగిపోతాడని నేననుకోను.

ఒథెల్లో : నేను అతడనే అనుకొంటున్నా.

డెస్‌డెమోనా : యేమి సంగతులు ప్రభూ? మీ కోపానికి గురై బాధపడుతూన్న వొకరితో నేనింతకుముందే మాట్లాడుతున్నా.



ఒథెల్లో : నువ్వనేదెవర్ని గురించి?

డెస్‌డెమోనా : యెవరేముందీ? మీ లెఫ్టినెంటు కేషియోగార్ని గురించి, మీహృదయాన్ని కరిగించే సరసతగానీ శక్తిగానీ నాలోవుంటే, ఆయన పశ్చాత్తాప పడుతున్నాడని గుర్తించి క్షమించండి. ఆయన తెలిక తప్పుచేశాడు; అంతేగాని తెలిసి కావాలని చెయ్యలేదు. మిమ్మల్ని హృదయపూర్వకంగా ప్రేమించిన వారిలో ఆయనొకడు. నామాట నమ్మండి. నా ప్రార్థనవిని ఆయన వుద్యోగం తిరిగి ఆయనకు యివ్వండి.

ఒథెల్లో : యింతకుముందు అతడిక్కణ్ణుంచి వెళ్ళాడా?

డెస్‌డెమోనా : అవును. యెంత దిగాలుపడి వెళ్ళాడంటే ఆ దిగుల్ని కొంత నావద్ద వదిలిపోయాడు ఆయనతోపాటు నేను గూడా దిగులుపడటానికి. చూడండి, ఆయన వుద్యోగం ఆయనకు యివ్వండి.

ఒథెల్లో : యిప్పుడేగాదు, చిట్టీ, మరోకప్పుడు.

డెస్‌డెమోనా : అయితే యింత అది త్వరలో చేస్తారా లేదా?

ఒథెల్లో : నీకు కావాల్సినంత త్వరలో, చిట్టీ.

డెస్‌డెమోనా : యీ రాత్రికి భోంచేసేప్పుడు చేస్తారా?

ఒథెల్లో : ఉహూఁ. యివాళ రాత్రికిగాదు.

డెస్‌డెమోనా : అయితే రేపు మధ్యాన్నం భోంచేసేప్పుడు?

ఒథెల్లో : రేపు మధ్యాన్నం నేను యింట్లో భోంచెయ్యను. రేపు నేను కోటలో కెప్టెన్లని కలిసికోవాలి.

డెస్‌డెమోనా : అయితే సరే రేపు రాత్రికిగానీ, లేక మంగళవారం పొద్దున్నగానీ, అలాగాకపోతే మంగళవారం మధ్యాన్నమో రాత్రికోగానీ, అదీ వీలుగాకపోతే బుధవారం పొద్దున్న

నా మాటవిని యెప్పుడో చెప్పండి. కాని, అది మూడురోజుల కంటే మించగూడదు సుమా. నిజంగా ఆయన పశ్చాత్తాప పడుతున్నాడు. సైనిక శిక్షణ విషయంలో అత్యుత్తములద్వారా యితరులకు గుణపాఠం నేర్పాలనే దాన్ని మినహాయించితే, మామూలుగా ఆలోచించి చూసేట్లయితే ఆయన చేసినతప్పు యేమంత పెద్దదేంగాదు. ఆయన్నెప్పుడు తిరిగి తీసుకొంటా రండీ? అబ్బ, చెప్పండీ. నేనే అయితే మీరేది అడిగినా అలా వూగిసలాడను. యేమంటారు? మిమ్మల్ని పెళ్ళిచేసి కొనమని మైకేల్ కేషియోగారు నావద్దకు రాయబారం వచ్చి నపుడు నేను ఘెన్నోసార్లు మిమ్మల్నిగురించి దూషణగా మాట్లాడితే మీరు మంచివాడంటూ పాపం ఆయన యెంతో వాదించి చెప్పారు. అలాంటి మనిషిని పనిలో పెట్టుకోటానికి అంత ఆలోచనా అంత ఆలస్యమూనా? నామాట నమ్మండి. నేను చాలా—

ఒథెల్లో : దయచేసి యిక ఆ విషయం యెత్తమాక. అతడెప్పుడు రాదలిస్తే అప్పుడు రానియ్యి! నువ్వు కోరిందేదీ నేను కాదనను.

డెస్‌డెమోనా : అయ్యో, అక్కడికి మీరేదో నాకు వరం యిస్తు న్నట్టు. మీక్షేమం కోసరం మీరు చలికి చేతితొడుగులు తొడుక్కోవాలనీ, బలానికి మంచి తిండితినాలనీ, వెచ్చగా బట్టలేసుకోవాలనీ, యింకేదైనా మీకు అవుసరమైంది మీరు చేసుకోవాలనీ అనే విషయం మీకుగాక నాకే పట్టినట్లుందే చూస్తేనూ! నేను నిజంగా మీ ప్రేమను పరీక్షించే కోర్కె యేదన్నా కోరవలసివస్తే అప్పుడు మీరు నిజంగా లోతుగా ఆలోచించవలసిన అవుసరం వుంటుంది,



ఒథెల్లో : నువ్వు కోరిందేదీ నేను కాదనన్నా! అందుకని దయ చేసి వొక్కపనిచెయ్యి. నా మానాన నన్ను కాస్త వొంటగారి వుండనియ్యి.

డెస్‌డెమోనా : నేను అందుకు కాదంటానా? లేదు. శెలవు, ప్రభూ.

ఒథెల్లో : శెలవు, నా డెస్‌డెమోనా. యిక్కణ్ణుంచి సరాసరి నేను నీదగ్గరకే వస్తా.

డెస్‌డెమోనా : రా, ఎమీలియా—మీ యిష్టమొచ్చినట్లు చెయ్యండి. మీరెలా చేసినా నేను మీ దాసురాల్ని. (డెస్‌డెమోనా, ఎమీలియాల నిష్క్రమణ).

ఒథెల్లో : భలే మాదర్చేదు! నీమీద నాకు ప్రేమలేనట్లయితే నా ఆత్మ అధోగతి పాలైనంత వొట్టు! యికను నేను నిన్ను ప్రేమించనినాడు ప్రళయం మళ్లీ వచ్చినట్లే.

ఇవాగో : ప్రభూ

ఒథెల్లో : యేమంటున్నావు, ఇవాగో?

ఇవాగో : మీరు డెస్‌డెమోనమ్మ గారిని పెళ్ళాడమని అడిగే రోజుల్లో యీ సంగతి మైకేల్ కేషియో గారికి తెలుసునాండి?

ఒథెల్లో : అవును మొదటినుండి చివరివరకూ తెలుసు. యెందు కలా అడుగుతున్నావు?

ఇవాగో : మరేంలేదండీ. వూరికనే యేదో ఆలోచన తడితే తెలుసుకొనేందుకు అడిగా, అంతే.

ఒథెల్లో : ఆ ఆలోచనెందుకు వచ్చింది, ఇవాగో?

ఇవాగో : ఆమెగారితో ఆయనకు పరిచయం వుందని నాకింతకు ముందు తెలవదు. అందుకని.

ఒథెల్లో : అవును. వుంది. మాయిద్దరిమధ్యా అతడు చాలాసార్లు తిరిగాడు గూడాను.

ఇవాగో : నిజంగానా ?

ఒథెల్లో : నిజంగానా ? అవును, నిజంగానే! అందులో యేమైనావుందంటావా ? అతడు నిజాయితీ పరుడేనా ?

ఇవాగో : నిజాయితీ పరుడేనా అనా ప్రభూ ?

ఒథెల్లో : నిజాయితి పరుడా ? అవును, నిజాయితీ పరుడా అని.

ఇవాగో : అన్నివిధాలా, ప్రభూ.

ఒథెల్లో : నువ్వేమనుకొంటున్నావు ?

ఇవాగో : అనుకోవటమా, ప్రభూ ?

ఒథెల్లో : అనుకోవటమా, ప్రభూ ? తన ఆలోచనలో యేదో భూతమున్నట్లుగా దాన్ని బయటికి చూపెట్టాలంటే వికృతంగా వున్నందువల్ల వీలు లేనట్లుగా నే నన్నమాటే అంటున్నాడు. నీ మనసులో యేదోవుంది. యింతకు ముందే కేషియో నా భార్య దగ్గర్నుండి వెళ్ళేప్పుడు "అది నాకిష్టంలేదు" అని నువ్వనటం నేవిన్నా. తర్వాత. మాయిద్దరి మధ్యా అతడు రాయభారం నడిపాడని నేనంటే, "నిజంగానా ?" అని అరిచావు. అప్పుడు నీ మనసులో యేదో దాచి చప్పున తలుపు మూసేసి నట్లుగా నీ కనుబొమలు చిట్లించావు. నా మీదనే గనక నీకు మీప్రేముంటే, అదేమిటో నాకుచెప్పు.

ఇవాగో : ప్రభూ మిమ్మల్ని నేను ప్రేమిస్తున్నానని మీకు తెలుసు.

ఒథెల్లో : అలాగనే అనుకొంటున్నా. అందువల్లనే, నువ్వు నీ కున్న ప్రేమవల్లా నీతి మంతనంవల్లా తొందర పడకుండా నిదానంగా



నింపాదిగా ఆలోచించి మాట్లాడుతావు గనకనే, నువ్విలా నీ అభిప్రాయం చెప్పటానికి వెనకాడటం చూసి నాకు మరింత భయం కలుగుతూంది. యెందుకంటే అషాఢ భూతుల విషయంలో అవి వాళ్ళ మామూలు జిత్తులు. అతివినయం ధూర్తలక్షణం అన్నారు. కాని, అవే నిజాయితీపరుల విషయంలో వారి హృదయమార్దవానికి లక్షణాలు.

ఇవాగో : మైకేల్ క్షేషియో విషయంలో మాత్రం ఆయన నిజాయితీ పరుడని నేను ప్రమాణంచేసి చెప్పగలను.

ఒథెల్లో : నేనూ అలాగే అనుకొంటున్నా.

ఇవాగో : మనుష్యులు తాము బయటికి అగుపించేరీతిగా ప్రవర్తించాలి, అలా ప్రవర్తించనివారు అసలు మనుష్యులే కాదంటాను.

ఒథెల్లో : నిజం; మనుష్యులు తాము బయటికి అగుపించేరీతిగా ప్రవర్తించాలి.

ఇవాగో : కనక కేషియో నిజాయితీ పరుడని నేననుకొంటున్నా.

ఒథెల్లో : ఊహూఁ. అలాగాదు. అయినప్పటికీ యిందులో యేదో యింకా కొంతవుంది. నామాటవిని నీ మనసులో యేముందో కుండపగలగొట్టి చెప్పు.

ఇవాగో : ప్రభూ, నన్నుమీరు క్షమించాలి. నా ప్రతివిధినీ నేను నిర్వర్తించాల్సి వున్నప్పటికీ, నా హృదయాంతరాళంలోని ఆలోచనల్ని వెల్లడించాల్సిన విధిమాత్రం నాకులేదు. ఆస్వేచ్ఛ ఆఖరికి బానిసలకు గూడావుంది. నా ఆలోచనల్ని వెల్లడించటమా ? యెందుకూ, అవి నీచమైనవనీ బూటకమైనవనీ అనుకొందాం. యెందుకంటే ఆఖరికి చంద్రుడంతటి వాడికి గూడా

నల్లమచ్చవుంది. మనసులో యేదో వొక దురాలోచన మని షెవడుంటాడు ?

ఒథెల్లో : ఇవాగో, వొకపక్కన నీ మిత్రుడికి అన్యాయం జరిగిందని అనుకొంటూ మరోపక్కన అతడికి ఆ విషయ మేమిటో తెలపకపోతే నీ మిత్రుడికి నువ్వుద్రోహం చేస్తున్నా వన్నమాట.

ఇవాగో : నా ప్రార్థన వినండి—నేను అనుకొన్నది వొకవేళ పొరపాటుగావచ్చు. యెందుకంటే పిలవని పేరంటంగా నా అంతటనేను తప్పులేవో వొప్పులేవో పరిశీలించటం నాకల వాటు. అలాచేయటంలో, నిజంగా తప్పులుగాని వాటిని తప్పులుగా వూహించటం గూడా తరచుగా నా అలవాటు. కనక మీరు అలాంటి అస్తుపిస్తు సలహాలమీద ఆధారపడి అకుసు తొక్కవద్దని నా ప్రార్థన. నా మనసులోని ఆలోచ నల్ని మీకు చెప్పినందువల్ల మీ మనశ్శాంతికి గానీ మంచికి గానీ, నా పురుషత్వానికి గానీ నిజాయితీకి గానీ మంచిదిగాదు. అలాచేయటం వివేకం అనిపించుకోదు.

ఒథెల్లో : అంటే యేమిటి నీ అర్థం ?

ఇవాగో : ప్రభూ, స్త్రీకేగానీ పురుషుడికేగానీ మానం అనేది అత్యంత ప్రధానం. కనక నావద్దనుండి డబ్బు దొంగిలించిన వాడు గబ్బిచెత్త దొంగిలించినట్లే. దానికి విలువుందీ, విలువ లేదూ. అది వొకప్పుడు నాది, యిప్పుడు వాడిది, యింతకు యెన్నోవేల మందినుండి చేతులుమారింది. కొబట్టి అలాగాక నావద్దనుండి నా మానం దొంగిలించినవాడు దానివల్ల వాడు ధనికుడు కాకపోయినా నన్నుమాత్రం దౌర్భాగ్యుణ్ణి చేసిన వాడవుతాడు.



ఒథెల్లో : అదాసంగతి! నీ ఆలోచన లేమిటో నేను తెలిసికో గలను.

ఇవాగో : మీరు తెలిసికోలేరు, నా హృదయమే తీసి మీచేతిలో పెట్టినప్పటికీ యికను నాహృదయం నా వశంలోవుంటే మీరు అసలే తెలిసికోలేరు.

ఒథెల్లో : ఒహో!

ఇవాగో : ప్రభూ, అనుమానం మీలో ప్రవేశించకుండా జాగర్త పడండి! అనుమానం పెనుభూతం!

ఒథెల్లో : అయ్యో దౌర్భాగ్యమా!

ఇవాగో : దరిద్రుడికి సంతృప్తివుంటే అతడు ధనికుడి కిందే లెఖ. కాని అంతులేని ధనమున్న వాడికి ఆత్మ సంతృప్తిలేక తాను దరిద్రుణ్ణి అవుతానేమోనని నిత్యమూ భయపడుతూంటే అతడు దరిద్రుడి కంటే పరమ దరిద్రుడు. కనక నాజాతి ఆత్మలన్న నన్ను అనుమాన పెనుభూతంనుండి కాపాడుగాక!

ఒథెల్లో : యెందుకు, యిదంతా యెందుకు ? నాకు అనుమానమే కలిగితే జీవితాంతం వరకూ ఆ అనుమానాన్ని అలాగే భద్రంగా వుంచుకొని అదిగాక కొత్త అనుమానాలు కలిగే స్థితి తెచ్చుకొంటాననా నీవూహ ? ఉహూఁ! వొక్కసారి అనుమానం కలిగితే యిక దాని అంతు తేలిపోవాల్సిందే. నేను నీలాంటి నీచమైన వూహలకు నాహృదయంలో స్థానం యిస్తే నన్ను వెర్రిశుంఠని పిలువు. నా భార్య అందంగా వుందనీ, బాగాతింటుందనీ, పదిమందితో సావాసం చేయటం యిష్టమనీ, బోళాగా మాట్లాడుతుందనీ, పాడుతుందనీ, ఆడు తుందనీ, బాగా నృత్యం చేయగలదనీ అన్నంతమాత్రాన్నే

అనుమానించే రకాన్నిగాదు నేను. సౌశీల్యం గలవారిలో యివి మరింత శ్లాఘనీయమైన లక్షణాలు. ఆమెనన్ను తన కళ్లతో తాను చూసి నన్ను కావాలని కోరుకొంది. కనక నేను అందంగా లేనంతమాత్రంచేత "భార్యా రూపవతీ శత్రుః" అనిగానీ ఆమె నమ్మకద్రోహం చేస్తుందనిగానీ నాకు లవ లేశంగూడా భయసందేహాలులేవు. లేదు, ఇవాగో, అలాకాదు. సందేహించేముందు నా కంటితో నేను చూడాలి. ఇకను సందేహించితే, రుజువు కావాలి. అది రుజువైతే యిక మిగిలే దొక్కటే—ప్రేమో అనుమానమో రెంటిల్లో యేదో వొకటి నశించి తీరాలి!

ఇవాగో : అందుకు సంతోషం యెందుకంటే మీపట్ల నాకుగల ప్రేమనుగురించీ విధుల్నిగురించీ యిప్పుడిక నేను మరింత స్వేచ్ఛగా మాట్లాడే అవకాశం,నాకు దొరికింది. కాబట్టి, నేను మీకు బద్ధుణ్ణి గనక, నేను చెప్పేదివినండి. రుజువుని గురించి నేనిప్పుడప్పుడే యేమీ చెప్పలేను. కానైతే, మీ భార్య విషయం జాగర్త తీసుకోండి. ఆమె కేషియోతో మాట్లాడేప్పుడు బాగా కనిపెట్టి చూడండి. కాని, వొక్కసలహా కేవలం అపనమ్మకంతోగానీ అతినమ్మకంతోగానీ పరిశీలించమాకండి. మీ వుత్తమ స్వభావం దురుపయోగం చేయబడం నాకిష్టంలేదు. ఆ విషయమై జాగర్త తీసుకోండి. మన దేశస్వభావమేమిటో నాకు బాగాతెలుసు. వెనిస్ స్త్రీలు భర్తలముందు పతివ్రతలు; పరాయి మగాళ్లముందు భ్రష్టలు. వారు ఆ భ్రష్టత్వం లేకుండా చేసుకోరు; అది బయిటికి పొక్కకుండా మాత్రం చూస్తారు.

ఒథెల్లో : అలాగా ?



ఇవాగో : ఆమె తన తండ్రిని మోసగించి మిమ్మల్ని పెళ్ళిచేసికొంది. మీ ఆకారంచూసి భయపడుతున్నట్లు పైకి నటిస్తూనే లోన మిమ్మల్ని ప్రేమించింది.

ఒథెల్లో : అవును. అదినిజం.

ఇవాగో : ఇంకేం అదిచాలు! అంత చిన్నతనంలో వుండిగూడా ఆమె తనతండ్రి కళ్లకు గంతలు గట్ట గలిగిందంటే—పాపం అదంతాఆయన మాయిలమారి మంత్ర విద్య అనుకొన్నాడు—అయినా నేనిలా మాట్లాడటం తప్పు. మీ మీదున్న ప్రేమతో నేను యిలా అతిగా వాగినందుకు నన్ను క్షమించమని ప్రార్థించు తున్నాను.

ఒథెల్లో : నేను నీరుణం యెన్నటికీ తీర్చుకోలేను.

ఇవాగో : నా మాటలు మీ మతిని కొంచెం చెదరగొట్టాయని కొంటున్నాను.

ఒథెల్లో : యెంతమాత్రం లేదు, యెంతమాత్రం లేదు.

ఇవాగో : నిజంగా అలాజరిగిందనే నేను భయపడుతున్నా. నేనన్నదేదో ప్రేమతోనే అన్నానని మీరు గ్రహిస్తారని ఆశిస్తున్నా. అదుగో, మీరు కొంచెయిదయ్యి నట్లగుపిస్తున్నారు. నన్నింకా అదీ యిదీ చెప్పమని వత్తిడి చెయ్యవద్దని నా ప్రార్థన.

ఒథెల్లో : చెయ్యను.

ఇవాగో : వొకవేళ మీరు వొత్తిడి చేస్తే నేను మనసులో అనుకొన్న దొకటైతే మాటలో చెప్పే దింకొకటైనా సదాశయానికి దెబ్బతగిలి తీరుతుంది. కేషియో నాకు మంచిమిత్రుడు—ప్రభూ, మీరు చలించినట్లగుపిస్తున్నారు.

ఒథెల్లో : ఉహూఁ. మరీ అంతగా యేమీయిదవ్వలేదులే. డెస్డెమోనా నిజాయితీ పరురాలే అని అనుకొంటున్నా.

ఇవాగో : ఆమె చిరకాలం అలాగే జీవించుగాక! మీరు అలా అనుకొనేందుకు చిరకాలం జీవించుదురుగాక!

ఒథెల్లో : అయినప్పటికీ, గుణంమారి—

ఇవాగో : ఔను. అదీ అసలు సంగతి. మీతో నిక్కచ్చిగా చెప్పాలంటే—తన వర్గానికీ, వయస్సుకీ యీడూ జోడూ ఐన అనేక సమ్మంధాలు వస్తే ప్రకృతి విరుద్ధంగా వాటిని తిరగ్గొట్టటం—ఛీ! ఆ విషయంచూస్తేనే యేదో అశ్లీలమూ, స్వభావానికి విరుద్ధమైన యేవో కుళ్లు ఆలోచనలూ వున్నట్లూ అగపడుతూంది. కాని, క్షమించండి. నేను యీ మాటలు ప్రత్యేకంగా ఆమెని దృష్టిలో పెట్టుకొని అనటంలేదు సుమా. ఐనప్పటికీ, చూడండీ, ఆమెతృష్ణ చూస్తే సందేహం కలుగుతున్నప్పటికీ, తానే మంచీచెడూ ఆలోచించుకొని మిమ్మల్ని తన జాతివారితో సమానంగా పోల్చుకొని సరిపెట్టుకొని పశ్చాత్తాప పడవచ్చు.

ఒథెల్లో : శెలవ్, శెలవ్! నాకింకా యేమన్నా ముందుముందు తెలిస్తే నాకుచెప్పు. నీ భార్యను అదంతా కనిపెట్టి చూస్తూండమను.

ఇవాగో : శెలవు, ప్రభూ. (దూరంగా నడిచి పోతాడు.)

ఒథెల్లో : నే నెందుకు పెళ్లిచేసికొన్నానసలు ? ఇతడికి తాను బైట పెట్టినదానికంటే నిస్సందేహంగా యెక్కువతెలుసు, చాలా యెక్కువ తెలుసు కాని, పాపం, చెప్పలేక పోతున్నాడు.

ఇవాగో : (తిరిగివచ్చి) ప్రభూ, తమరు యిక యీ విషయాన్ని గురించి యేమీ ఆలోచించవద్దని బతిమాలుతున్నా. అదంతా కాలమే నిర్ణయించుతుందని వదిలేసి వూరుకోండి. కేషియో



తన వుద్యోగానికి యెంతో తగినవాడు గనక అతడి కా స్థానం తిరిగియివ్వటం యుక్తమే అయినప్పటికీ అతణ్ణి కొంతకాలం అలా దూరంగా వుంచటం మీకిష్టమయ్యేట్లయితే అలా చేసినట్లయితే అతణ్ణి అతడి పద్ధతుల్నీ మీరు బాగా అర్థంచేసికోగలరు. అతణ్ణి తిరిగి వుద్యోగంలోకి తీసికొనమని మీ భార్య మిమ్మల్ని అదేపనిగా పీకులాటగా తొందరించు తుందేమో కనిపెట్టి చూడండి. దానివల్ల చాలా సంగతులు బోధపడతాయి. యిక నా విషయమంటే నేను తొందరపడి యేదో అన్నానని సరిపెట్టుకోండీ (నిజంగా నేను తొందరపడ్డాననుకొనేందుకు తగినకారణముంది). పోతే ఆమె యేమీ యెరుగని అమాయికురాలని అనుకోమని మిమ్మల్ని బతిమాలుతున్నా.

ఒథెల్లో : నేను ఆ మాత్రం ఆత్మ నిగ్రహంలేని వాణ్ణని అనుకోమాక.

ఇవాగో : సరే. మరోసారి శెలవు తీసుకొంటున్నా (నిష్క్రమణ)

ఒథెల్లో : ఇతడు యెంతో నిజాయితీగల మనిషి. అన్నివిషయాలూ తెలిసినవాడు. మనుష్యుల తరహాలన్నింటినీ కాచి వడపోసినవాడు. ఆమె విశ్వాసఘాతుకం చేసిందని రుజువైతే గజ్జికుక్కను బయటకు గెంటేసినట్లు గెంటిపారేస్తా. బహుశా నేను నల్లగావుండి విలాసగాళ్ల మాటల చమక్కులు నావద్ద లేనందువల్లనో, లేదా, వయసుముదిరి పోతున్నందు వల్లనో (ఐనా అదేమంత లెక్కలోదిగాదు), ఆమె వెళ్ళిపోయింది. నాకు నమ్మకద్రోహం జరిగింది. యికనేను ఆమెని ఛీయని ఛీదరించు కొంటేగాని నాకు శాంతిలేదు. హుం. పెళ్ళి!

యీ పెళ్లివల్ల వారిగిపడే ఫలితమేమిటయ్యాంటే యీ సుకుమార శరీరుల్ని మనవాళ్లని పిలుచుకోగలగటం; అంతేగాని వాళ్ల హృదయాలు మాత్రం మనవని చెప్పుకోటంగాదు. నేను ప్రేమించే వస్తువును యితరులు వుపయోగించుకొంటూంటే చూస్తూ వూరుకొనే దానికంటే గాడిదైపుట్టి బూడిదకంటం మోయటం మంచిది. కాని, గొప్పవాళ్ల యిళ్లల్లోవున్న జాడ్యమే అది. తక్కువవాళ్ల యిళ్లల్లోకంటే వీరియిళ్లల్లో యివి యెక్కువ జరుగుతూంటాయి. అది మృత్యువులాగా విధిరాత. దాన్నుండి తప్పించుకోటం సాధ్యంగాదు. అది గూడా మనలో కాస్త జీవంపుట్టి కళకళలాడుతూండే సమయంలోనే చప్పునవచ్చి తీరుతుంది. ఆఁ. డెస్‌డెమోనా వస్తూంది.

(డెస్‌డెమోనా, ఎమీలియాల ప్రవేశం.)

అబ్బా, ఆమే వంచకురాలైనట్లయితే యిక ఆమెను పుట్టించిన దేముడికి బుఱ్ర లేదన్నమాట! ఉహూఁ. అలాంటిపని నేను నమ్మను.

డెస్‌డెమోనా : యేమిటీ ఆలస్యం, ప్రియ ఒథెల్లో? మీ భోజనమూ, మీరు ఆహ్వానించిన యీ ద్వీపవాసులూ మీకోసరం యెదురు చూస్తున్నారు.

ఒథెల్లో : ఆ తప్పంతా నాదే.

డెస్‌డెమోనా : యెందుకలా నీరసంగా మాట్లాడు తున్నారూ? వొంట్లో బాగాలేదా?

ఒథెల్లో : నుదురుమీద, యిదుగో యిక్కడ. నెప్పిగా వుంది?




డెస్‌డెమోనా : అదంతా మీరు నిద్రమేలుకొని వుండటంవల్లనే వచ్చింది. వుండండి. దానికి గట్టిగా కట్టుగడతాను. వొక్క గంటలో తగ్గిపోతుంది.

ఒథెల్లో : నీ తువాలు చాలా చిన్నది. చాలదు. (దాన్ని తోసెయ్యగా అది కింద పడిపోతుంది) కట్టావద్దు గిట్టావద్దు. అలాగే వుండనియ్యి. రా, పోదాంపద. (ఒథెల్లో, డెస్‌డెమోనాల నిష్క్రమణ)

ఎమీలియా : యీ తువాలు నాకు దొరికినందుకు సంతోషంగా వుంది. ఆ సిద్దీఆమెకి మొదట యిచ్చిన కానుక యిది. నా తలతిక్కమొగుడు యీ తువ్వాలును దొంగిలిచ్చి తెమ్మని నాతో నూరు సార్లయినా చెప్పి వుంటాడు. దీన్నెప్పుడూ దగ్గరుంచు కోమని ఆయన వొట్టుపెట్టి చెప్పినందువల్ల, ఆమె యెంతో ప్రేమతో యీ కానుక నెప్పుడూ తన దగ్గిర వుంచుకొని దాన్ని ముద్దాడి దాంతో మాట్లాడు తూంటుంది. దీనిమీది అల్లిక పనిని వొకచోట గుర్తుగా రాసుకొని దీన్ని ఇవాగోకి యిచ్చేస్తా. యిక దీన్ని ఆయనేం చేసుకొంటాడో అదంతా ఆ భగవంతుడికే యెరిక; నాకెందుకు? నాపనల్లా ఆయనకి తృప్తి గలిగించటం.

(ఇవాగో ప్రవేశం)

ఇవాగో : యిదేమిటి? యిక్కడ వొంటరిగా యేంచేస్తున్నావు?

ఎమీలియా : యింతనోరు చేసుకొని అరవమాక. నీ కొక వస్తువు యిస్తాను.

ఇవాగో : నాకొక వస్తువు యిస్తావా? అది మామూలుదే.

ఎమీలియా : యేది?

ఇవాగో : వెర్రిపెళ్ళాం.

ఎమీలియా : ఒహ్హో, అంతేనా ? ఆ చేరుమాలు నీకిస్తే నాకే మిస్తావు ?

ఇవాగో : యే చేరుమాలు ?

ఎమీలియా : యే చేరుమాలూ ? యే చేరుమాలేముందీ ? అదే, డెస్‌డెమోనాకి మొదట ఆ సిద్దీయిచ్చింది. నువ్వు దొంగిలించి తెమ్మని నా కనేకసార్లు చెప్పింది.

ఇవాగో : అయితే అది ఆమెదగ్గర్నుండి దొంగిలించావా ?

ఎమీలియా : ఎబ్బే, లేదు. పొరపాటుగా ఆమెదాన్ని కిందపడేసింది. యిక నేను అక్కడే వుండటంవల్ల చక్కగా తీసి దాచాను. యిదుగో చూడు.

ఇవాగో : హమ్మా. బలే దొంగముండవు పో! యేదీ యిలాయివ్వు.

ఎమీలియా : దీన్ని దొంగతనంచేసి తెమ్మని అంత యిదిగా నాకు చెప్పావు గందా దీంతో యేం చేస్తావేంటీ ?

ఇవాగో : ఆ సంగతి నీకెందుకూ ? (దాన్ని చటుక్కున లాక్కొంటాడు)

ఎమీలియా : దానివల్ల నీకు నిజంగా పెద్ద వుపయోగం లేకపోతే నాకు తిరిగి యిచ్చెయ్యి. పాపం, అది ఆమెదగ్గర లేకపోతే ఆమెకు వెర్రెత్తి పోతుంది.

ఇవాగో : అదేమీ తెలవనట్లు నటించమాక. దీంతో నాకు పనుంది. యికపో (ఎమీలియా నిష్క్రమణ) దీన్ని కేషియో బసలో వాడికి కనపడేట్లు పడేస్తా అనుమానముంటే తాడే త్రాచుపామై కరుస్తుంది. అనుమానంవున్న వాడి విషయంలో అతి స్వల్ప విషయాలు గూడా వేదప్రమాణాలుగా పనిచేస్తాయి. యీ



చేరుమాలేదైనా కొంతపని చెయ్యొచ్చు. నే నెక్కించిన విషంతో ఆ సిద్దీగా డిప్పటికే మారిపోయాడు. ప్రమాదకరమైన వూహలు వస్తుథా పచ్చివిషంలాంటివి. ఐనా అవి మొదట రుచిగానే వుంటాయి. కాని అవి రక్తంలో ప్రవేశించి పనిచేయటం మొదలెడితే గంధకపు గనుల్లాగా గప్పుమని మండుతాయి.

(ఒథెల్లో ప్రవేశం)

నేనలాగే చెప్పాను. అదుగోచూడు, వాడు యిటే యెలా వస్తున్నాడో! ప్రపంచంలోని యే మత్తుమందు గూడా నువ్వు నిన్నటిదాకా అనుభవించిన కమ్మని నిద్రనీకువచ్చేట్లు చెయ్యలేదు.

ఒథెల్లో : హబ్బా, హబ్బా, నాకు నమ్మకద్రోహం చేసిందా ?

ఇవాగో : అదేమిటండి, జనరల్‌గారు ? యిక నా విషయం యెత్తనే వద్దు!

ఒథెల్లో ! ఛీ! పోరా! నా గుండెమీద బొగ్గులకుంపటి పెట్టావు, ప్రమాణంచేసి చెబుతున్నా! తెలీకుండా యెంత ద్రోహం జరిగినా ఫర్వాలేదుగాని అది రవ్వంత తెలిసినా యిక రౌరవాది నరకమే.

ఇవాగో : అదేమిటి ప్రభూ ?

ఒథెల్లో : ఆమె తన కామతృప్తిని యెలా యెప్పుడు తీర్చుకొందో నాకేమి యెరుకమరి? అది నేను చూడలేదు, అనుకోలేదు, నాకు హానేమీ చెయ్యలేదు. క్రితం రాత్రి నేను హాయిగా నిశ్చింతగా నిద్రపోయాను. కేషియో ముద్దుల ముద్రలేవీ నాకు ఆమె పెదిమలమీద అగుపించలేదు. దొంగతనం జరిగినా అది జరిగిన

లోపమేమీ కనిపించ వాడికి అది జరిగిందని తెలవకపోతే అతడేమాత్రం దొంగలించబడ్డవాడు గాదు.

ఇవాగో : మీ మాటలకు నాకు విచారంగావుంది.

ఒథెల్లో : సైనికులంతా, పైవాడినుండి కిందివాడివరకూ, ఆమె సుందరమూర్తిని తనివితీరా అనుభవించి నప్పటికీ ఆ సంగతి నాకు తెలీకుండావుంటే నా సుఖానికీ ఆనందానికీ అంతరాయం వచ్చి వుండేదిగాదు. కాని. యిప్పుడిక యెన్నటికీ మనశ్శాంతి లేదు! యెన్నటికీ సంతృప్తి సుఖాలులేవు! పరరాజ్య కాంక్ష వొక ఉత్తమ లక్షణమైనట్లు చూపే సైనికులూ పెద్ద సంగ్రామాలూ యిక లేవు! ఇక లేవు! సకిలించే సమరాశ్వం, ఠంగురు మనేబాకా, రక్తాన్నుప్పొంగించే రణభేరీ, చెవులు గింగురు మనే పిల్లనగ్రోవీ, రెపరెపలాడే రాజధ్వజం, యుద్ధానికి సంబంధించిన ఆ లక్షణమూ, ఆ హుందాతనమూ, ఆ పటాటోపమూ, ఆ విజయోత్సవమూ అదంతా యిక లేదు! పిడుగుల ధ్వనుల్ని మించి గర్జించే ఫిరంగి మ్రోతలు యికలేవు! శెలవు! అన్నిటికి అందరికీ శెలవు! ఒథెల్లోపని తీరిపోయింది!

ఇవాగో : అదిసాధ్యమా ప్రభూ ?

ఒథెల్లో : అరేనీచుడా, నా ప్రియురాలు వ్యభిచారిణని నువ్వు తప్పకుండా నిరూపించాలి! తప్పకుండామరి! నాకు ప్రత్యక్ష సాక్ష్యం చూపించు. అది నువ్వు రుజువు చెయ్యలేకపోతే నిన్ను ముక్కలు ముక్కలుగా నరికి కాకులకీ గద్దలకీ వేస్తా!

ఇవాగో : అంతవరకూ వచ్చిందా ?

ఒథెల్లో : నాకళ్లకి చూపించు. లేకపోతే యే అనుమానమూ రాకుండా వుండేట్లు కనీసం యేదోవిధంగా రుజువుచెయ్యి. చెయ్యకపోయావో—నీకు చావు తప్పదు!



ఇవాగో : మహాప్రభూ—

ఒథెల్లో : వొకవేళ నువ్వు పనిగట్టుకొని ఆమెమీద నీలాపనిందలు వేసి నన్ను చిత్రహింసలు పెడుతున్నట్లయితే యిక దైవాన్నె మాత్రం ప్రార్థించమాక; పశ్చాత్తాపమంతా పారదోలెయ్యి; వొక ఘోరం తర్వాత మరొక ఘోరం చెయ్యి! దైవం దుఃఖించేపనులూ, మనుష్యులు కొయ్యబారిపోయే పనులూ చెయ్యి; యెందుకంటే అంతకంటే నువ్వు ఘోరదారుణ కృత్యం చెయ్యలేవు.

ఇవాగో : హారి భగవంతుడా! నన్ను క్షమించు! మీరు మనుష్యులేనా అసలు ? మీకు హృదయంగానీ జ్ఞానంగానీ వుందా ?— మిమ్మల్ని భగవంతుడు కాపాడుగాక! నాకీ వుద్యోగంవద్దు. ఓ దౌర్భాగ్యపు వెర్రివెధవా, ఇవాగో నీ నిజాయితీ తనం నీ నీచత్వంగా లోకానికి అగుపించేందుకు బతికావంటరా!! ఓపాపిష్టి లోకమా! గుర్తుంచుకో, ఓలోకమా, నిజాయితీగా నిష్కపటంగా బతకటం క్షేమంగాదని గుర్తుంచుకో! నాకు బుద్ధి వచ్చేట్లు చేసినందుకు మీకు అభివందనాలు. ప్రేమ అనేది పాపంగనక యికనుంచీ నేను యే మిత్రుణ్ణీ ప్రేమించను.

ఒథెల్లో : ఉహూం. చెప్పేదివిను. నువ్వు నిజాయితీగానే వుండాలి.

ఇవాగో : అలాకాదు, నేను వివేకంగలిగి వుండాలి. యెందుకంటే నిజాయితీ తనమనేది వట్టి వెర్రిది. అది మంచికిపోతే దానికి చెడు యెదురవ్వుతుంది.

ఒథెల్లో : ప్రమాణంచేసి చెబుతున్నా. వొకపక్కన ఆమె నిజాయితీ పరురాలనీ మరొకపక్కన కాదనీ, వొకపక్కన నువ్వు నమ్మకస్తుడివనీ మరొకపక్కన కాదనీ, యిలా నామనసు

వూగిసలాడుతూంది. నాకు రుజువు కావాలి. మల్లెపూవులాగా తెల్లగా స్వచ్ఛంగావుండే ఆమె పేరుకి మసిపూయబడి అది నా ముఖంలాగా నల్లగావుంది. వురితాళ్లూ, బాకులూ, విషమూ, నిప్పూ, నదులూవుండగా నేను ఆత్మహత్య చేసికొని చావ కుండా అదిచూస్తూ బతకలేను. నా అనుమానం నివర్తి అయితే యెంత బాగుంటుంది!

ఇవాగో : అయ్యా, అనుమానం మీగుండెను తినేస్తున్నది. దానికి కారకుణ్ణి నేను. అందుకు పశ్చాత్తాప పడుతున్నాను. మీరు అనుమానం నివర్తి చేసుకోగలరా మరి ?

ఒథెల్లో : "చేసుకోగలగట" మా ? ఉహూం. చేసుకొని తీర టానికి నిశ్చయంతో వున్నా.

ఇవాగో : చేసికో "వచ్చు" గూడాను. అయినా అదెలాగు ? యేలా నివర్తి చేసికొంటారు. ప్రభూ ? మీరు మొరటుగా నోరు తెరిచి చూస్తారా? ఆమెమీద వాడు పడుకోటాన్ని కళ్లతో చూస్తారా ?

ఒథెల్లో : నరకం! నరకం! హబ్బా!

ఇవాగో : వారిద్దరూ ఆ పనిచేస్తుండగా మనం చూడగలగటం అసాధ్యం. అంతతేలికగా దొరుకుతారా ? యేంచెయ్యాలిమరి ? యెలాగుమరి? యేం చెప్పమంటారు? యేం చెయ్యమంటారు? అనుమానం తీరేదెలా ? వాళ్ళు చిత్తకార్తెలో కుక్కల్లాగా వేడెక్కివున్నాగూడా వాళ్లు ఆ పనిలో వుండగా మీరు చూడటం సాధ్యం కానేకాదు. అయినప్పటికీ, ఆ రుజువుగాక. ఆ యథా ర్థాన్ని బైటపెట్టే బలమైన కారణాలేమైనా కావాలంటే మీకు చెబుతాను.



ఒథెల్లో : వట్టి గాలిమాటలు గాక కంటికి కనపడే సాక్ష్యం యేదైనా చూపెట్టు.

ఇవాగో : ఆపని నా కిష్టంలేదు. కానైతే, నా నిజాయితీతనం వల్లా నాకున్న ప్రేమచేతా వెర్రివాణ్ణయ్యి యీ బురదలంపటిలో దిగనే దిగాను గాబట్టి యిక ముందుకు పోకపత్వదు. ఇటీవలగా నేను కేషియోతో కలిసిపడుకొంటున్నా. నాకు పిప్పన్ను బాధ వొకటుండటంవల్ల దాంతో నాకు రాత్రిళ్లు సరిగా నిద్రపట్టటం లేదు. సరే. మనుష్యుల్లో గుండె నిబ్బరంలేని వాళ్లు కొంద రుంటారు. వాళ్లు నిద్రలో తమ స్వంతవిషయాల్ని గురించి కలవరిస్తుంటారు. అలాంటివాళ్లల్లో కేషియో వొకడు. నిద్రలో అతడు "ప్రియి డెస్‌డెమోనా, మనం చాలా మెళ కువగా వుండాలి. మన ప్రేమ కలాపం బైటికి పొక్కకుండా జాగర్త. పడదాం!" అని అనటం నేను విన్నాను. అలా అన్నాక అతడు నా చెయ్యి గట్టిగా పట్టుకొని, గుంజి, "ఓనా చిట్టీ!" అని అరిచి. నా పెదిమలమీద వెలుగుతూన్న ముద్దుల్ని కూకటివేళ్లతో సహా పెళ్లగించేసినట్లుగా నన్ను గట్టిగా ముద్దు పెట్టుకున్నాడు. తర్వాత తనకాలిని నా తొడమీదవేసి, నిట్టూర్చి' ముద్దు పెట్టుకొని, "పాడుదేముడు నిన్ను ఆ సిద్దీగాడికి అప్ప గించాడు!" అని అరిచాడు.

ఒథెల్లో : అబ్బా దారుణం, దారుణం !

ఇవాగో : యెబ్బే యిది కలసుమా.

ఒథెల్లో : అయినప్పటికే యిది అదివరకు నిజంగా జరిగిన పనిని తెలుపు తూంది. అది కలైనప్పటికే ఖచ్చితంగా అను మానించ దగిన విషయం.

ఇవాగో : తేలికగా వున్న యితర సాక్ష్యాన్ని యిది గట్టిగ బలపరచవచ్చు.

ఒథెల్లో : ఆమెను ముక్కముక్కలుగా చీల్చేస్తాను.

ఇవాగో : ఊహూం. అలాగాదు. కొంచెం వివేకంతో ప్రవర్తించండి. ఇంకా మనమేమీ కంటితో చూడలేదు గద. ఆమె యింకా యే పాపమూ యెరక్కపోయి వుండొచ్చు. చూడండి. వొక సంగతి చెప్పండి, అడుగుతాను : అల్లిక పని చేసిన చేరుమాల్ని మీరెప్పుడైనా మీ భార్య చేతిలో చూశారా ?

ఒథెల్లో : అలాంటి దాన్నొకదాన్ని నే నామెకు యిచ్చాను. అది ఆమెకు నేను మొదట్లో యిచ్చిన బహుమతి అది.

ఇవాగో : అది నాకు తెలువదుగాని, అలాంటి దాంతో వొక దాంతో కేషియో గడ్డం తుడుచు కొంటుండగా నేనుచూశా. అది మీ భార్యదని నాగట్టి నమ్మకం.

ఒథెల్లో : అదేగనక ఆ చేరుమాలైతే –

ఇవాగో : అదే గనక ఆ చేరుమాలైతే అది తక్కిన సాక్ష్యాలతో పాటు ఆమెకు వ్యతిరేకంగా సాక్ష్యం పలుకుతూంది.

ఒథెల్లో : హబ్బా, ఆ బానిస వెధవకి వొక్క ప్రాణంగాక నలభై వేల ప్రాణాలుంటే ! నాకసి తీర్చుకోటానికి వొక ప్రాణం చాలదు. యిప్పుడు నాకు యధార్థ మేమిటో బోధ పడుతున్నది. ఇటు చూడు, ఇవాగో, నాప్రేమనంతా గూడా అలా గాలికి యెగర గొట్టేశాను. అది యెగిరి పోయిందిలే, రాక్షసిపగా, లే, భూతపాతాళంనుండి లేచిరా ! ఓప్రేమా నీ కిరిటాన్ని కనకపు సింహాసనాన్ని క్రూరద్వేషానికి అప్పగించు ! హృదయమా, పొంగు, ద్వేషధారంతో ఉప్పొంగు !



ఇవాగో : అయినప్పటికీ మీరు శాంతించాలి.

ఒథెల్లో : హబ్బా, రక్తం ! రక్తం ! ! రక్తం ! ! !

ఇవాగో : వోర్పు చూపమన్నా. మీ మనసు మారవచ్చు.

ఒథెల్లో : కలలో గూడా మారదు, ఇవాగో. నల్ల సముద్రపు శీతల ప్రవాహం యెన్నడూ వెనక్కు మళ్ళక యెప్పుడూ మార్మోరా, బాస్ఫరసు సముద్రాల వైపు ఉత్తుంగ తరంగాల్తో ఉరికేట్లు నా ద్వేషం తన పగ సాధించే వరకూ యెన్నడూ వెనక్కు తగ్గదు, యెన్నడూ ప్రేమకు తలొగ్గదు. (మోకరిల్లి) యిప్పుడు దైవసాక్షిగా నేనొక పని శ్రపథం పూనుతున్నాను.

ఇవాగో : అప్పుడే లెగవమాకండి. (మోకరిల్లి) ఓ నిత్య ప్రకాశితన క్షేత్ర బృందాల్లారా, ఓ పంచభూతాల్లారా, ఇవాగో శపథం వినండి : అన్యాయం జరిగిన ఒథెల్లోగారి సేవకై నా సర్వస్వమూ ధారబోస్తానని ఇవాగో ప్రమాణం చేస్తున్నాడు. ఆయన ఆజ్ఞాపించితే చాలు యెటువంటి క్రూరకృత్యమైనా నిర్దయగా చేస్తాను. (వారు లేస్తారు)

ఒథెల్లో : నీ ప్రేమను వట్టి అభివందనాల్తోగాక హృదయ పూర్వకంగా స్వీకరించుతున్నా. నిన్నిప్పుడే ఆ పరిక్షకు నిలబెడుతున్నా. కేషియో మరణించాడనే వార్తను నువ్వు నాకు మూడు రోజుల్లోగా చెప్పాలి.

ఇవాగో : మీరంటే యిక నామిత్రుడు తప్పక మరణించినట్లే. మీరు కోరినట్లే ఆపని జరిగి తీరుతుంది. కాని ఆమెను బతక నివ్వండి.

ఒథెల్లో : దానికి యమనరకమే గతి. మదపులంజ ! దానికి యమనరకమే గతి ! రా, పోదాంపద, నేనుపోయి ఆ సుందర

పిశాచాన్ని త్వరగా మట్టు బెట్టే మార్గమేదో చూడాలి. ఇక నుండీ నువ్వు నా లెఫ్టినెంటువి.

ఇవాగో : సదా మీ సేవకుణ్ణి.

## నాలుగో రంగం : సైప్రసు : కోటముంగిట

(డెస్‌డెమోనా, ఎమీలియా, హాస్యగాడూ ప్రవేశం)

డెస్‌డెమోనా : యేమోయ్, లెఫ్టినెంటు కేషియోగారెక్కడ పండు కొంటాడో నీకు తెలుసా ?

హాస్యగాడు : ఆయన యే "పండు" యెక్కడ కొంటాడో నాకేం తెలుసు ?

డెస్‌డెమోనా : అదేమిటి ?

హాస్యగాడు : ఆయన సైనికుడు. మరి సైనికుడు చేసేది పైవాడు చెప్పేది వినటంగాని "పండు" కొనటం గాదు.

డెస్‌డెమోనా : హారి నీ దుంపదెగా ! పోనీ ఆయన బస యెక్కడుందో చెప్పగలవా ?

హాస్యగాడు : ఆయన బస యెక్కడుందో చెబితే నా మాటల్లో పస వుండదు.

డెస్‌డెమోనా : నీ మాటలకేమన్నా అర్థంవుందా ?

హాస్యగాడు : ఆయన బస యెక్కడో నాకు తెలవదు. అలాంటప్పుడు ఆయన బస యిక్కడో అక్కడో వుందని నేను చెబితే నామాటల్లో పస యేముంటుంది మరి ?



డెస్‌డెమోనా : అయితే మరి ఆయనెక్కడుంటాడో అడిగి తెలిసి కొంటావా ?

హాస్యగాడు : ఆయన కోసం యీ ప్రపంచాన్ని ప్రశ్నోత్తర క్రమబద్ధం చేస్తాను. అంటే ప్రశ్నలుచేసి ఆ ప్రశ్నలకు సమాధానాలు తయారు చేస్తాను.

డెస్‌డెమోనా : ఆయనెక్కడున్నాడో పోయి వెదుకు. యిక్కడికి రమ్మని చెప్పు. ఆయన విషయమై నా ప్రభువుకి నచ్చజెప్పాననీ అంతా చక్కగా జరిగి పోతుందనుకొంటున్నాననీ చెప్పు.

హాస్యగాడు : యింకా యిది చెయ్యటం తేలిక. అందుకని అది చేయటానికి ప్రయత్నంచేస్తా (నిష్క్రమణ)

డెస్‌డెమోనా : ఆ చేరుమాలు యెక్కడ పోయిందబ్బా ?

ఎమీలియా : నాకు తెలవదమ్మగారూ,

డెస్‌డెమోనా : నా మాటనమ్ము. బంగారపు నాణాలు నిండావున్న సంచిపోయినా నాకింత బాధవుండేదిగాదు. నా వీరసిద్దీ నిష్కపటి. ఆటాతూటా అనుమానపు మనిషిగాదు. అందువల్ల యిది తెలిస్తే ఆయనకు కష్టం గలుగుతుంది.

ఎమీలియా : అయితే ఆయన అనుమానస్తుడు గాదా ?

డెస్‌డెమోనా : యెవరు ? ఆయనా ? హూం. కలలో గూడా అలా అనుకోమాక.

(ఒథెల్లో ప్రవేశం)

ఎమీలియా : అదుగో చూడండి, ఆయనిటే వస్తున్నారు.

డెస్‌డెమోనా : కేషియోను తనవద్దకు పిలిచేవరకూ ఆయన్నిక నేను వదిలిపెట్టను — యెలావున్నారు ప్రభూ ?

ఒథెల్లో : బాగానేవున్నా (తనలో) అబ్బా, లోన వొకటి పెట్టు కొని పైకి యింకొకటి నటించటం యెంత కష్టం!—నువ్వెలా వున్నావు, డెస్‌డెమోనా ?

డెస్‌డెమోనా : బాగానేవున్నా, ప్రభూ.

ఒథెల్లో : నీ చెయ్యి యిలాయివ్వు. నీ చెయ్యి చెమ్మగావుంది.

డెస్‌డెమోనా : అదీ నాటివరకూ వయసునుగానీ, విచారాన్నిగాని యెరగదు.

ఒథెల్లో : ఇది సఫలతనీ వుదార హృదయాన్నీ తెలియజేస్తుంది. వేడి, వేడి, చెమ్మ! ఈ నీ హస్తం కట్టుబాటూ, ఉపవాసమూ, దైవప్రార్థనా, యింద్రియ నిగ్రహమూ, గాఢభక్తి అవుసరమని తెలుపుతూంది. యెందుకంటే మామూలుగా యెదురు తిరిగే స్వభావంగల చెమటగార్చే యువపిశాచం వుందిక్కడ. ఇది మంచిహస్తం. కపటంలేని హస్తం.

డెస్‌డెమోనా : అదినిజం. నా హృదయాన్ని మీ కర్పించిన హస్తం అదేమరి.

ఒథెల్లో : ఉదారబుద్ధి గల హస్తం : పూర్వకాలంలో హృదయాలు హస్తాల నిచ్చేవి. కాని యీ రోజుల్లో హస్తాల నిస్తాయి గాని హృదయాలను గాదు.

డెస్‌డెమోనా : నేనీ విషయం మాట్లాడలేను. మీ వాగ్దానం సంగతేమిటో చెప్పండి.

ఒథెల్లో : యే వాగ్దానం చిట్టీ ?

డెస్‌డెమోనా : కేషియోగార్ని మీ వద్దకొచ్చి మీతో మాట్లాడమని కబురంపాను.



ఒథెల్లో : నాకు బాగా జలుబు చేసింది. యేదీ. నీ చేరుమాలు యిలాయివ్వు.

డెస్‌డెమోనా : యిప్పుడా, ప్రభూ ?

ఒథెల్లో : నేను నీ కిచ్చిన చేరుమాలు.

డెస్‌డెమోనా : అదిప్పుడు నా దగ్గర లేదు.

ఒథెల్లో : లేదూ ?

డెస్‌డెమోనా : నిజంగా ప్రభూ.

ఒథెల్లో : అలా దగ్గర లేకుండా వుండటం తప్పు. ఆ చేరుమాల్ని వొక ఈజిప్టు వాడు మా అమ్మకిచ్చాడు. ఆమె మంత్రగత్తె. యితరుల మనసుల్లో యేముందో దాదాపు పూర్తిగా చెప్ప గల శక్తి ఆమెకుండేది. అది తన దగ్గరుంటే తనని మా నాన్న బాగా ప్రేమించేట్లు చేసి ఆయన ఆవిడ ప్రేమపాశాల్లో పూర్తిగాబందీ ఐపోయేట్లు చేయగలదని ఆవిడ నాతో చెప్పింది. ఇకను అది పోయినా, దానిని యితరులకు బహుమతిగా యిచ్చినా, మానాన్నకు ఆవిడంటే అసహ్యం గలిగి పక్కదోవలు తొక్క గలదని ఆవిడన్నది. తాను చనిపోయే ప్పుడు మా అమ్మ దానిని నాకు ఇచ్చి నేను పెళ్లి చేసికొన్న ప్పుడు నా భార్యకు యిమ్మని నాకు చెప్పింది. నేనలాగే చేశాను. దానిని భద్రంగాదాయి. నీ కంటిపాప లాగా చూసుకో. దాన్ని పోగొట్టుకొన్నా యెవరికన్నా యిచ్చినా యిక యెంత నష్టం కలుగుతుందో చెప్పటం కష్టం.

డెస్‌డెమోనా : నిజమేనా ?

ఒథెల్లో : నిజం రెండవంద లేళ్ల వయసుగల వొక సోదిమనిషి ఆ రుమాలును తయారు చేసింది. దానికి వుపయోగించిన పట్టు

యెంతో పవిత్రమైనట్టిది. దానికి పరమ పవిత్రమైన రంగు నీటితో రంగు వేయబడింది.

డెస్‌డెమోనా : ప్రమాణం ? నిజమేనా ?

ఒథెల్లో : పూర్తిగానిజం. కనక దాన్ని భద్రంగా చూసుకో.

డెస్‌డెమోనా : అలా అయితే దాన్ని నేను చూడకుండావుంటే యెంత బాగుండేది!

ఒథెల్లో : అరె! యెందుకని ?

డెస్‌డెమోనా : అలా అంత అధాటుగా అడుగుతున్నా రెందుకూ ?

ఒథెల్లో : అది పోయిందా ? అది పోయిందా ? చెప్పు, అది లేదాయిక ?

డెస్‌డెమోనా : మనల్ని భగవంతుడు ఆశీర్వదించుగాక

ఒథెల్లో : అలాగా ?

డెస్‌డెమోనా : అది పోలేదు. వొకవేళ పోతే ?

ఒథెల్లో : యెలాగు ?

డెస్‌డెమోనా : అది పోలేదన్నాగా.

ఒథెల్లో : తీసుకరా పోయి. నన్ను చూడనియ్యి !

డెస్‌డెమోనా : యేముందండీ, తేగలను, చూపగలను. కాని యిప్పుడు గాదు. నేను చెప్పేది వినకుండా తప్పుకోటానికి వేసిన యెత్తిది. నా ప్రార్థన విని కేషియోగార్ని తిరిగి తీసుకోండి.

ఒథెల్లో : ఆ చేరుమాల్ని యిక్కడికి తీసుకురా ! నాకు దిగులు గావుంది.

డెస్‌డెమోనా : అబ్బ, చాలెల్దూ ! అంతకంటే మీకు మంచివాడు దొరకడు.



ఒథెల్లో : చేరుమాలు !

డెస్‌డెమోనా : దయచేసి కేషియో గారి విషయం చెప్పండీ.

ఒథెల్లో : చేరుమాలు !

డెస్‌డెమోనా : ఆయన తనకాలాన్నంతా మీ సేవలో గడిపిన వాడు. మీ కష్టాల్లో భాగం పంచుకొన్నవాడు—

ఒథెల్లో : చేరుమాలు!

డెస్‌డెమోనా : మీరెందుకలా ప్రవర్తించాలో నాకర్థం గావటం లేదు.

ఒథెల్లో : పో! (నిష్క్రమణ)

ఎమీలియా : యీ మనిషికి అనుమానం లేదంటారా ?

డెస్‌డెమోనా : నేనింతకుముందెన్నడూ యిది చూడలేదు. నిజంగా ఆ చేరుమాల్లో యేదో మాయ వుందనుకొంటా. దాన్ని పోగొట్టాను, దౌర్భాగ్యవుదాన్ని.

ఎమీలియా : యెంతకాలమున్నా మగవాడి తరహా అర్థంగాదు. అసలు వాళ్లంటే వొకటే. వాళ్ల పొట్టలను కొంటే మనం ఆ పొట్టలకి భోజనం వాళ్లు మనల్ని ఆకలితో గబగబా తింటారు. యిక బాగా మొఖం మొత్తేదాకా తిన్నాక బైటికి కక్కేస్తారు.

(ఇవాగో కేషియోల ప్రవేశం)

అటు చూడండి—నా పెనిమిటీ, కేషియో!

ఇవాగో : మరో మార్గంలేదు. అది ఆమే చెయ్యాలి. అన్నట్టు అదృష్టవశాత్తూ ఆమె యిక్కడే వుంది! పోయి బతిమాలండి.

డెస్‌డెమోనా : యేమండీ కేషియోగారూ ? యేమిటి సంగతి ?

కేషియో : అదేనండీ. నామామూలు వ్యవహారమే. మీ మంచి తనం వల్ల నేను తిరిగీ కాలు నిలదొక్కుకొని వారి ప్రేమకు పాత్రుణ్ణయ్యేట్లు చెయ్యండని ప్రార్థిస్తున్నా. వారంటే నాకు హృదయ పూర్వకమైన ప్రేమవుంది. యికనేమాత్రం ఆలస్యం పనికిరాదు. నేను చేసిన తప్పుఅంత ఘోరమైనదైతే గతంలో నేను చేసిన సేవా, యిప్పుడు నేను అనుభవించుతూన్న మన స్తాపమూ, భవిష్యత్తు నావల్ల వుండబోయే ప్రయోజనమూ నన్ను దోషరాహిత్యంచేసి నేను తిరిగీ ఆయన ప్రేమకు పాత్రుణ్ణయ్యేట్లు చెయ్యలేవేమో తెలిసికోవటం నాకు తప్ప కుండా లాభకారి అనుకొంటున్నా. అందుకనే యిలా తొందర పడుతున్నాను. అది తేలిపోతే యిక నారాత యెలా వుందో అలా జరుగుతుంది.

డెస్‌డెమోనా : అయ్యోపాపం ! యేమనిచెప్పను కేషియోగారూ ? నేను మీ విషయం గురించి ఆయన్ని బతిమాలటానికి యిది తగిన సమయం గాదు. నా ప్రభువు నా ప్రభువుగాదు. ఆయన మనసులో మార్పు వచ్చినట్లు ముఖంలో మార్పు కనిపించు తున్నా గూడా నేను ఆయన్ని అర్థం చేసుకోలేను. మిమ్మల్ని గురించి నేను చెప్ప గలిగిదంతా చెప్పినందుకు ఆయన ఆగ్ర హానికి గురి అయ్యాను ! మీరు కొంతకాలం పాటు ఓర్పు వహించాలి. నేను మీకు చేయగలిగిన దంతా చేయటానికి సిద్ధంగా వున్నాను. నాకు నేను చేసుకోటానికి సాహసించంది గూడా మీకు చేయటానికి సిద్ధంగావున్నాను. నామాట నమ్మి వూరుకోండి.

ఇవాగో : ప్రభువు కోపంగా వున్నారా !



ఎమీలియా : యింతకుముందే యిక్కణ్ణుంచి వెళ్ళారు. నిజంగా ఆయన యేమిటో అదో తీరుగా వున్నారు.

ఇవాగో : ఆయనకు కోపంరాదే !? ఫిరంగిగుండ్లు వచ్చిపడి తన సైనికుల్ని తుంపులు తుంపులు జేసి తన ప్రక్కనున్న తమ్ముణ్ణి కింద పడిగొట్టి నప్పుడుగూడా ఆయనకు కోపం రావటం నేను చూడలేదు—అలాంటిది ఆయనకు కోపం వచ్చిందా ? అయితే యేదోవుంది యిందులో. నేను పోయి ఆయన్ని కలిసికొని మాట్లాడుతాను. ఆయనకు కోపం వచ్చిం దంటే యిందులో నిజంగా యేదోవుంది.

డెస్‌డెమోనా : పోయి మాట్లాడుబాబూ (ఇవాగో నిష్క్రమణ) ఏదో ప్రభుత్వం వ్యవహారంగావచ్చు. వెనిస్‌నుండి యేదైనా కబురొచ్చిందో లేక సైప్రసులో యేదైనా కుట్ర బయట బడిందోగాని ఆయన మనసు చెదిరినట్లుంది. అలాంటి సమయాల్లో మగవాళ్ల తమముందు గొప్ప కార్యభారం వున్నప్పటికీ స్వల్ప విషయాలమీద కీచులాడుకొంటారు. లోకంపోకడే అంత. యెందుకంటే మన వేలికి నొప్పిపెడితే తక్కిన అవయవాలకు గూడా ఆ బాధ తగులుతుంది. ఉహూఁ. మగవాళ్ళు దేవతలని మనం అనుకోరాదు. అంతేగాదు. వాళ్ల భార్యలపట్ల తమకుగల బాధ్యతను నెరవేర్చుతారని గూడా అనుకోరాదు. అబ్బా, నన్ను చీవాట్లుపెట్టు, ఎమీలియా, నా నోరు పడిపోను. ఆయిన్ని అసరానిమాట లన్నాను. ఆయన్ని అపార్థం చేసికొని అనవుసరంగా నిందించాను.

ఎమీలియా : అలా ఆయనకు కోపమొచ్చింది యేదో రాజ్యాంగ వ్యవహారం మూలాన్న గావాలనీ అంతేగానీ నీ మీద అను మానంతో కాగూడదనీ భగవంతుణ్ణి ప్రార్థించు.

డెస్‌డెమోనా : అయ్యో, యెంత దుర్దినమిది! నన్నుమానించ టానికి నేను చేసిన ద్రోహమేమీ లేదు.

ఎమీలియా : కాని అనుమానస్తులకి అది నచ్చదమ్మగారూ. వాళ్లు కారణముండి అనుమానించరు. యే కారణం లేక పోయినా అది వాళ్ళ తరహాగాబట్టి అనుమానిస్తారు. అది తనంతతాను బుట్టిన బ్రహ్మ రాక్షసి.

డెస్‌డెమోనా : ఆ బ్రహ్మరాక్షసి భగవంతుడు దయవల్ల ఒథెల్లో గార్కి దూరంగా వుండుగాక!

ఎమీలియా : తథాస్తు, అమ్మగారూ.

డెస్‌డెమోనా : నేనుపోయి ఆయనెక్కడున్నాడో చూస్తాను. కేషియోగారూ, మీరీ దరి దాపుల్లోనే వుండడి. ఆయన మనసు సరీగావుంటే మీ విషయం యెత్తి చేయ గలిగినదంతా చేస్తాను.

కేషియో : చిత్తం, అమ్మగారూ. (డెస్‌డెమోనా, ఎమీలియాల నిష్క్రమణ)

(బియాంకా ప్రవేశం)

బియాంకా : భగవానుడు రక్షించుగాక, కేషియో!

కేషియో : యేంపనిమీదా యిలా బైటి కొచ్చావ్? నిజం, చిట్టీ, నేనే మీయింటికి వద్దామనుకొన్నా.

బియాంకా : యికనేను నీ బసకుపోతూ యిలా వచ్చా, కేషియో. చూడండీ, వారం రోజుల పాటు కంటికి కనిపించకుండా వుంటారా? యేడు రాత్రుళ్ళూ యేడు పగళ్ళూనా? నూట అరవై యెనిమిది గంటల పాటా? హబ్బా, విరహతాపం



ఆ గంటలకంటే యెన్నిరెట్లు విసిగెత్తించుతుందో చూశారా? అబ్బా, వెధవ లెఖ్ఖలు!

కేషియో : క్షమించు, బియాంకా. యిప్పటి కిప్పుడు, యీ క్షణాన, నేనెంతో పని భారం మీదున్నాను. నాకు తీరినప్పుడు నువ్వు లెక్కగడు తూన్నరు. దాన్ని తప్పకుండా తీర్చుకొం టాను. చూడు చిట్టీ, (అంటూ డెస్‌డెమోనా యొక్క చేరు మాలు యిచ్చి) యీ అల్లిక పనిని వేరే రాసివుంచు.

బియాంకా : యెక్కడిదిది, కేషియో? యెవరో కొత్త సావాస గత్తె యిచ్చింది. అయితే నువ్వు యిన్నాళ్ళూ నాకు కనిపించ కుండా యిందుకన్న మాట!? ఆఖరికి యీస్థితి కొచ్చిందా మన వ్యవహారం? సరే, మంచిది.

కేషియో : ఛో, ఛో, ఆడదానా! నా పాడుపూహలు బొందలో తొక్కు. దీన్నియెవరో సావాసగత్తె యిచ్చిందని నీ అను మానం వొట్టు; అది నిజంగాదు, బియాంకా.

బియాంకా : అయితే మరి యెవరిది?

కేషియో : నాకు తెలవదు, చిట్టీ. నాకిది నా గదిలో దొరికింది. ఆ అల్లికపని చాలాబాగుంది. అది యెవరిదో వారు అడిగి తీసుకొనేముందు ఆ అల్లిక నమూనా తీసుకోటం మంచిది. అది పట్టుకెళ్లి నమూనా తియ్యి. యీ సారికి యికనన్ను వదిలిపెట్టు.

బియాంకా : వదిలిపెట్టటమా? యెందుకనీ?

కేషియో : నేను జనరల్ గారితో మాట్లాడ టానికి వచ్చా. నేను ఆడమనిషితో కలిసి వుండటాన్ని ఆయన చూడటం మంచిది గాదు. ఆయన చూడాలని నా కోరిక గూడా గాదు.

బియాంకా : యెందుకనంట ?

కేషియో : అంటే నిన్ను నేను ప్రేమించటం లేదని గాదు.

బియాంకా : నువ్వు నన్ను ప్రేమించటం లేదు ! నాతో కొంచెం అలారా. నువ్వీరాత్రి వస్తావా లేదా ?

కేషియో : రాలేను. యిక్కడ నాకు పనుంది. కాని త్వరలో నీ దగ్గిరకొస్తా.

బియాంకా : సరే. మంచిది, వీలులేక పోతే తప్పదుగద మరి.

(నిష్క్రమణ)

---

# నాలుగో అంకం

## మొదటి రంగం : సైప్రిసు : కోట ముంగిట

(ఒథెల్లో, ఇవాగోల ప్రవేశం)

ఇవాగో : మీరు ఆలాగే అనుకొంటారా?

ఒథెల్లో : అనుకోటమా. ఇవాగో?

ఇవాగో : యేమిటీ చాటున ముద్దెట్టుకోవటం?

ఒథెల్లో : అనుమతి లేని ముద్దు.

ఇవాగో : లేక తన మిత్రుడితో గలిసి ఆమె నగ్నంగా మంచం మీద గంటో అంతకన్నా యెక్కువ సేపో దురుద్దేశం యేమీ లేకుండా పడుకోవటం?

ఒథెల్లో : మంచంలో నగ్నంగా పడుకోవటం, దురుద్దేశ్యం లేకుండా వుండటమా, ఇవాగో? ఔను. పైకి చెడువుద్దేశ్యంగా యితరులకి కనిపించినా వారి లోపల మాత్రం మంచి వుద్దేశ్యమే వుంటుంది. అలా దురుద్దేశ్యమూ లేకుండా పడుకొన్న వారిని పాపిష్టి పిశాచం చెడు పనికి పురికొల్పుతుంది. కాని వారు భగవంతుణ్ణి ప్రార్థించి భగవంతుని సహాయం తెచ్చుకొంటారు.

ఇవాగో : అంటే వారేమి చెడుపని చేయరన్నమాట; అది క్షమించదగిందన్నమాట. కాని, నేను నా భార్యకు యేదన్నా చేరుమాలు యిస్తే—

ఒథెల్లో : యిస్తే యేమిటంట?

ఇవాగో : యేముందీ, అదిక ఆమెదే, ప్రభూ. దాన్నామె యే మగాడికైనా యివ్వవచ్చు ననుకొంటా.

ఒథెల్లో : అయితే అవ్వొచ్చుగాక. ఆమె ఆచేరుమాలుకి యజమానురాలే గాక, తన మానసంరక్షకురాలుగూడాను మరి తన మానాన్ని యితరులకు యివ్వవచ్చునా?

ఇవాగో : మానం అనేది కంటికగుపించని వస్తువు. చాలా తరచుగా అది అసమర్థుల వద్ద వుంటుంది. ఇక చేరుమాలు విషయం——

ఒథెల్లో : అబ్బ, నేను దాన్ని గురించి మరిచి పోతే నాకు చాలా సంతోషంగా వుండేది: అంటురోగం తగిలి మృత్యువు వాసన గొడుతూన్న యింటిమీద రాబందు తిరిగినట్లుగా యిప్పుడది నా మనసులో తిరుగుతూంది! వాడి వద్ద నాచేరుమాలుందని అన్నావుగదూ?

ఇవాగో : ఔను, అన్నాను. అంటే యేమిటంటారు?

ఒథెల్లో : అదిప్పుడేమంత మంచిదిగాదు.

ఇవాగో : వాడు మీకు అన్యాయం చేస్తుండగా నేను చూశానని అంటే మాత్రమేమిటి? లేక వాడు ఫలానా మాట అన్నాడని-యెందుకంటే అలాంటి మోసగాళ్లు లోకంలో వున్నారు వాళ్లు తమంత తాము స్త్రీని లొంగదీసో, లేక తామంటే పడిచచ్చే స్త్రీని చెడగొట్టో సంతృప్తిపరిచో యేదో వొకటి తప్పకుండా వాగుతారు——

ఒథెల్లో : వాడేమన్నా అన్నాడా?



ఇవాగో : అన్నాడు, ప్రభూ, కాని నా మాట గట్టిగా నమ్మండి. మళ్లీ వొట్టుపెట్టుకొని తాను అనలేదని అనందేదీ అతడు అనలేదు.

ఒథెల్లో : యింతకీ యేమన్నాడు?

ఇవాగో : నిజంగా అన్నాడు——యేమన్నాడో నాకు తెలవదు.

ఒథెల్లో : యేమిటీ? యేమిటీ?

ఇవాగో : పడుకొని——

ఒథెల్లో : ఆమెతోనా?

ఇవాగో : ఆమెతోనో, ఆమెమీదో, మీయిష్ట మెలా అనుకొంటే అలా.

ఒథెల్లో : ఆమెతో కలిసి పడుకోటమా? ఆమెమీద పడుకోటమా? ఆమెకు మోసం జేస్తే ఆమె మీద పడుకొన్నాడంటాం-ఆమెతో కలిసి పడుకోవటం! అది అసహ్యాకరం——చేరుమాలు——తప్పును వొప్పుకోటాలు – చేరుమాలు!– తప్పును వొప్పుకోటం తర్వాత తన శ్రమకి వురితీయబడటం – ముందు వురితీయబడి, తర్వాత తప్పు వొప్పుకోటం! దాన్ని తలుచుకొంటే వొళ్లు కంపించుతూంది. యేదో అపశకునం లేకపోతే నా మనస్సిలా చెదిరి పోదు. నాకు అలా వణుకు పుట్టించేది మాటలుగావు– ఛీ! ముక్కులూ, చెవులూ, పెదిములూనా? అది సంభవమేనా ?– తప్పు వొప్పుకోటమా?– చేరుమాలా?– ఓ పిశాచమా! (మూర్ఛపోతాడు)

ఇవాగో : పనిచెయ్యి, ఓ నా ఔషధమా. పనిచెయ్యి! సులభంగా నమ్మే పెర్రివెంగళప్పలు అలా చేజిక్కి పోతారు. యెంతో మంది మానధనులైనా పతివ్రతలపై అలా అపనిందలు వేయబడతాయి – అయ్యో! ప్రభూ, నా ప్రభూ! ఒథెల్లో గారూ!

(కేషియో ప్రవేశం)

యేమి సంగతులు, కేషియోగారూ?

కేషియో : యివేమిటి?

ఇవాగో : ప్రభువు మూర్ఛ పడిపోయాడు. ఈతెర వారికి రావటం రెండోసారి మొదటి తెర నిన్న వచ్చింది.

కేషియో : కణతలమీద చేతుల్తో రుద్దు.

ఇవాగో : వద్దు. ఆగు. అది దానంతటదె క్రమేణా తగ్గిపోవాలి. అలాగాకపోతే ఆయనకి నోటివెంట నురుగు వస్తుంది; ఆయినకి బాగా పిచ్చెత్తి పోతుంది. చూడు. కదులుతున్నాడు. మీరు కొంచెం చాటుకిపొండి. ఆయిన వెంటనే తెప్పరిల్లుతారు. ఆయన లేచివెళ్లి పోయినాక, నేను మీతో వొక ముఖ్య విషయం గురించి మాట్లాడాలి (కేషియో నిష్క్రమణ) యెలా వుంది, జనరల్‌గారూ? తలకి దెబ్బ తగల్లేదా?

ఒథెల్లో : పరిహాస మాడుతున్నావా?

ఇవాగో : నేను మిమ్మల్ని పరిహాసమాడటమా? అబ్బ, యెంత మాటన్నారు! మీరు పురుషుడిలాగా యిదంతా భరించాలని కోరుతున్నా!

ఒథెల్లో : రంకు పెళ్లాం మొగుడు వక్రజంతువుకింద లెఖ్ఖ.

ఇవాగో : అయితే లోకంలో చాలామంది జంతువులున్నారు.

ఒథెల్లో : వాడు తప్పు చేసినట్టు వొప్పుకొన్నాడా?

ఇవాగో : అయ్యా నా మాటవిని గుండెదిటవు పర్చుకోండి. పెళ్లైన ప్రతి మగవాడికీ యీ బాధవుంది. ప్రతిరాత్రీ పరుల మంచాలమీద పడుకొనే పెద్దమనుష్యులు లక్షలాదిగా



వున్నారు. మీ విషయం యింకా నయం. వొక విలాసగత్తెని ముద్దుపెట్టుకొని ఆమెతో గలిసిపడుకొని ఆమె పతివ్రత అనుకోటం, వక్రదయ్యపు తమాషా! ఉహూం. నన్ను తెలిసికోనివ్వండి. నన్ను నేను తెలిసికొన్నాక, ఆమె యెటువంటిది అవగలదో తెలిసికోగలను.

ఒథెల్లో : అబ్బా, నువ్వు యెంతో వివేకవంతుడివి! అది నిజం.

ఇవాగో : మీరు కొంచెం సేపు చాటున నిలబడండి వోర్పు జూపండి మీరు ఆవేదనతో యిక్కడపడి వున్న సమయంలో (అది అలాంటి మనిషికేమాత్రం తగిందిగాదు) కేషియో యిక్కడి కొచ్చాడు. అతణ్ణెలాగో మాయచేసి మీ మూర్ఛకేదో కారణం చెప్పి అవతలకు పంపేశాను. కొంచెం ఆగినాక మళ్లీ యిక్కడి కొచ్చి నాతో మాట్లాడమన్నాను. అతడు వస్తానన్నాడు. మీరు చాటున దాక్కొని అతడి ముఖకవళిక లన్నీ బాగా పరీక్షగా చూడండి. యెందుకంటే ఆ కథంతా అతడిచేత చెప్పిస్తాను—యెక్కడ, యెలా, యెన్ని సార్లు, యెంతకాలం కిందట, యెప్పుడు, మీ భార్యతో కలిశాడో, మళ్లా యెప్పుడు కలుస్తాడో అదంతా చెప్పేట్లు చేస్తా. అతడి ప్రవర్తన యెలా వుంటుందో చూడటం మరవమాకండి. వోర్పు జూపండి! లేకపోతే మీరు నిగ్రహం లేకుండా పూర్తిగా ఆగ్రహానికి లొంగిపోయారంటాను.

ఒథెల్లో : నేను చెబుతూన్నది వినపడుతూందా, ఇవాగో? యెంతో చాకచక్యంతో వోర్పు చూపుతాను. చూడుమరి. కాని (వింటున్నావా?) యెంతో ద్వేషంతో సుమా!

ఇవాగో : అదేమితప్పు గాదు. ఐనా జాగర్తగా ఆలోచించి నడుచుకోండి సుమా. వెళ్తారాయిక? (ఒథెల్లోచాటున దాక్కొం

టాడు) ఇప్పుడు నేను బియాంకాను గురించి కేషియో నడుగుతా, అది తిండికీ బట్టకీ దేహమమ్ముకొని బతికే గయ్యాళి మనిషి అది కేషియో అంటే పడి చస్తుంది. చాలామందిని మోసగించియే ఒక్కడి చేతనో మోసగించబడటం వేశ్యలకు అలవాటే. దాని సంగతి యెత్తితేవాడు పగలబడి నవ్వకుండా వుండలేదు. ఇడుగో రానే వస్తున్నాడు. (కేషియో ప్రవేశం) వాడు నవ్వుతూంటే, ఒథెల్లోకి వేడెక్కుతుంది. అసలు యథార్థమేమిటో తెలీదు గనక పాపం కేషియో చిరునవ్వులూ, చేతులూ గీతులూ ఆవీ తిప్పటాలూ, తేలిక ప్రవర్తనా చూసి ఒథెల్లో అనుమానిస్తాడు. యేమిటిసంగతులు, లెఫ్టినెంటు గారూ?

కేషియో : ఆ బిరుదులేక నేను చచ్చిపోతూంటే అది మీరు నా కివ్వటం పుండు మీద కారంలాగా వుంది.

ఇవాగో : డెస్‌డెమోనా గారి వెంట బాగా పడండి. ఆ పని మీకు ఐ తీరుతుంది. చూడండి, యీ పని బియాంకా చేతుల్లో వుంటే యెంత తేలిగ్గా అయిపోయేదీ!

కేషియో : పాపం, పిచ్చిముండ!

ఒథెల్లో : అప్పుడే నవ్వుతున్నాడు!

ఇవాగో : ఆడది మగాణ్ణి అంతగా ప్రేమించటం నేనింతకు ముందు చూడనే లేదు సుమా.

కేషియో : పాపం, వెర్రిముండ! నిజంగా ఆమె నన్నెంతో ప్రేమిస్తుందనుకొంటున్నా.

ఒథెల్లో : యిప్పుడు మెల్లగా అది కాదంటూ నవ్వి పారేస్తున్నాడు.

కేషియో : విన్నారా, కేషియోగారూ?



ఒథెల్లో : అదంతా మళ్లా చెప్పమని అతడు బతిమాలుతున్నాడు. అదీ దెబ్బ! బాగా అన్నావ్, బాగాఅన్నావ్‌పో!

ఇవాగో : మీరు పెళ్లిచేసుకొంటారని అంటున్నది. మీరు చేసుకోవాలను కొంటున్నారా?

కేషియో : హీ - హీ - హీ!

ఒథెల్లో : అంత యెగిరిపడుతున్నావురా అంత యెగిరిపడుతున్నావా?

కేషియో : నేను ఆమెని పెళ్లి చేసుకోటమా? వాక వేశ్యనా కొంచెం నాకు బుర్ర వుందనుకోండి. అంత పిచ్చివాణ్ణం గాదులే. హీ - హీ - హీ!

ఒథెల్లో ! సరే, సరే, సరే, సరే! గెలిచేవాడు నవ్వుతాడు!

ఇవాగో ! లోకులనుకోటమేమిటంటే మీరామెని పెళ్లి చేసుకొంటారని.

కేషియో : దయచేసి నిజం చెప్పండి.

ఇవాగో : అబద్ధం చెపితే వట్టి నీచుణ్ణనుకోండి.

ఒథెల్లో : నన్నోడగొట్టవా? సరే.

కేషియో : యిదంతా వెర్రివూహ. తన ప్రేమనీ, తాను చేసే పొగడ్తల్నీ చూసి నేను తనని పెళ్లి చేసుకొంటానని ఆమె అనుకొంటున్నది. అంతేగాని నేను చేసుకొంటానని ఆమెకి వాగ్దానం యివ్వలేదు.

ఒథెల్లో : ఇవాగో నాకు సైగ చేస్తున్నాడు. వాడు యిప్పుడు కథ మొదలెట్టుతున్నాడు.

కేషియో : యింతకుముందే ఆమె యిక్కడికొచ్చింది. నే నెక్కడి కెళ్తే అక్కడ తయారౌతూంది. మొన్న సముద్రపుటొడ్డున

నేను కొంతమంది వెనిస్‌వాళ్ళతో మాట్లాడుతుంటే యీబొమ్మ అక్కడి కొచ్చింది. నా మెడను యిలా వాటేసుకొని—

ఒథెల్లో : "నా ప్రియకేషియో!" అని యేడ్చినట్లు. వాడు చేతులు తిప్పటం చూస్తే అదీ అర్థం వస్తుంది.

కేషియో : యిలా వేలాడింది. యిలా వూగులాడింది. నా మీద పడి యేడ్చింది. యిలా నన్ను గుంజింది. హీ - హీ - హీ!

ఒథెల్లో : నా గదికి ఆమె వాణ్ణెలా లాక్కెళ్ళిందీ వాడు వర్ణించుతున్నాడు. ఆరే నీ ముఖం కనపడుతూందిరా. కాని ఆ ముఖాన్ని యే కత్తితో చీరాలో తోచకుండా వుంది.

కేషియో : సరే ఆమెని వదిలేసెయ్యాలి.

(బియాంకా ప్రవేశం)

ఇవాగో : నా ముందు! అదుగో చూడండి. ఆమె రానే వస్తున్నది.

కెషియో : అది ఫక్తు అడివిపిల్లి! నిజం! కంత్రీ. యిలా నా వెంట బడి పీడించటంలో నీవుద్దేశ్యమేంటి?

బియాంకా : యెవరు నీ వెంటబడేది? దయ్యమూ భూతమూ నీ వెంట బడాలి! నాకా చేరుమాలు యివ్వటంలో నీ అర్థమేంటి? వెర్రిముండనై అది తీసుకొన్నాను. దాని నమూనా తియ్యాలా? భలే ఫసందుగా వుంది, అది నీ గదిలో నీకు దొరకటమూ దాన్నెక్కడ యెవరు పడేసిందీ తెలవకపోటమూ, భలే ఫసందుగావుంది! యిదే గయ్యాళికుంకో నీ కిచ్చింది. దీని నమూనా నేను తియ్యాలీ? హుఁ. యిదుగో! ఆ నీ సవారీ గుర్రాన్ని విటో దాని కిచ్చుకో. అదెక్కడిదైనాసరే, నేను మాత్రం ఆ నమూనా తియ్యనే తియ్యను.



కేషియో : అదేమిటి, నా చిట్టి బియాంకా? అదేమిటి? అదేమిటి?

ఒథెల్లో : అది తప్పకుండా నా చేరుమాలే అయ్యుండాలి!

బియాంకో : వస్తావా యీ రాత్రికి భోజనానికిరా; లేదా యిక రానే రామాక! (నిష్క్రమణ)

ఇవాగో : ఆమె వెంట పొండి, వెంటపొండి!

కేషియో : ఔను. పోవాలి. లేక పోతే బజార్లో నన్ను గురించి వుతికి వుతికి వదిలి పెడుతుంది.

ఇవాగో : రాత్రికి అక్కడ భోంచేస్తారా మీరు?

కేషియో : ఆఁ అక్కడే భోంచెయ్యాలనుకొంటున్నా.

ఇవాగో : అయితే నరే నేను మిమ్మల్ని అక్కడ కలిసికోవచ్చు. నేను మీతో వొకటి మాట్లాడటా అని యెంతో ఆ దుర్దాగా వుంది.

కేషియో : తప్పకుండారండి వస్తారా?

ఇవాగో : ఓ యికనేం చెప్పొద్దు. (కేషియో నిష్క్రమణ)

ఒథెల్లో : (ముందుకు వస్తాడు) వాణ్ణి యేవిధంగా చంపితే మంచిది, ఇవాగో?

ఇవాగో : తాను చేసే చెడుపనికి సిగ్గులేకుండా యెలా నవ్వాడో చూశారా?

ఒథెల్లో : అబ్బా, ఇవాగో!

ఇవాగో : ఆ చేరుమాల్ని చూశారా?

ఒథెల్లో : అది నాదేనా?

ఇవాగో : ఖచ్చితంగా మీది! పాపం ఆ వెర్రిమనిషైన మీ భార్య అతడు యిచ్చే విలువ అదీ! దాని నామె అతడికిచ్చింది. అతడేమో దాన్ని తన రంకులాడి కిచ్చాడు.

ఒథెల్లో : వాణ్ణి వొక్కసారిగా చంపగూడదు; తొమ్మిదేళ్ల పాటు కాస్త కాస్త చంపాలి!— చక్కని ఆడది! సుందరీమణి! సుకుమారి!

ఇవాగో : అబ్బ, అదంతా మీరు మరిచి పోవాలండీ.

ఒథెల్లో : ఔను. అదికుళ్లి గబ్బుకంపు కొట్టి యీ రాత్రికి నరకాన పడిపోనియ్యి. యీ రాత్రికి అది బతికుండరాదు. ఉహూఁ. నా గుండె రాయైపోయింది; దాన్ని కొడుతూంటే నా చెయ్యి నెప్పిపెడుతూంది. అబ్బా యీ ప్రపంచంలో అంత కంటే మధురమూర్తి లేదు! మహారాణి అయ్యి మహారాజుల ముక్కుకు తాడుబోసి ఆడించగల శక్తిగలది.

ఇవాగో : మిమ్మల్ని మీరు మరిచి పోతున్నారు.

ఒథెల్లో : దాన్ని నశించనియ్యి! అదియెలాంటిదో మాత్రమే నేను చెబుతున్నా. యెంత సున్నితంగలదమని! చక్కని పాటగత్తె! రాళ్లు కరిగి పోయేట్లు పాడగలదు! యెంతో కల్పనా శక్తి గలది!

ఇవాగో : అవన్నీ వుండబట్టే యింత ఛండాలంగా తయారైంది మరి.

ఒథెల్లో : ఔను లక్షరెట్లు! ఐనా యెంతో సాధుగుణం గలది!

ఇవాగో : ఔను. చాలా సాధుగుణం.

ఒథెల్లో : ఆ విషయాన్ని కాదనటానికి వీల్లేదు. ఆది స్పష్టం, కాని, యెంతఘోరం, ఇవాగో!

ఇవాగో : ఆమె చేసే పాపాలు మీకు ముద్దూ ముచ్చటగా వుంటే అవి చేయటానికి ఆమెకి స్వేచ్ఛ యివ్వండి యెందుకంటె దాన్ని గురించి మీకేబాధ లేకపోతే మరెవడికేం పట్టింది?



ఒథెల్లో : దాన్ని ముక్కలు ముక్కలుగా నరుకుతా! నా చాటున లంజరికం చెయ్యటమా!

ఇవాగో : అబ్బా అది నీచం!

ఒథెల్లో : నా కింది వుద్యోగితో.

ఇవాగో : అదింకా నీచం.

ఒథెల్లో : ఇవాగో, యీ రాత్రికి నాకు యేదైనా విషం తెచ్చి యివ్వు. నేను దాన్ని ఆ పని మానుకోమని వాదించను. యెందుకంటే మాట్లాడితేదాని తీరూ సౌరూ అందమూ చందమూ చూసి మళ్లీ నా మనసు మారిపోతుంది. ఈ రాత్రే. ఇవాగో!

ఇవాగో : విషం పెట్టమాకండి. ఆమె యే మంచంలో ఆ లుచ్ఛా పని చేసిందో ఆ మంచంలోనే ఆమెని గొంతు పిసికి చంపండి.

ఒథెల్లో : అది బాగుంది, బాగుంది! అదే తగిన శిక్ష. చాలా బాగుంది!

ఇవాగో : ఇక కేషియో విషయం నాకు వదిలిపెట్టండి. యీ రాత్రే మీరు ఆ శుభవార్త వింటారు.

ఒథెల్లో : చాలా బాగుంది! (వొక బాకాధ్వని) ఆ బాకా యెక్కడిది?

ఇవాగో : తప్పకుండా వెనిస్ నుండే యెవరో వచ్చి వుండొచ్చు.

(లోడొవికో, డెస్‌డెమోనా, పరిచారకులూ ప్రవేశం)

ఆ వచ్చింది లోడొవికో అండీ. డ్యూకుగారివద్ద నుండి వచ్చారు. అదుగో చూడండి. మీ భార్యగూడా వారితో కలిసి వస్తూంది.

లోడొవికో : భగవానుడు మిమ్మల్ని రక్షించుగాక, జనరల్‌గారూ!

ఒథెల్లో : కృతజ్ఞుణ్ణి.

లోడొవికో : డ్యూకుగారూ, సెనేట్ సభ్యులూ మీకు వందనాలు చెబుతున్నారు (వొక జాబు యిస్తాడు)

ఒథెల్లో : వారికి సదా కృతజ్ఞుణ్ణి (జాబు విప్పి చదువుతాడు)

డెస్‌డెమోనా : విశేషా లేమిటండీ, లోడొవికో గారూ?

ఇవాగో : మిమ్మల్ని చూసి నాకెంతో సంతోషంగా వుందండీ. సైప్రసుకు మిమ్మల్ని ఆహ్వానిస్తున్నా.

లోడొవికో : అందుకు అభివందనాలు. లెఫ్టినెంటు కేషియో గారెలా వున్నారు?

ఇవాగో : బ్రతికే వున్నారండీ!

డెస్‌డెమోనా : వారికీ మా వారికీ మధ్య యేదో కొంత పొరపొచ్చెం వచ్చిందండీ కాని దాన్నంతా మీరు సరిచెయ్యాలి.

ఒథెల్లో : అని నీకు గట్టినమ్మకముందా?

డెస్‌డెమోనా : ప్రభూ?

ఒథెల్లో : (చదువుతాడు) "ఈ పనిని మీరు తప్పకుండగ చేయవలెను."—

లోడొవికో : వారు పిలవలేదు. ఆ జాబు చదవటంలో నిమగ్నమై వున్నారు. మీ భర్తగారికీ కేషియోకీ మధ్య యేమన్నా భేదాభిప్రాయం వుందా?

డెస్‌డెమోనా : ఔను అది సరిజెయ్యటానికి యేంచెయ్యమన్నా చేస్తాను. యెందుకంటే కేషియో అంటే నాకు అంత ప్రేమ.

ఒథెల్లో : నరకం, నరకం!



డెస్‌డెమోనా : ప్రభూ?

ఒథెల్లో : నీకు జ్ఞానముందా?

డెస్‌డెమోనా : యేమిటి, వారికి కోపమొచ్చిందా?

లోడొవికో : ఆ జాబు ఆయనకు కోపం తెప్పించి వుండొచ్చు. యెందుకంటే ఆయన స్థానంలో యిక్కడ కేషియోని నియమించి ఆయన్ని యింటికి రమ్మని రాశారనుకొంటాను.

డెస్‌డెమోనా : అందుకు నిజంగా నాకెంతో సంతోషంగా వుంది.

ఒథెల్లో : నిజంగానా?

డెస్‌డెమోనా : ప్రభూ?

ఒథెల్లో : నీ పిచ్చెక్కినందుకు నాకు సంతోషంగావుంది.

డెస్‌డెమోనా : యెందుకనండీ?

ఒథెల్లో : పిశాచం! (ఆమె నొక దెబ్బ వేస్తాడు.)

డెస్‌డెమోనా : యిందుకు నేనేం పాపం చేశాను!?

లోడొవికో : ప్రభూ, యిది నా కంటితో నేను చూశానని ప్రమాణం చేసి చెప్పినా వెనిస్ నగరంలో నామాట నమ్మరు.. అది చాలా తప్పు. ఆమెను వోదార్చండి. యేడుస్తూంది.

ఒథెల్లో : అబ్బ, పిశాచం, పిశాచం! ఆడదాని కంటినుండి రాలిన ప్రతి కన్నీటి బొట్టు ప్రాణం పోసేశక్తి భూమికుంటే ప్రతి కన్నీటిబొట్టు వొక మొసలిగా పుడుతుంది. పో, నా ముందర నుంచోమాక!

డెస్‌డెమోనా : మిమ్మల్ని నొప్పించేందుకు నేనిక్కడుండనులే. (పోతూవుంటుంది)

లోడొవికో : నిజంగా యెంతో విధేయురాలు పాపం, దయయుంచి ఆమెను వెనక్కు పిలవండి.

ఒథెల్లో : గృహిణీ!

డెస్‌డెమోనా : ప్రభూ?

ఒథెల్లో : ఆమెతో మీకేంపనండీ?

లోడొవికో : యెవరు? నేనా, ప్రభూ?

ఒథెల్లో : ఔను. మీరామెను వెనక్కు పిలవమన్నారు. ఆమె వెనక్కు యెంతైనా తిరగ్గలదు. తిరుగుతూనే ముందుకు పోగలదు. తిరిగీ వెనక్కు తిరగ్గలదు. అంతేగాదు. ఆమె యేడవగలదండీ, యేడవగలదు గూడాను. అంతేగాక విధేయురాలు. మీరన్నట్లు విధేయురాలు, చాలావిధేయురాలు—ఊఁ, నువు కార్చే కన్నీరు కారుస్తూనేవుండూ—అయ్యో, యిక యీ విషయమేమంటే (అబ్బ, యెంత నాటకం!) నన్ను యింటికి రమ్మన్నారండి—వెళ్లిపో. మళ్లీ యిప్పుడే నీ కోసం కబురంపుతా — అయ్యో, ఆ ఆజ్ఞను పాటించి నేను వెనిస్‌కు వెళ్తాను.—ఛీ, పో. (డెస్‌డెమోనా నిష్క్రమణ) నా స్థానంలో కేషియోగారు పని చేస్తారు. అదిన్నూ; అయ్యో, యీ రాత్రికి మీరు మాతోకలిసి భోంచెయ్యాలని కోరుతున్నాను. సైప్రసు లోకి మీకు స్వాగతం యిస్తున్నా — గాడిదగుడ్డు! (నిష్క్రమణ)

లోడొవికో : మన సెనేట్ సభ్యులంతా సర్వసమర్థుడని పిలిచిన వీరసిద్ధి వీరేనా? యేదీ కనికారం కలిగించలేని మనిషి వీరేనా? దేనికి లొంగని ధీరులు వీరేనా?

ఇవాగో : వారు చాలా మారిపోయారండీ.

లోడొవికో : వారి మతి సరిగా వుందా? మతిచెడిపోలేదా?



ఇవాగో : అదేమోగాని, వున్నవిషయం మాత్రం అదీ. నేనేమీ తీర్పు యివ్వలేను. యికను ఆయనేమవుతాడో అది కాకుండా వుండాలని భగవంతుణ్ణి ప్రార్థిస్తాను!

లోడొవికో : యేమిటీ, భార్యను కొట్టడమా?

ఇవాగో : నిజం, అదేమంత బాగాలేదు. ఐనా ఆ దెబ్బకు తగిన ఫలితం ఆయన అనుభవించాలని నా కోరిక!

లోడొవికో : అలా కొట్టడం వారికి మామూలేనా? లేక జాబు చదువుకొని రెచ్చి పోయి యిలా చేశారా?

ఇవాగో : అయ్యో, అయ్యో! నాకు తెలిసింది నేను చూసింది చెప్పటం న్యాయంగాదు. మీరు ఆయన్ని పరిశీలన చూడండి. ఇక నేను చెప్పకుండానే ఆయన నడతే మీకన్ని చెబుతుంది. ఆయన వెంటవెళ్లి ఆయినేం చేస్తాడో చూడండి.

లోడొవికో : ఆయన మంచి వాడను కొన్నందుకూ, ఆఖరి కిలా అయినందుకూ నాకు విచారంగావుంది. (నిష్క్రమణ)

## రెండవ రంగం : సైప్రసు : కోటలోపల

(ఒథెల్లో ఎమీలియాల ప్రవేశం)

ఒథెల్లో : అయితే నువ్వేమీ చూడ లేదన్నమాట?

ఎమీలియా : వినను గూడా వినలేదు. యెన్నడూ అనుమానించను గూడా లేదు.

ఒథెల్లో : లేదు. ఆమే కేషియో యిద్దరూ కలిసుండగా నువ్వు చూశావు.

ఎమీలియా : అయితే అందులో నా కేమీ తప్పు కనిపించలేదు. అంతేగాక, వారిద్దరూ మాట్లాడుకొన్న ప్రతిమాటనూ నేను విన్నాను.

ఒథెల్లో : అయితే వాళ్లెప్పుడూ గుసగుసలాడుకోలేదా?

ఎమీలియా : యెప్పుడు లేదు ప్రభూ,

ఒథెల్లో : తాము మాట్లాడుకొనేప్పుడు నిన్ను దూరంగా పొమ్మని పంపలేదా?

ఎమీలియా : యెప్పుడూ లేదు.

ఒథెల్లో : ఆమె తన విసనకర్రినో, చేతితొడుగుల్నో, మేలి ముసుగునో, మరింకాదేన్నో వొకదాన్ని తెమ్మని నిన్ను పంపలేదా?

ఎమీలియా : యెప్పుడూ లేదూ ప్రభూ.

ఒథెల్లో : యిది వింతగా వుంది.

ఎమీలియా : ప్రభూ, ఆమె నిజాయితీ పరురాలని నేను ధైర్యంతో పందెంగట్టి చెబుతాను. యేవొట్టు బడితే ఆ వొట్టు వేసుకొని చెబుతాను. మీకేమన్నా మనసులో అనుమానం కలిగితే అది తీసేసుకోండి. యెందుకంటే మీకు మీరే అనవుసరంగా అన్యాయం చేసుకొంటున్నారు. యే నీచుడన్నా మీకీ అనుమానం కలిగించితే వాడితల సహస్ర వక్కలుగా పగిలిపోతుంది! ఆమే గనక నిజాయితీపరురాలూ, నిర్దోషి, సత్యవంతురాలూ గాక పోతే యిక యెవరూ పతివ్రతలు లేనట్టే అతిపవిత్రమైన యే ఆడదీ ఆమె కాలిగోటికి గూడా పనికిరాదు.

ఒథెల్లో : ఆమె నిక్కడికి రమ్మని చెప్పు పో. (ఎమీలియా నిష్క్రమణ) తగినట్లుగానే చెప్పింది. యే కుంటెనగత్తె



అయినా ఆ మాత్రం చెప్పగలదు. ఇది నేర్పుగల రంకులాడి. రహస్యాల్ని తాళంవేసి బిడాయించినట్లు బిడాయించగలదు. ఐనా మోకరిల్లి భగవంతుణ్ణి ప్రార్థిస్తుంది. నేనది చేయటం చూశాను.

(డెస్‌డెమోనా, ఎమీలియాల ప్రవేశం)

డెస్‌డెమోనా : యేమి శెలవు, ప్రభూ?

ఒథెల్లో : ఇలారా, చిట్టీ

డెస్‌డెమోనా : యేం పని చెయ్యమంటారు?

ఒథెల్లో : నీ కళ్లను చూడనివ్వు. నా ముఖంలోకి చూడు.

డెస్‌డెమోనా : ఇదేమి వెర్రి భ్రమండీ?

ఒథెల్లో : (ఎమిలియాతో) యిక నీ పని నువ్వు చూడు. మమ్మల్ని వొంటరిగా వుండనివ్వు. తలుపుమూసెయ్యి. యెవరన్నావస్తే దగ్గనన్నాదగ్గు లేదా హుం అని అను. నీ పని, నీ పని! నీ పని నువ్వు చూడుమరీ! (ఎమీలియా నిష్క్రమణ)

డెస్‌డెమోనా : మోకరిల్లి ప్రార్థిస్తున్నా మీ మాటల కర్థమేమిటో చెప్పండి. మీ మాటల్లోని కోపం అర్థమవుతూంది గాని మీ మాటలు అర్థం గావటంలేదు.

ఒథెల్లో : యేముందీ, నువ్వెవరవు?

డెస్‌డెమోనా : నీ భార్యను, ప్రభూ. మీ నిజమైన విశ్వాసపాత్రురాలైన భార్యను!

ఒథెల్లో : అయితే అలాగని ప్రమాణం చెయ్యి. చేసి అధోగతినిపడు లేకపోతే నువ్వు దేవకన్యలాగా అగుపించితే పిశాచాలు నిన్ను పట్టి పీకలేవు. అందుకని రెండుసార్లు ప్రమాణం చేసి రెండు

రెట్లు అధోగతినిపడు నువ్వు నిజాయితీపరురాల్నని ప్రమాణం చెయ్యి.

డెస్‌డెమోనా : అందుకు ఆ భగవంతుడే సాక్ష్యం.

ఒథెల్లో : ఔను భగవంతుడికి తెలుసు నువ్వు ద్రోహంచేశావని

డెస్‌డెమోనా : యెవరికి ప్రభూ? యెవరితో? నేనెలా ద్రోహం చేశాను?

ఒథెల్లో : ఔను! పో! పో! పో!

డెస్‌డెమోనా : అయ్యో యెంతటి దుర్దినంయిది! మీరు యెందుకు యేడుస్తున్నారు? యీ కన్నీళ్లకు కారణం నేనేనా, ప్రభూ? మిమ్మల్ని వెనక్కి పిలిపించటానికి నా తండ్రి కారకుడని మీరు అనుమానించితే ఆ తప్పు నా మీద వెయ్యమాకండి. మీ కాయన విరోధైతే నాకూ విరోధే.

ఒథెల్లో : నా హృదయాన్ని రంపకోతబెట్టి పరీక్షించాలని భగవంతుడు ముచ్చటపడ్డాడా? అన్ని రకాల వ్రణాల్నీ, అపకీర్తుల్నీ నా తలమీద వర్షించినా, గొంతుల మట్టుకు నన్ను బీదరికపు రొంపటిలోదింపినా, నన్నూ నా ఆశల్నీ బందీ చేసి కింద మీద చేసినా నా హృదయంలో యేదో వొక మూల రవ్వంత వోర్పు వుండేది. కాని, చరిత్ర ఛీత్కారానికీ అపహాస్యానికి నన్ను గురిచేయటమా!? ఐనా దాన్ని గూడా సహించగల్గుదును. మంచిది, చాలా మంచిది. కాని నా హృదయమంతా యెక్కడుందో, యెక్కడ నేను మనటమో మరణించటమో జరగాలో, యేదినా ప్రాణాధారమో, ఆక్కడినుండి నేను గెంటివేయ బడటమో లేక అది మురికి గుంటై పురుగులు లుకలుకలాడటమోనా? యింకా వోర్పు యెలా



వుంటుంది? భూత ప్రేత పిశాచాల ధ్వనితో ద్వేషం భగ్గుమనకుండా యెలా వుంటుంది?

డెస్‌డెమోనా : నేను నిజాయితీపరురాల్నని నా ప్రభువు అనుకుంటున్నాడని ఆశించుతున్నాను.

ఒథెల్లో : ఔనౌను. వూసరవెల్లిలాగా నిజాయితీ పరురాలివి తెల్లగా మనోహరంగా, మధురంగా వున్నవో పనికి మాలిన పాపిష్టి దానా, నువ్వు పుట్టకుండా వుంటే యెంతోబాగుండేది!

డెస్‌డెమోనా : అయ్యో, నాకు తెలవకుండా నేనేం నేరం చేశానండీ.

ఒథెల్లో : యీ తెల్లకాగితం మీద, యీ అత్యుత్తమ గ్రంథంలో "రంకులాడి" అనేమాట రాయటానికీ ఆ గ్రంథం తయారు చేయబడిందా? చేసిందేమిటంటావా? చేసిందా? ఓ బజారు లంజా! నువ్వు చేసిన పనుల్ని గురించి చెప్పాలంటే నేను సిగ్గులేని శిఖండినిగావాలి. చేసిందేమిటంటావా? ఆ గబ్బు కంపుకి ముక్కులు మూసుకొని పోతున్నాయి; చంద్రుడు తల వంచుకొంటున్నాడు; ఉచ్చనీచాలను ముద్దాడే గాలి గూడా భూగర్భంలో మెదలకుండా దాక్కొంటున్నది, అది విన లేక కనలేక, చేసిందేమిటంటావా? సిగ్గెగ్గులు లేని లంజా!

డెస్‌డెమోనా : మీరు నాకు అన్యాయం చేస్తున్నారు!

ఒథెల్లో : నువ్వు లంజెవుగదా?

డెస్‌డెమోనా : యెంతమాత్రమూగాదు! యీ దేహం మలినం కాకుండా నా ప్రభువు కోసం అట్టి పెట్టటం లంజరికమైతే దప్ప నేను లంజనుగాదు!

ఒథెల్లో : యేమిటీ? రంకులాడివి గాదూ?

డెస్‌డెమోనా : కాదు దైవసాక్షిగా కాదు!

ఒథెల్లో : అది సాధ్యమేనా?

డెస్‌డెమోనా : భగవానుడు నన్ను క్షమించుగాక!

ఒథెల్లో : అయితే నన్ను క్షమించు నువ్వు ఒథెల్లోను పెళ్లి చేసి కొన్న వెనిస్ రంకులాడి వనుకొన్నా, నీ ముఖంలో దేవ దూత అగుపిస్తూంది; కాని హృదయంలో దయ్యముంది!

(ఎమీలియా ప్రవేశం)

నువ్వు, నువ్వు, నువ్వు: హుఁ. మా పని ముగించుకొన్నాం. నీ శ్రమకు యిదుగో డబ్బు. యిక లోన గొళ్లెంపెట్టుకొని హాయిగా మాట్లాడుకోండి (నిష్క్రమణ)

ఎమీలియా : అయ్యో యేమిటీ పెద్దమనిషి వుద్దేశ్యం? మీ కెలా వుందమ్మగారూ? మీకెలావుంది తల్లీ?

డెస్‌డెమోనా : సగం నిద్ర పోతున్నట్లుంది.

ఎమీలియా : అమ్మగారూ, ప్రభువుగారలా వున్నారేమండీ?

డెస్‌డెమోనా : యెవరు?

ఎమీలియా : యెవరేముందమ్మగారూ? నా ప్రభువు.

డెస్‌డెమోనా : నీ ప్రభువెవరు?

ఎమీలియా : మీ వారమ్మా.

డెస్‌డెమోనా : నా కెవరూ లేరు. నాతో మాట్లాడమాక, ఎమీలియా. నేను యేడవలేను. కన్నీళ్లు కార్చటం తప్పితే మరే సమాధానం గూడా యివ్వలేను. నా పెళ్లినాటి దుప్పటిరేకుల్ని దయచేసి యీ రాత్రికి నా మంచంమీద పరుచు మరిచిపోమాక నీ పెనిమిట్ని యీలా పిలువు.

ఎమీలియో : హుఁ. యేమిటో అంతా అడివిగోడుగా వుంది! (నిష్క్రమణ)



డెస్‌డెమోనా : అవును. నా తగిన శాస్తి, మంచిశాస్తి జరిగింది. ఆయన అత్యల్ప విషయానికి గూడా నన్ను అనుమానించేంత పాపం నేనేమి చేశాను.

(ఇవాగో ఎమీలియాల ప్రవేశం)

ఇవాగో : యేమి శెలవు, అమ్మగారూ? యెలావున్నారు?

డెస్‌డెమోనా : చెప్పలేను. పిల్లలకు బుద్ధులు నేర్పేవాళ్లు చాలా మృదువుగా నేర్పుతారు. ఆయనన్నలాగే చీవాట్లు పెట్టివుండ వచ్చు యెందుకంటే, నిజంగా చీవాట్లు తినటానికి నేను చిన్నపిల్లని.

ఇవాగో : అసలు సంగతేమిటమ్మగారూ?

ఎమీలియా : నా ప్రభువు అమ్మగార్ని యెన్నో అనరాని మాట లన్నారు. నీతిగల వాశెవళ్లూ ఆ మాటల్ని సహించలేరు.

డెస్‌డెమోనా : నేను ఆ పేరు వంటిదాన్నా. ఇవాగో?

ఇవాగో : యే పేరు అమ్మగారూ?

డెస్‌డెమోనా : నా ప్రభువునన్ను అన్నాడని ఆమె అన్న పేరు.

ఎమీలియా : ఆయన అమ్మగార్ని లంజన్నాడు. తాగి తూలే బిచ్చ గాడు గూడా తనతోటి బిచ్చగత్తెని అలాంటి మాటలనేవాడు గాదు.

ఇవాగో : యెందుకలా అన్నారాయన?

డెస్‌డెమోనా : నాకు తెలవదు. నేను ఆలాంటిదాన్ని కాదని నాకు గట్టిగా తెలుసు.

ఇవాగో : యేడవమాకండి, యేడవమాకండి. అయ్యో యెంత దుర్దినం!

ఎమీలియా : అమ్మగారు అన్ని గొప్ప సమ్మంధాల్నీ పుట్టింటినీ, పుట్టిన వేళాన్నీ, మిత్రుల్నీ వదిలి పెట్టింది లంజని అనిపించుకొనేందుకేనాంట? ఆ మాటకి యెవరికి యేడుపురాదూ?

డెస్‌డెమోనా : అది నా దురదృష్టం.

ఇవాగో : అందుకాయన అనుభవిస్తారు! అసలాయనకి యీ తిక్క యెలా పుట్టిందంటా?

డెస్‌డెమోనా : యేమో అది భగవంతుడికే తెలవాలి.

ఎమీలియా : యెవడో నీతినియామాల్లేని నీచుడు, జిత్తులమారి బానిస వెధవా యేదో దురుద్దేశంతో యీ నీలాపనిందను పుట్టించి వుండకపోతే వొట్టు; వొట్టుమరి!

ఇవాగో : ఛీ, అలాంటి మనిషెవడూ లేడు! అది అసంభవం!

డెస్‌డెమోనా : అలాంటి మనిషెవరన్నావుంటే అతణ్ణి భగవంతుడు క్షమించుగాక!

ఎమీలియా : వురితాడు క్షమించాలి! వాణ్ణి నరకంలో యినపముక్కు కాకుల్తో పీకించాలి! ఆమెని లంజని యెందుకనాలి? ఆమెలంజ మొగుడెవడు? యెక్కడ జరిగింది? యెప్పుడు జరిగింది? యెలా జరిగింది అవకాశం యెక్కడుంది? యెవడో పక్కా మోసగాడు. గడ్డితినే నీచుడు, రొచ్చుగుంట లుచ్ఛా ఆ సిద్దీ మనస్సు విరిచాడు. ఓ భగవంతుడా, అలాంటి లుచ్ఛా కోరుల్ని నువ్వు లోకానికి బయట బెట్టి ప్రతి నీతిమంతుడి చేతికీ వాక కొరడా యిచ్చి ఆ బద్మాషులబట్టి లూడదీయించి వాతలు తేలి చర్మం చిట్లి రక్తం ధారలు గట్టేట్లు కొట్టించాలి!

ఇవాగో : కొంచెం జాగ్రత్తగా మాట్లాడు.

ఎమీలియా : ఛీ ఛీ! వాళ్లమొఖం తగలెయ్య! అలాంటి గొప్ప వెధవ యెవడో నీ బుర్రలో పురుగును తొలిపించి నాకూ



సిద్దీ గారికీ యేదో వుందని నువ్వు అనుమానించేట్లు చేశాడు.

ఇవాగో : నువ్వు వెర్రి దానివి. ఛీ ఛీ.

డెస్‌డెమోనా : ఇవాగో, నా ప్రభువును తిరిగి నా వాడుగా చేసుకొనేందు కేమిచెయ్యమంటావు? బాబూ, ఆయన దగ్గిరకుపో నాకేదో పెద్ద దిగులుగా వుంది. యిదుగో యిక్కడ మోకరి చెబుతున్నా, ఆయన్ని కాదని మాటలోగాని. మనసులోగాని, నడతలోగాని నేను జవదాటి వుంటే, నా కళ్లుగాని, నా చెవులుగాని, యితర పంచేంద్రియాలుగాని తప్పుగా ప్రవర్తించి వుంటే; ఆయన్ని యిది వరకు గాని, యిప్పుడుగాని, యిక ముందుగాని (ఆయన నాకు విడాకులిచ్చి గెంటేసినాసరే) నేను ప్రేమించకుండా వుంటే నాకు పుట్టగతులు లేకుండా పోవుగాక! నిర్దయ అనేది యెంతో చెయ్యవచ్చు; ఆయన నిర్దయ నా జీవితాన్ని నాశనం చెయ్యవచ్చు; కాని నీ ప్రేమ నెన్నడూ మలినం చెయ్యలేదు. "రంకులాడి" అనేమాటను నేను వుచ్చరించలేను, ఆ మాట నిప్పుడు వుచ్చరించుతూంటేనా వొంటి మిద తేళ్లూ జెర్రిలూ పాకినట్లుంది అలాంటప్పు డిక ఆ పేరు సంపాదించుకోటానికి ఆ పని చెయ్యాలంటే ప్రపంచం తల్లకిందులైనా నా చేత చేయించలేదు.

ఇవాగో : నా మాట వినండి. అంతయిదవ్వమాకండి. ఆయనకేదో కోపమొచ్చినట్లుంది. రాజ్యాంగ వ్యవహారం విషయంలో ఆయనకు కోపం గలిగింది. ఆ కోపాన్ని మీ మీద చూపించాడు.

డెస్‌డెమోనా : అది తప్ప మరేవీ కాకపోతే—

ఇవాగో : అదేనండీ. మరేదీగాదు, నామాట నమ్మండి. (లోన నుండి బాకాలధ్వని) వినండి. అవి మిమ్మల్ని భోజనానికి

రమ్మని పిలుస్తున్నాయి. వెనిస్ నుండి వచ్చిన హర్కార్లు భోజనాని కుంటారు. లోనకు పొండి. యేడవమాకండి. అన్ని కుదటబడతాయి. (డెస్‌డెమోనా, ఎమీలియాల నిష్క్రమణ)

(రోడరిగో ప్రవేశం)

యేమి సంగతులండీ, రోడరిగోగారూ?

రోడరిగో : నువ్వు నా విషయంలో సరిగా పనిచెయ్యటం లేదు.

ఇవాగో : అందుకు రుజువు?

రోడరిగో : ప్రతిరోజూ యేదో విధంగా యుక్తిగా తప్పుకొంటున్నావు. ఇవాగో రవ్వంత ఆశగొలిపే అవకాశమన్నా నాకు చూపకుండా నువ్వు కావాలని నాకే అవకాశమూ దొరక్కుండా చేస్తున్నావని నాకిప్పుడర్థమవు తూంది. నేను నిజంగా యిక యిదెంతమాత్రం సహించలేను, అంతేగాదు. యింతవరకూ నేనెంత కష్టపడ్డానో అదంతా మరిచిపోయే వెర్రివాణ్ణి గూడా గాదు.

ఇవాగో ? నేను చెప్పేది వింటారా, రోడరిగో గారూ?

రోడరిగో : చాలావిన్నాను, నువ్వు చెప్పేదొకటీ, చేసేదొకటీ.

ఇవాగో : మీరునన్ను అన్యాయంగా నిందించు తున్నారు.

రోడరిగో : లేదు, న్యాయంగానే నిందించుతున్నా. వున్నదంతా తగలేసుకొని చిప్పచేతికి తెచ్చుకొన్నాను. డెస్‌డెమోనా కిస్తానని నువ్వు నా దగ్గర్నుండి తీసుకొన్న నగల్లో సగమైతే చాలు యీ పాటికి యే క్రైస్తవ సన్యాసినినో లొంగదీయ గలిగేవి; నాలో ఆశలు రేకెత్తించి అకస్మాత్తు గౌరవాన్నీ పరిచయాన్నీ కలిగించేవి. కాని యిప్పుడదేమీ లేదు.



ఇవాగో : మంచిది కానివ్వు కానివ్వు, చాలామంచిది.

రోడరిగో : చాలామంచిది! కానివ్వా! నేను కానిచ్చే అవుసరం లేదోయ్, అదీన్నూ, అది చాలా మంచిదేం గాదోయ్. ఉహూఁ. అది నీచమంటాను. నీ నీచత్వంవల్ల నేనొక ఢంత నయ్యాను.

ఇవాగో : చాలా మంచిది.

రోడరిగో : అదీ చాలా మంచిదేం కాదంటున్నా. నే నెవర్నో డెస్‌డెమోనాకి యెరుక జేసుకొంటా. ఆమె నా నగలు నా కిచ్చేస్తే యిక నా వెర్రివేషాలు వదిలేసి చేసిన దానికి చెంపలు వేసుకొంటా, లేకపోతే అందుకు నువ్వు సరైన సమాధానం చెప్పాలిసుంటుందని గుర్తుపెట్టుకో.

ఇవాగో : మీరు చెప్పవలసిందేదో చెప్పారుగా.

రోడరిగో : ఔను. చేయదలుచుకోందేదీ నీకు చెప్పలేదు గూడాను.

ఇవాగో : భేష్ నీలో పసవుందని యిప్పుడు తెలిసిందినాకు. యిక నుండీ నువ్వంటే మరింత మంచి అభిప్రాయం వుంటుంది. యేదీ నీ చెయ్యి యిలాయివ్వు, రోడరిగో. నువ్వు నన్ను గురించి అన్నది సరైనదే. కాని నీ విషయంలో నేను చాలా శ్రమపడ్డాను.

రోడరిగో : అది కనిపించటంలేదు మరి.

ఇవాగో : అది కనిపించటం లేదని నేనూ వొప్పుకొంటా. నీ అనుమానం న్యాయమైనదే. కాని, చూడు రోడరిగో, నీలో వున్నదని నేను యిదివరకటికంటే బాగా యిప్పుడు నమ్ముతున్నది—అంటే పట్టుదల, సాహసం, వీరత్వం—నీలో నిజంగా వుంటే అది యీ రాత్రికి చూపెట్టుమరి. అది నువ్వు

చేస్తే రేపురాత్రికి డెస్‌డెమోనా నీ పక్కలో పడుకొని వుండక పోతే నేను ద్రోహినని నన్ను చంపేసెయ్యి.

రోడరిగో : సరే. యేమిటది ? అదేమన్నా చెయ్యదగిందేనా ?

ఇవాగో : అయ్యా, ఒథెల్లో స్థానంలో కేషియోని నియమించేందుకు వెనిస్‌నుండి వొక ప్రత్యేక రాయబారవర్గం వచ్చింది.

రోడరిగో : నిజమేనా ? అయితే యింకేం, ఒథెల్లో డెస్‌డెమోనాలు వెనిస్ తిరిగి వెళ్తారు.

ఇవాగో : అదేమీ గాదు. యేదో వొక సంఘటన జరక్కపోతే వాడిక్కడుండకుండా డెస్‌డెమోనాని తీసుకొని ఆఫ్రికాకు వెళ్తాడు. వాడు వెళ్లకుండా వుండాలంటే కేషియోను ఖాళీ జెయ్యాలి.

రోడరిగో : కేషియోను ఖాళీజెయ్యట మంటే నీ అర్థమేంటి ?

ఇవాగో : యేముందీ, ఒథెల్లో స్థానంలో వాడుండకుండా చేస్తే సరి—అంటే బుర్ర బద్దలు కొడితేసరి!

రోడరిగో : అయితే ఆ పనినేను చెయ్యాలంటావా?

ఇవాగో : ఔను. నీ మేలుకోసరం అది చేసే దమ్ములు నీకుంటే. యీ రాత్రికి వాడొక రంకుదాని యింట్లో భోం చేస్తాడు. నేను అక్కడికి పోతాను. తనకెంత భాగ్యమచ్చిందో వాడికింకా తెలవదు. అక్కడినుండి వాడు యెప్పుడు బైటికెళ్తాడో నువ్వు కాపలాగాస్తే (పన్నెండూ, వొంటిగంట మధ్య వాడు బైటికొచ్చేట్టు చేస్తా) వాణ్ణి నీ యిష్టమొచ్చినట్లు చేసికోవచ్చు. యేదన్నా అవసరమైతే నీకు సహాయపడటానికి నేను దగ్గర్లోనే వుంటా. అప్పుడు వాడు మనిద్దరి మధ్యా చిక్కుకొని పోతాడు. రా, తెల్లముఖంవేసి చూడమాక. నాతోరా, పోదాం. వాడు చావటం నీ కెంత అవ



సరమో నీకు చెబుతా. యిక నప్పుడు నువ్వే ఆ పని చేస్తావు. యిప్పటికే భోజనం వేళ మించిపోయింది. వృథాగా పొద్దుపోతున్నది. పద !

రోడరిగో : యిదేమిటో నేను బాగా తెలిసి కోవాలి.

ఇవాగో : నీకు బాగా అర్థమయేట్లు చెబుతాగా (నిష్క్రమణ)

## మూడో రంగం : సైప్రసు : కోటలో మరొక గది

(ఒథెల్లో, లోడొవికో, డెస్‌డెమోనా, ఎమీలియా, పరిచారకులూ ప్రవేశం)

లోడొవికో : అయ్యా నా మాటవిని యిక మీరు వుండండి.

ఒథెల్లో : క్షమించండి. నడిస్తే నా వొంటికి మంచిది.

లోడొవికో : అమ్మా, నమస్కారం. వినయపూర్వకంగా మీకు అభివందనాలు తెలుపు కొంటున్నాను.

డెస్‌డెమోనా : మీకు హృదయపూర్వక స్వాగతం.

ఒథెల్లో : అయ్యా, వస్తారా ? డెస్‌డెమోనా—

డెస్‌డెమోనా : ప్రభూ ?

ఒథెల్లో : తక్షణంపోయి పడుకో. నేను వెంటనే తిరిగొస్తా. దాసీని పంపేసెయ్యి. మరిచిపోమాక.

డెస్‌డెమోనా : అలాగే ప్రభూ. (ఒథెల్లో, లోడొవికో, పరచారకులూ నిష్క్రమణ)

ఎమీలియా : యిప్పుడెలా వుందంటారు ? ఆయన కొంచెం శాంతంగా వున్నారిప్పుడు.

డెస్‌డెమోనా : ఆయన వెంటనే వస్తామన్నారు. నన్ను పడుకోమన్నారు. నిన్ను పంపెయ్య మన్నారు.

ఎమీలియా : నన్ను పంపెయ్య మన్నారా ?

డెస్‌డెమోనా : అని ఆయన చెప్పారు. కనక, ఎమీలియా, నా రాత్రి దుస్తులు యివ్వు. తర్వాత యిక శెలవు. మనమిప్పుడు ఆయనకేం కోపం గలిగించగూడదు.

ఎమీలియా : అసలు ఆయన్ని మీరెన్నడూ చూడకుండా వుంటే యెంత బాగుండేదమ్మగారూ!

డెస్‌డెమోనా : నేనలా కోరుకోను. ఆయనంటే నాకెంత ప్రేమ్ముందంటే ఆఖరికి ఆయన మొండితనమూ, గద్దింపులూ, కోపంతో ముఖం చిట్లించు కోవటమూ (కాస్త నా పిన్నీసులు తియ్యి) నాకు యెంతో మధురంగా మనోహరంగా వుంటాయి.

ఎమీలియా : మీరు చెప్పిన దుప్పటి రేకులు మంచంమీద పరిచాను.

డెస్‌డెమోనా : మరేం ఫర్వాలేదు. యేములో, నిజంగా మనవి వెర్రి ఆలోచనలు సుమా! నీకంటే ముందు నేను చచ్చిపోయేట్లయితే ఆ దుప్పటిరేకుల్లో వొకదాన్ని నా శవం మీద కప్పు.

ఎమీలియా : అయ్యో అయ్యో! అదేం మాటమ్మగారూ!

డెస్‌డెమోనా : మా అమ్మకు బార్బరీ అనే దాసీవుండేది. ఆమె వొకర్ని ప్రేమించింది. ఆ ప్రియుడికి పిచ్చెక్కి ఆమెను వదిలేశాడు. ఆమెకు "మల్లెపువ్వు" అనే పాట వొకటివచ్చు. అది పాతది. ఐనా అది ఆమె దీనస్థితిని తెల్పుతూంది. అది పాడుతూనే ఆమె మరణించింది. ఆ పాట యీ రాత్రి నా మనసునుండి పోదు. తలను వొక పక్కకు వేల్లాడవేసుకొని పాపం ఆ బార్బరీలాగా ఆ పాట పాడాలని నా కెంతో యిదిగావుంది. కానివ్వు.



ఎమీలియా : మీ రాత్రి టంగీ తెమ్మంటారా ?

డెస్‌డెమోనా : ఊహూఁ. ముందీ పిన్నీసులు తియ్యి. యీ లోడొవికో చాలా మంచివాడు.

ఎమీలియా : మనిషి అందంగా వున్నారు.

డెస్‌డెమోనా : చక్కగా మాట్లాడుతారు.

ఎమీలియా : ఆయన క్రిందిపెదిమని ముద్దుపెట్టుకొనే భాగ్యం కోసరం వెనీసులోకు వీనస్త్రీ యెవరైనా కాళ్లకి చెప్పులు లేకుండా పాలస్తీనానుండి ఆయన దగ్గరకు నడిచి వస్తుందని నా నమ్మకం.

డెస్‌డెమోనా : (పాడు తుంది)

పాపమా కన్యకా । పరగనిట్టూర్పుచూ
అత్తివృక్షము క్రింద । అట్టె కూర్చున్నదీ
పాడు, తెల్లనిమల్లె । పూవు గురియించీ
నేడువినగా యామె । గోడు విరియించీ
చేయి రొమ్మునబెట్టి
శిరము మోకాటిపై

పాడు, తెల్లని మల్లె । పూవు గురియించీ
నేడు వినగాయామె । గోడు విరియించీ
గల గలల జలజలా । కొంగ్రొత్త సేలయేళ్లు
మూల్గెనే యామెవలె । మించె కన్నీళ్లూ
పాడు, తెల్లనిమల్లె । పూవు గురియించీ
నేడు వినగాయామె । గోడు విరియించీ
కారినా కన్నీటికి । కరిగినే రాళ్లూ
మీరినా దుఃఖాన । మూల్గె సెలయేళ్ళు

పాడు, తెల్లనిమల్లె । పూవు గురియించీ
నేడు వినగాయామె । గోడు విరియించీ

త్వరగా కానివ్వు : ఆయనిప్పుడే వస్తారు.

మల్లెదండలె నాకు । మణులహారాలు
అతడిపై వేయకుడి । యెవరునేరాలు
నాకతడి దూషణే
నిజమైన భూషణ

ఉహూఁ. తర్వాతది అదిగాదు. విను. ఆ తలుపు తట్టేదెవరూ?

ఎమీలియా : గాలి.

డెస్‌డెమోనా : (పాట)

అన్నాను ఆతడూ । అతిమోసగాడనీ
అన్నాడె అందుకూ । ఆతండు యేమనీ ?
పాడు, తెల్లనిమల్లె । పూవు గురియించీ
నేడు వినగాయామె । గోడు విరియించీ
భూపాలు రెట్లుంటె । ప్రజలు అట్లుంటారు
భర్త నడతేదైతె । భార్యదదె యంటాడు

అదీపాట యికపో. కెలవు నాళ్ల జిలపెడుతున్నాయి. దుఃఖం వచ్చేముందు అలా వుంటుందంటావా ?

ఎమీలియా : అఁ. సింగినాదం !

డెస్‌డెమోనా : అలా అనగా విన్నాను. అబ్బ, యీ మగాళ్లు, యీ మగాళ్లు! యిది చెప్పు, ఎమీలియా— తమ భర్తల పట్ల అలా మోటుగా నడుచుకొనే స్త్రీ లుంటారని నిజంగా నువ్వు అను కొంటున్నావా ?

ఎమీలియా : అలాంటి వాళ్ళు కొందరుండ వచ్చు. సందేహం లేదు.



డెస్‌డెమోనా : నువ్వు అలాంటి పని చెయ్యగలవా ప్రపంచం తల కిందులైనా ?

ఎమీలియా : అదేమన్నా అబ్బురమా ? మీరు చెయ్యలేరా ?

డెస్‌డెమోనా : లేదు. ప్రమాణం చేసి చెబుతున్నా.

ఎమీలియా : నేను గూడాను; ప్రమాణం చేసి చెబుతున్నా, కాని ప్రమాణం చెయ్యకుంటే మాత్రం నేను చెయ్యొచ్చు.

డెస్‌డెమోనా : నువ్వు అలాంటి పని చెయ్యగలవా ప్రపంచం తలకిందులైనా ?

ఎమీలియా : ప్రపంచం పెద్దది. యింత చిన్న నేరంకి అంత పెద్ద బేరం పనికిరాదు.

డెస్‌డెమోనా : నువ్వు చెయ్యవని నా నమ్మకం.

ఎమీలియా : నా నమ్మక మేమిటంటే నేను చేసి తీరతానని. తర్వాత, చేసింది మళ్ళీసరి జేస్తాను. యే వుంగరం కోసరమో, యే రవిక బట్ట కోసరమో, గౌను కోసరమో, పరికిణీ కోసరమో, టోపిల కోసరమో, మరే జీలకర్ర కోసరమో నే నాపని చెయ్యను. కాని, ప్రపంచం మొత్తం కోసరం, తన భర్తను రాజు చేసేందుకు, యే ఆడది రంకుపని చెయ్యదూ ? అందుకు నేను నరకాన పడ్డా సరే.

డెస్‌డెమోనా : మొత్తం ప్రపంచం కోసరంగూడా నే నాపనిచేస్తే వొట్టు పెట్టుమరి.

ఎమీలియా : అందులో యేమంతయిదుంది ? తప్పు అనేది ప్రపంచంలోపల వుండేతప్పే. యికను మీ శ్రమకు ప్రపంచమేలభిస్తే అదిక మీ ప్రపంచంలో వుండే తప్పు. దాన్ని మీరు క్షణంలో ఒప్పుగా జేసుకోవచ్చు. మీ చేతిలో పనది,

డెస్‌డెమోనా : అలాంటి స్త్రీ వుంటుందని నేననుకోను.

ఎమీలియా : వున్నారు. యెంతోమంది వున్నారు. తాము ఆడి సంపాదించుకొన్న ప్రపంచానికి సరిపడేంత మంది వున్నారు. కాని భార్యల పతనానికి భర్తలే కారకులని నా వుద్దేశ్యం. వాళ్ళు తమ బాధ్యతను సరిగా నిర్వర్తించరనీ, మన సొమ్మును యితరుల వాడుల్లో పోస్తారనీ అనండి. లేకపోతే వెర్రిమొర్రి అనుమానాల్తో కోతి గంతులువేసి మనమీద నిర్బంధాలు పెడతా రనండి. లేదా మనల్ని కొడతా రనండి. లేదా యిదివరకు మనకున్నది క్షీణించి పోయేట్లు చేస్తారు దేష్వంతో—యేమిటంట, మనకే కోపముంది. మనలో కొంత సద్గుణమున్నా కొంత పగబట్టే గుణంగూడా వుంది. తమ భార్యలూ తమలాగే మనుషులని భర్తల్ని తెలిసి కోనివ్వండి. భర్తలలాగానే వారికీ కళ్ళూ, ముక్కూ, చెవులూ, నాలుకా అవీవున్నాయి. మనల్ని కాదని వాళ్ళు యితరుల్ని మరి గేది దేనికి ? ఆటకా ? అంతే ననుకొంటా. దానికి కారణం ప్రేమా ? అంతే ననుకొంటా. అలా తప్పు జేసేది మనో దౌర్బల్యమా ? అదీ అంతే. అయితే మరి మగవాళ్ళలాగా మనకు ప్రేమ లేదా, ఆడాలనీ పాడాలనీ వుండగా మనో దౌర్బల్యం వుండదా అయినప్పుడు వాళ్ళని మన పట్లబాగా నడుచుకోవాలి. లేకపోతే వాళ్ళ చెడుపనులే మనకు చెడు పనుల్ని నేర్పు తున్నామని వాళ్ళు తెలిసి కోవాలి.

డెస్‌డెమోనా : శెలవు, శెలవు. చెడునుండి చెడును నేర్చుకో కుండా, చెడును మంచిగా జేసే శక్తిని భగవానుడు నాకు ప్రసాదించుగాక ! (నిష్క్రమణ)

---

# ఐదవ అంకం :

## మొదటి రంగం : సైప్రసు : ఒకవీధి

(ఇవాగో, రోదరిగోల ప్రవేశం)

ఇవాగో : యిదుగో యీ దిమ్మవెనకాలనుంచో. వాడు యిప్పుడే వెంటనే యిటువస్తాడు. కత్తిని తయారుగా వుంచుకో. పొడిచి పారెయ్. త్వరగా, త్వరగా! యేం భయపడమాక. నేను నీపక్కనే వుంటా, దీంతో మనం మునగటమో తేలటమో తేలి పోతుంది—అది బాగా మనసులోపెట్టుకో. నిర్ణయం గట్టి పరుచుకో.

రోదరిగో : దగ్గర్లో వుండు. నేను సరీగ్గా చెయ్యలేక పోవచ్చు.

ఇవాగో : యిదుగో, యిక్కడే వుంటానయ్యా ధైర్యంగా వుండు. సరీగ్గా నిలబడు. (పక్కకి నుంచుంటాడు)

రోదరిగో : నాకీపని చెయ్యాలని యేమంత పట్టుదలలేదు. ఐనా అతను నాకు నచ్చజెప్పాడు. వాడు చచ్చినవాడిలోనే జమ యిక. వాడు చస్తాడు!

ఇవాగో : యీ వెధవకు బాగా పురెక్కించా. వాడికి మంటరేగు తూంది. యికను వాడు కేషియోను చంపినా కేషియో వాణి చంపినా నా కైతైనాలాభమే. రోదరిగో బతికున్నాడా నేను, డెస్‌డెమోనాకు యిస్తానని చెప్పి వాణ్ణి మాయజేసి వాడిదగ్గర తీసుకొన్న నగల్ని తిరిగి యిచ్చెయ్య మంటాడు. అది జరగ్గూడదు. మరి కేషియో బతికున్నాడా వాడి సుఖంజూసి

నేను వోర్చలేను. అంతేగాక ఆ సిద్దీగాడు నా మోసం తెలిసి కొని ఆ సంగతి వాడికి చెప్పొచ్చు, అది నాకు చాలాప్రమాదం ఉహూఁ. వాడుచచ్చి తీరాలి అదుగో, వస్తున్నట్లున్నాడు.

(కేషియో ప్రవేశం)

రోడరిగో : వాడినడక నేనెరుగుదును. వాడేవీడు. చచ్చావురా, లుచ్చా (కేషియో మీదకు కత్తిదెబ్బ విసురుతాడు)

కేషియో : ఆ దెబ్బకు ప్రాణంపోయేదే. కాని కవచం నువ్వనుకొన్న దానికంటే బలంగావుందిరా. మరి నీదెలావుందో చూస్తానుండు. (కత్తిదూసి, రోడరిగోను పొడుస్తాడు)

రోడరిగో : అయ్యో, చచ్చాను! (ఇవాగో కేషియో వెనకాలగా వచ్చి పొడిచి నిష్క్రమణ)

కేషియో : బతికినంతకాలం కుంటినయ్యాను. సహాయం! హత్య! హత్య! (పడిపోతాడు)

(ఒథెల్లో ప్రవేశం)

ఒథెల్లో : కేషియో గొంతు అది. ఇవాగో తనమాట నిలబెట్టుకున్నాడు.

రోడరిగో : అయ్యో, నేను నీచుణ్ణి తగినశాస్తి అయింది.

ఒథెల్లో : అలాగే జరిగింది మరి.

కేషియో : సహాయం! దీపం! వైద్యుడు!

ఒథెల్లో : వాడే ఇవాగో నిజాయితీగలాడు. న్యాయబుద్ధిగలాడు. తన మిత్రుడికి జరిగిన అన్యాయానికి పగ సాధించాడు! అతడు నాకు గుణపాఠం నేర్పుతున్నాడు. ఓ నీచురాలా,



నీ ప్రియుడిక్కడ చచ్చి పడివున్నాడు. యిక నీ పని దగ్గర కొస్తూంది. రంకులాడీ, వస్తున్నా. నా హృదయంలోనుండి ఆ మరులు గొలిపే నీ కళ్లని చెరిపేసుకొంటున్నా. కామ పిపాసతతో కళంకితమైన నీ మంచం కామరక్తంతోనే మరకలు పడుతుంది. (నిష్క్రమణ)

(లోడొవికో, గ్రాషియానోల ప్రవేశం)

కేషియో : యేమండోయ్? కాపలాయేలేదా? వచ్చేపోయేవారెవరూలేరా? హత్య! హత్య!

గ్రాషియానో : యెవరికో ఆపదగలిగింది. ఆ అరుపుచాలా భయంకరంగా వుంది.

కేషియో : అయ్యో రక్షించండి!

లోడొవికో : వినండి!

రోడరిగో : ఓరి నీచుడా!

లోడొవికో : యిద్దరో ముగ్గురో మూలుగుతున్నారు. ఆకాశంలో బాగా మబ్బు పట్టివుంది. యిదంతా వంచనగావచ్చు. మనమిలా యెవరో అరవఁగానే మందిబలం లేకుండా రావటం మంచిదిగాదు.

రోడరిగో : యెవరూ రారా? అయితే యిక నా గతి రక్తంకారి చావటమే.

లోడొవికో : వినండి!

(ఇవాగో ప్రవేశం)

గ్రాషియానో : యెవడో చొక్కా తొడుక్కొఁన మనిషి దీంపతో ఆయుధాల్తో వస్తున్నాడు.

ఇవాగో : యెవరక్కడ ? హత్యని అరుస్తున్నదెవరు ?
లోడొవికో : మాకు తెలవదు.
ఇవాగో : మీకు అరుపులు వినపడలేదా ?
కేషియో : యిక్కడ, యిక్కడ! దయచేసి కాస్త నాకు సహాయం చెయ్యండి.
ఇవాగో : యేం జరిగింది ?
గ్రాషియానో : ఇతడు ఒథెల్లోగారి పతాకధారి.
లోడొవికో : నిజంగా అతడే, చాలా ధైర్యశాలి.
ఇవాగో : యెవరండీ మీరూ అలాదీనంగా అరుస్తున్నారు ?
కేషియో : ఇవాగో ? అయ్యో నన్నెవరో నీచులు కుంటీవాణ్ణి జేశారు! కొంచెం సహాయం చెయ్యి.
ఇవాగో : అయ్యో, లేఫ్టినెంటుగారూ ? మీరా ? యే నీచులు చేశారిది ?
కేషియో : అందులో వొకడు యీ చుట్టుపక్లే వుండి వుంటాడను కొంటా. యింతలోనే పారిపోలేడు.
ఇవాగో : యెంతద్రోహులు! అక్కడెవరండీ ? రండి, కొంచెం నాకు సహాయం యివ్వండి. (లోడొవికో, గ్రాషియానోలతో)
రోడరిగో : అయ్యో యిక్కడ నాకు సహాయం చెయ్యండి!
కేషియో : అందులో వాడొకడు.
ఇవాగో : ఓరి బానిస వెధవా! ఓరి నీచుడా! (రోడరిగోను పొడుస్తాడు)
రోడరిగో : ఓరి పాపిష్టి ఇవాగో! ఓరి దయలేని కుక్కా!
ఇవాగో : చీకట్లో మనుషుల్ని చంపుతావురా ? యీ హంతకు లెక్కడున్నారంట ? అబ్బ, యీ పట్నం యెంత నిశ్శబ్దంగా



వుంది! హోయ్ హత్య! హత్య! మీరెవరు ? మంచివాళ్ళా చెడ్డవాళ్ళా ?
లోడొవికో : తెలిసికొంటే, మీరు పొగడగలరు.
ఇవాగో : లోడొవికో గారా ?
లోడొవికో : ఆయనే నండీ.
ఇవాగో : క్షమించాలి. యిదుగో కేషియో గార్నెవళ్ళో నీచులు గాయపరిచారు.
గ్రాషియానో : కేషియోగారా ?
ఇవాగో : యెలావుంది అన్నగారూ ?
కేషియో : నా కాలు రెండుగా తెగిపోయింది.
ఇవాగో : అయ్యో! దీపమండీ బాబూ, నా చొక్కాయితో కట్లు గడతా.

(బియాంకా ప్రవేశం)

బియాంకా : యేమిటి సంగతి ? అరిచిందెవరు ?
ఇవాగో : అరిచిందెవరూ ?
బియాంకా : నా కేషియో! నా ముద్దుల కేషియో! అయ్యో కేషియో, కేషియో, కేషియో!
ఇవాగో : ఓ చెడులంజా—కేషియోగారూ. మిమ్మల్నెవరు పొడిచారని మీకు అనుమానంగా వుంది ?
కేషియో: యెవరిమీదా లేదు.
గ్రాషియానో : మీరిలా వున్నందుకు విచారిస్తున్నా. మీ కోసం నేను వెళ్ళాను.

ఇవాగో : మేజోడు నాడా వొకటి యిలా యివ్వండి. అబ్బ డోలీ వుంటే ఆయన్ని మోసికోని పోవటానికి బాగుండేదిగద!

బియాంకా : అయ్యో ఆయన మూర్ఛ పడిపోతున్నాడు! అయ్యో కేషియో, కేషియో, కేషియో!

ఇవాగో : అయ్యా మీ కందరికీ వొక్కమనవి. దీనికి కారణం యిదుగో యీ ముండని నా అనుమానం—కేషియోగారూ, కొంచెం వోర్పు వహించంగి. రండి, రండి! దీపం చూపండి. యీ ముఖం మనం యెరిగిందా కాదా ? అయ్యో నా మిత్రుడు రోడరిగోనా ? ఉహూం. ఔను నిజం. అయ్యో భగవంతుడా! రోడరిగో.

గ్రాషియానో : యేమిటీ, వెనిస్ రోడరిగోనా ?

ఇవాగో : అతడేనండీ. యేం, మీరెరుగుదురా ?

గ్రాషియానో : అతణ్ణా ? ఔను.

ఇవాగో : గ్రాషియానోగారా ? క్షమించాలి. యీ గొడవలో పడిపోయి మిమ్మల్ని చూడనందుకు నన్నుమీరు క్షమించాలి.

గ్రాషియానో : మిమ్మల్ని చూసినందుకు సంతోషంగావుంది.

ఇవాగో : యెలావుంది, కేషియోగారూ ?—అబ్బ, డోలీ, డోలీ!

గ్రాషియానో : రోడరిగో ?

ఇవాగో : అతడే, అతడే! (ఒక డోలీతెస్తారు) ఆఁ. అది బాగుంది! డోలీ. యెవరన్నా ఆయన్ని యిక్కణ్ణుండి దయ చేసి మోసికెళ్ళండి. నేనుపోయి జనరల్‌గారి వైద్యుణ్ణి తెస్తాను. (బియాంకా) యిక నీ విషయం, నువ్వేమీ అనవు సరం శ్రమపడమాకమ్మా—యిక్కడ చచ్చిపడివున్న మనిషి



నా ప్రియమిత్రుడండీ కేషియోగారూ. మీకూ అతడికీ యేమన్నా బద్ధవైరముందా ?

కేషియో : యేమీలేదు. అసలు అతడెవడో నేనెరగనుగూడాను.

ఇవాగో : (బియంకాతో) యేమిటీ, తెల్లముఖంవేసి చూస్తూన్నావా ?— యిక తీసుకపదండి ఆయన్ని. (కేషియో, రోడరి గోలను మోసికొని పోతారు) బాబూ, మీరుకొంచెం ఆగండి- తెల్లముఖం వేసి చూస్తున్నావా అమ్మా ? దాని ముఖంలో భయం చూశారా ? బాగా పరీక్షగా చూడండి. దానికేసి చూడండి. చూస్తున్నారాండి ? నోరు మాట్లాడ పోయినా నేత్రాలు నిజం చెపుతాయి.

(ఎమీలియా ప్రవేశం)

ఎమీలియా : అయ్యో, యేమిటిది ? యేమి సంగతండీ ?

ఇవాగో : చీకట్లో కేషియోగారి మీద రోడరిగో యింకా పారి పోయిన కొంతమందీ కత్తులు దూసికల బడ్డారు. ఆయన దాదాపు చచ్చి పోయినంత యిదిగా వున్నారు. రోడరిగో యేమో చచ్చే పోయాడు.

ఎమీలియా : అయ్యొ యెంతమంచి వాడు! అయ్యొ పాపం కేషియో!

ఇవాగో : లంజరికం వల్ల వచ్చిన ఫలితమిది. ఎమీలియా, నువ్వు పోయి యీ రాత్రి కేషియో గారెక్కడ భోం చేశారో కనుక్కురా. (బియాంకాతో) యేమిటీ, ఆ మాటవింటేనే వణుకుతున్నావా ?

బియాంకా : ఆయన మాయింట్లో తిన్నారు. కాని నేనందుకు వణకటం లేదు.

ఇవాగో : ఆఁ ? అలాగా ? నాతోరా.

ఎమీలియా : ఛీ ఛీ, రంకుముండా !

బియాంకా : నేను రంకుముండనుగాదు. నాకూ నీలాగే నీతీ నిజాయితీ వున్నాయి.

ఎమీలియా నాలాగానా ? ఛీ! ఛీ సిగ్గులేదూ!

ఇవాగో : అయ్యా కేషియోగారికి కట్లు కట్టించుదాం పదండి. (బియాంకా) రా. నువ్వు మరోకథ చెప్పాలిసుంటుంది— ఎమీలియా, నువ్వు కోటకు పరుగెత్తుకొనిపోయి ప్రభువుగారికీ అమ్మగారికీ యిక్కడేం జరిగిందో చెప్పు. పోతావా ? (తనలో) యీ రాత్రితో నేను వుండటమో వూడటమో తేలిపోతుంది. (నిష్క్రమణ)

## రెండవ రంగం : సైప్రస్ కోటలో

### వొక పడకగది

(మంచంమీద డెస్‌డెమోనా. వొక దీపంతో ఒథెల్లో ప్రవేశం)

ఒథెల్లో : హృదయమా, అదే కారణం, అదే కారణం, ఓ పవిత్ర తారలారా, అదేమిటో నా నోటితో చెప్పించ వద్దు. అదే కారణం. ఐనా నేను ఆమె రక్తం చిందించను. అంతేగాదు. మల్లెపూవు కంటే తెల్లగా, పాలరాతి విగ్రహం వలె నున్నగా వున్న ఆమె చర్మాన్ని కంది పోయేట్లు చేయను గూడా. ఐనప్పటికీ ఆమె మరణించి తీరాలి. లేకపోతే ఆమె యింకా యెక్కువ మందిని మోసగించు తుంది. యీ దీపం ఆర్పెయ్యాలి, తర్వాత ఆ దీపం ఆర్పెయ్యాలి. ఓ వెలుగు తున్న



దీపమా, నిన్ను ఆర్పివేసినా తలుచుకొంటే తిరిగి వెలిగించ గలను. కాని ఓ జిత్తులమారీ, నీ దీపం ఆర్పివేస్తే నిన్ను వెలిగించేదేదీ యిక లేదు. ఒకసారి గులాబీ పువ్వును తెంచి వేస్తే తిరిగి దాన్ని మొక్కమీద అతికించి ప్రాణం పోయడమంటూ లేదు. అందుకని దాన్ని తుంచకముందే మొక్కమీదుండగానే ముద్దు పెట్టు కొంటాను. (డెస్‌డెమోనాను ముద్దుపెట్టు కొంటాడు) అబ్బా, యెంత మధురంగావుంది ! న్యాయఖడ్గాన్ని దాదాపు విరగొట్టగలంత మధురంగావుంది. యింకొక్కటి, యింకొక్కటి ! చనిపోయేప్పుడు నువ్వు అలాగేవుండు. నేను నిన్ను చంపుతాను. చంపిన తర్వాత ప్రేమించుతాను. నేను దుఃఖించాలి. కాని అది క్రూర కన్నీరు. యిది పవిత్రప్రేమ. ప్రేమించిన వస్తువునే శిక్షించే ప్రేమ. ఆమె నిద్రలేస్తుంది.

డెస్‌డెమోనా : యెవరక్కడ ? ఒథెల్లోగారా ?

ఒథెల్లో : ఔను, డెస్‌డెమోనా.

డెస్‌డెమోనా : పడుకోరా, ప్రభూ.

ఒథెల్లో : యీ రాత్రి దైవపార్థన చేశావా, డెస్‌డెమోనా ?

డెస్‌డెమోనా : అవును, ప్రభూ.

ఒథెల్లో : నువ్వు చేసిన నేరాన్ని దేన్నయినా భగవంతుడి ముందు అంగీకరించి క్షమాభిక్ష కోరకపోతే, యిప్పుడాపని వెంటనే చెయ్యి.

డెస్‌డెమోనా : అయ్యో, యిదేమిటి యిలా అంటున్నారు ప్రభూ ?

ఒథెల్లో : అది చెయ్యి. చెయ్యటంలో గూడా త్వరగా చెయ్యి. నేను ప్రక్కనే అటూయిటూ నడుస్తాను. అసంసిద్ధంగావున్న నీ

ఆత్మను నేను చంపను. ఉహుఁ. భగవానుడది వారించుగాక !
నీ ఆత్మను చంపను !

డెస్‌డెమోనా : మీరు చంపే విషయం మాట్లాడు తున్నారా ?

ఒథెల్లో : ఔను.

డెస్‌డెమోనా : భగవానుడు నన్ను కనికరించు గాక !

ఒథెల్లో : తథాస్తు, హృదయపూర్వకంగా.

డెస్‌డెమోనా : మీరు అలా అన్నారంటే, నన్ను చంపరిక.

ఒథెల్లో : హుఁ. !

డెస్‌డెమోనా : ఐనా నాకు మిమ్మల్ని చూస్తే భయంగావుంది. యెందుకంటే మీకనుగుడ్లు అలా తిడుగుతూంటే యేదో మూడిందన్న మాట. నేనేపాపమూ చెయ్యలేదు. మరి యెందుకు భయపడాలో అర్థంగావటం లేదు. ఐనా నాకు భయంగావుంది.

ఒథెల్లో : నీ పాపాలను గురించి ఆలోచించు.

డెస్‌డెమోనా : మీ పట్ల వున్నది ప్రేమ.

ఒథెల్లో : ఔను. అందుకే నువ్వు చస్తావు.

డెస్‌డెమోనా : ప్రేమించినందుకు వచ్చేమరణం అసహజ మరణం. అయ్యో, యెందుకు మీరలామో క్రింది పెదిమ కొరు క్కొంటున్నారు ? యేదో దారుణమైన ఆలోచన మిమ్మల్ని వూపి వేస్తున్నది. యివి అపశకునాలు. ఐనా అవి నాకు కీడు మూడించవని ఆశిస్తున్నా.

ఒథెల్లో : నోరుమూసుకొని మెదలకుండా వూరుకో!

డెస్‌డెమోనా : అలాగేవుంటాను. యెందుకంటారు ?



ఒథెల్లో : నేను యెంతగానో ప్రేమించే ఆ చేరుమాల్ని నువ్వు కేషియో కిచ్చావు.

డెస్‌డెమోనా: లేదు. ప్రమాణ పూర్తిగాలేదు! ఆయన్ను పిలి పించి అడగండి.

ఒథెల్లో : చిట్టీ, అసత్య ప్రమాణం చేసేముందు జాగ్రర్తగా ఆలో చించు, జాగ్రర్తగా ఆలోచించు. యిప్పుడు నువ్వు నీ మరణ శయ్యమీదున్నావు.

డెస్‌డెమోనా : ఔను. కాని మరణించటానికి గాదు.

ఒథెల్లో : ఔను. యిప్పుడే కనక చేసిన పాపాన్ని అంగీకరించు. నువ్వెన్ని ప్రమాణాలు చేసినా నా మనసు మారదు. నువ్వు చచ్చి తీరతావు.

డెస్‌డెమోనా : అయితే నన్ను భగవానుడు కనికరించుగాక !

ఒథెల్లో : తథాస్తు అంటున్నా.

డెస్‌డెమోనా : కనికరంగూడా చూపండి : నా జీవితంలో నేను మీకే అపరాధమూ యెన్నడూ చెయ్యలేదు. కేషియోను సోదరుడుగా తప్పితే మరోవిధంగా యెన్నడూ ప్రేమించ లేదు యెన్నడూ ఆయనకు నేనేదీ యివ్వలేదు.

ఒథెల్లో : నా చేరుమాలు వాడి చేతిలో వుండగా నేను నా కంటితోచూశా ! ఓ బొంకులాడీ ! నా హృదయాన్ని రాయి చేస్తున్నావు. నేను చేయబోయేదాన్ని హత్యని పిలిచేట్లుగా చేస్తున్నావు. నువ్వు నీ పాపాలు అంగీకరించితే నిన్ను దైవ న్యాయానికి బలి యిద్దామను కొన్నాను—నేనా చేరుమాలు చూశాను.

డెస్‌డెమోనా : అయితే అది ఆయనకు దొరికిందన్నమాట. నే నెన్నడూ దాన్ని ఆయనకివ్వలేదు. ఆయనకోసం కబురం పండి. నిజం చెప్పమనండి.

ఒథెల్లో : నిజమే చెప్పాడు.

డెస్‌డెమోనా : యేమిటి; ప్రభూ ?

ఒథెల్లో : నిన్ను వుపయోగించు కొన్నానని.

డెస్‌డెమోనా : ఎలా ? చెడుగానా ?

ఒథెల్లో : ఔను.

డెస్‌డెమోనా : అలా చెప్పనే చెప్పడు.

ఒథెల్లో : ఔను. వాడినోరు శాశ్వతంగా మూయబడింది. ఇవాగోకి అది చెయ్యమని చెప్పాను.

డెస్‌డెమోనా : అయ్యో, నా అనుమానం నిజమైంది. యేమిటి, ఆయన చచ్చిపోయారా ?

ఒథెల్లో : వాడికి తలమీది వెంట్రుకలన్ని ప్రాణాలున్నా వాటిని తీసేశక్తి నా పగకుంది.

డెస్‌డెమోనా : అయ్యో, ఆయనకు ద్రోహం జరిగింది. నాకు మోసం జరిగింది.

ఒథెల్లో : ఛీ, లంజా! నా యెదటనే వాడికోసరం యేడుస్తావా ?

డెస్‌డెమోనా : ప్రభూ, నన్నుదేశ బహిష్కారం చేయండి గాని చంపవద్దు!

ఒథెల్లో : పడుకో, లంజా!

డెస్‌డెమోనా : రేపు చంపండి. యీ రాత్రికి బతకనివ్వండి!

ఒథెల్లో : ఉహూఁ. నువ్వు బతికితే—



డెస్‌డెమోనా : ఒక్క అరగంటన్నా కనీసం!

ఒథెల్లో : యిక యిదేఅంతం గనక ఆలస్యంలేదు.

డెస్‌డెమోనా : కాని నేను ప్రార్థన చేసుకొనేప్పుడు మాత్రం!

ఒథెల్లో : యిప్పటికే చాలావేళ మిగిలి పోయింది (ఆమె గొంతు పిసుకుతాడు లోనుండి ఎమీలియా తలుపువద్ద పిలుస్తుంది)

ఎమీలియా : ప్రభూ, ప్రభూ! యే మండోయ్! ప్రభూ, ప్రభూ!

ఒథెల్లో : యేంగోలిది ? యింకా చావలేదా ? యింకా పూర్తిగా చావలేదా ? నేను క్రూరుణ్ణయినా యింకా కనికరంగలవాణ్ణి. నీకు మరణవేదన లేకుండా చేస్తాను. అవీ, అలా:

ఎమీలియా : (లోననుండి) ఓ ప్రభూ! వొక్కమాట!

ఒథెల్లో : ఔను—అది ఎమీలియా — వస్తున్నా—చచ్చిపోయింది— కేషియో చావు విషయం చెప్పటాని కొచ్చినట్లుంది. అబ్బ, పెద్దగోల ఆ ? యిక చలనమేలేదా ? సమాధిలాగా నిశ్చలంగా వుంది—ఆమె లోపలికొస్తుందా ?—అది మంచిదేనా ?—ఆమె మళ్లీ కదులు తూన్నట్లుంది—ఉహూఁ—యేం చేస్తేమంచిది ?— ఆమె లోపలికొస్తే నా భార్యతో మాట్లాడుతుంది. నా భార్య! నా భార్య! యేమిభార్య ? నాకే భార్యాలేదు. హబ్బా, దుర్భరం! అయ్యో! యిప్పుడు సూర్యగ్రహణం చంద్రగ్రహణం పట్టాలి భూకంపం రావాలి.

ఎమీలియా : (లోననుండి) ప్రభూ, వొక్కమాట మీతో!

ఒథెల్లో : నీసంగతే మరిచా. రా, ఎమీలియా, లోపలికిరా— మెల్లగా—వస్తున్నా—తెరలు తొలగించనియ్యి-యెక్కడున్నావు? (తలుపు తెరుస్తాడు)

(ఎమీలియా ప్రవేశం)

యేమిటిలా వచ్చావు ?

ఎమీలియా : అయ్యో ప్రభూ, అక్కడొక ఘోర హత్య జరిగింది!

ఒథెల్లో : యేమిటీ ? యిప్పుడా ?

ఎమీలియా : యిప్పుడే. ప్రభూ.

ఒథెల్లో : అయితే అది చంద్రిడి పొరపాటు. ఇదివరకు యెన్నడూ రానంత దగ్గరగా భూమికి దగ్గరగావచ్చి మనుష్యులకు పిచ్చెక్కించు తున్నాడు.

ఎమీలియా : ప్రభూ, రోడరిగో అనే వెనిస్ యువకుణ్ణి కేషియో గారు చంపారండీ.

ఒథెల్లో : రోడరిగో చచ్చాడా ? కేషియో చచ్చాడా ?

ఎమీలియా : లేదు. కేషియోగారు చావలేదండీ.

ఒథెల్లో : కేషియో చావలేదా ? అయితే హత్యకు అర్థంలేదు. పగ భగ్గు మంటూంది.

డెస్‌డెమోనా : అయ్యో అన్యాయంగా, అన్యాయంగా హత్య జేశారు.

ఎమీలియా : ప్రభూ, ఆ అరుపేమిటి ?

ఒథెల్లో : అదా ? యేమిటీ ?

ఎమీలియా : అయ్యో, అయ్యో! అది మా అమ్మగారి గొంతు. సహాయం, సహాయం! రక్షించండి! అమ్మా, మళ్ళా మాట్లాడమ్మా! చిట్టితల్లీ! బంగారుతల్లీ! మాట్లాడమ్మా!

డెస్‌డెమోనా : నిర్దోషిగా చనిపోతున్నాను.

ఎమీలియా : అయ్యో, యెవరు చేశారమ్మా యీ పనీ ?



డెస్‌డెమోనా : యెవరూలేదు—నాకు నేనే చేసుకొన్నా. శెలవు. నా ప్రభువుకు నమస్కారమని చెప్పు. హబ్బా. శెలవు! (చనిపోతుంది)

ఒథెల్లో : యెలా చంపబడిం దంటావు ?

ఎమీలియా : అయ్యో, అదెవరికి తెలుసు ?

ఒథెల్లో : నేను గాదని ఆమె అనటం విన్నావుగద.

ఎమీలియా : అలాగే అంది నిజమే చెబుతాను.

ఒథెల్లో ; బొంకులాడి నరకపు మంటల్లోపడి పోయినట్లు పోయింది! ఆమెను చంపింది నేనూ!

ఎమీలియా : అయ్యో, అందుకామె దేవదూత అయింది. నువ్వు మరింత నల్ల దయ్యాని వయ్యావు!

ఒథెల్లో : ఆమె తప్పుడుపని చేసింది. ఆమె రంకులాడి.

ఎమీలియా : నువ్వు బొంకుతున్నావు. నువ్వు భూతానివి, సైతానివి;

ఒథెల్లో : ఆమె తామరాకు మీది నీటిబొట్టులాగా నిలకడలేనిది.

ఎమీలియా : నువ్వు దురదగొండి ఆకు నూగు లాంటివాడివి ఆమె నిలకడలేని మనిషనటానికి. అయ్యో, ఆమె సాక్షాత్తు దేవత!

ఒథెల్లో : కేషియో ఆమెతో పడుకొన్నాడు. కాదేమో నీ భర్త నడుగు. కారణం లేకుండా నేను నిష్కారణంగా యీ పని చేస్తే నాకు అధోగతి కలుగుగాక! నీ భర్తకి అంతా తెలుసు.

ఎమీలియా : నా భర్తకా ?

ఒథెల్లో : నీ భర్తకి.

ఎమీలియా : ఆమె రంకుతనం చేసిందనా ?

ఒథెల్లో : అవును, కేషియోతో ఆమేగనక పవిత్రంగా వుండివుంటే భగవంతుడు యీ ప్రపంచాన్నంతా వొక పెద్ద చంద్రకాంత మణి చేసియిచ్చినా ఆమెను ఆ మణికోసం అమ్మేవాణ్ణిగాదు.

ఎమీలియా : నాభర్తా ?

ఒథెల్లో : ఔను, అతడేనాకు మొదట యిది చెప్పింది. అతడు నిజాయితీగల మనిషి. నీచపుపనులంటే అతడికినచ్చవు.

ఎమీలియా : నా భర్తా ?

ఒథెల్లో : యెన్నిసార్లు చెప్పాలి ? నీ భర్తనే అంటున్నా సరా ?

ఎమీలియా : అయ్యో తల్లీ నీకు ద్రోహం జరిగిందమ్మా! నా భర్త ఆమె రంకులాడని చెప్పటమా ?

ఒథెల్లో : అతడే అతడేనన్నా. ఆ మాట అర్థమవుతూందా ? నా మిత్రుడైన నీ భర్త. నిజాయితీ పరుడైన ఇవాగో.

ఎమీలియా : వాడేగనక అలా చెప్పివుంటే, రోజుకొక్క ముక్క చొప్పున వాడిపుచ్చె భళ్ళున పగిలిపోతుంది! అది పచ్చి అబద్ధం! ఆ నీచుడంటే పాపం ఆ తల్లికెంతో ప్రేమ

ఒథెల్లో : ఆఁ.!

ఎమీలియా : నీయిష్టమొచ్చింది చేసుకో. నువ్వు చేసినపని నీచమైనది. నువ్వు నీచుడివి.

ఒథెల్లో : నువ్వు నోరుమూసుకొంటే మంచిది.

ఎమీలియా : నువ్వు నా శరీరాన్నేంచేసినా, నా ఆత్మనేమీ చెయ్యలేవు. ఓ వెర్రివాడా, ఓ మందబుద్ధీ! మట్టి బుర్ర! నువ్వొక పనిచేశావు—నీకత్తిజూసి నేను భయపడే రకాన్నిగాదు. చచ్చినా సరే నిన్ను బట్టబయలు చెయ్యకుండా వూరుకోను. రక్షించండి, రక్షించండి, రక్షించండి: సిద్దీ మా అమ్మగార్ని చంపాడు! హత్య: హత్య!



(మాంటేనో, గ్రాషియానో, ఇవాగో, యితరులూ ప్రవేశం)

మాంటేనో : సంగతేమిటి ? యేమిటి, జనరల్‌గారూ ?

ఎమీలియా : వచ్చావా, ఇవాగో ? మంచిపనే చేశావు, యితరులు తాముచేసిన హత్యలు నీ మీద రుద్దేందుకు.

గ్రాషియానో : సంగతేమిటసలు ?

ఎమీలియా : ద్రోహీ, నువ్వు మగవాడివే అయితే అలా అనలేదని నిరూపించు. వాడి భార్య రంకులాడని నువ్వు వాడికి చెప్పావని వాడంటున్నాడు! నువ్వు చెప్పలేదని నాకు తెలుసు. నువ్వంత మోసగాడివి గాదు. చెప్పు, నా గుండె పగిలిపోతుంది.

ఇవాగో : నే ననుకొన్నదెమో ఆయనకు చెప్పాను. అంతేగాక ఆయన కళ్ళార చూసి తెలిసికొన్న దానికంటే నేనేమీ యెక్కువ చెప్పలేదు.

ఎమీలియా : కాని యెప్పుడైనా ఆమె రంకులాడని చెప్పావా ?

ఇవాగో : చెప్పాను.

ఎమీలియా : అబద్ధం చెప్పావు, పచ్చి లుచ్ఛాకోరు అబద్ధం చెప్పావు ! అది అబద్ధం ! వట్టి అబద్ధం ! ఆమె కేషియోతో రంకుతనం జరిగిందా ? కేషియోనని అన్నావు గదు ?

ఇవాగో : కేషియో తోనే, చాలా ? యిక నోరుముయ్యి.

ఎమీలియా : ఉహూఁ. నేను నోరు ముయ్యను ! నేను మాట్లాడితీరాలి. నా బంగారు తల్లి హత్య జేయబడింది !

అందరు : భగవానుడు వారించు గాక !

ఎమీలియా : నీ నీలాప నిందలు యింతపని చేసినయ్యి.
ఒథెల్లో : ఔను. తేరి చూడమాకండి! అది సత్యం,
గ్రాషియానో : అదొక విపరీత సత్యం.
మాంటేనో : ఘోరం !
ఎమీలియా : ద్రోహం! ద్రోహం !! ద్రోహం!!! అదే, అదే! నాకు తెలుసు! అయ్యో ద్రోహం! అలాగనే అను కొన్నా అప్పుడు! యీ దుఃఖంతో యిక నేను బతకను! అయ్యో ద్రోహం! ద్రోహం!
ఇవాగో : యేమిటి, నీకు పిచ్చెక్కిందా ? యింటికి నడవమని చెబుతున్నా.
ఎమీలియా : అయ్యా, నన్ను మాట్లాడ నివ్వండి. వాడు చెప్పిన మాట వినటం న్యాయమే. కాని యిప్పుడు గాదు. బహుశా, ఇవాగో, నేనిక యింటికే పోక పోవచ్చు.
ఒథెల్లో : ఓ ! ఓ ! అయ్యో ! (మంచంమీద పడతాడు)
ఎమీలియా : ఉహుఁ. కింద పడుకొని గోండ్రు పెట్టరా. మధు రాత్రి మధురమైన అమాయికు రాల్ని చంపావురా !
ఒథెల్లో : ఛీ. ఆమె నీచురాలు! (లేస్తాడు) మిమ్మల్ని చూడనే లేదండీ, మామగారూ. అదిగో మీ అన్న బిడ్డ, యీ చేతులే ఆమెకి చలనంలేకుండా చేసినయ్యి. యిది ఘోరమూ, భయం కరమూ అని నాకు తెలుసు.
గ్రాషియానో : అయ్యో, డెస్‌డెమోనా! నీ తండ్రి నీ కంటే ముందు చనిపోయి నందుకు నాకు సంతోషంగా వుంది. నీ



పెళ్ళితో ఆయన హృదయం పగిలి పోయింది. దుఃఖంతో కుళ్ళి కుళ్ళి చని పోయాడు. ఆయనే బతికుంటే యేదో తెగింపు పని చేశేవాడు. ఔను. ఆయన శాపమే నీకు శాంతి దాయకమైంది.
ఒథెల్లో : యిది విచారకరం; ఐనా ఆమె కేషియోతో గలిసి వొక వెయ్యిసార్లు తప్పుడు పని చేసిందని ఇవాగోకి తెలుసు. అసలు కేషియోయే వొప్పు కొన్నాడు గూడాను. నేను ఆదిలో ఆమెకిచ్చిన ప్రేమ చిహ్నాన్ని ఆమె కేషియోకిచ్చింది. దాన్ని నేను అతడి చేతిలో చూశా. అదొక చేరుమాలు. పురాతన పుది. దాన్ని మా నాన మా అమ్మకిచ్చాడు.
ఎమీలియా : అయ్యో భగవంతుడా ! అయ్యో దేముడా !
ఇవాగో : నోరుముయ్ !
ఎమీలియా : ఆ రహస్యం బైట పడుతుంది. బైట పడుతుంది! నేను నోరు ముయ్యనా? ఉహూఁ. గాలిలాగా స్వేచ్ఛగా మాట్లాడతాను. దేవుడూ, మనుష్యులూ, దయ్యాలూ, అందరూ, అందరూ, అందరూ సిగ్గు సిగ్గని అరిచినా నేను మాట్లాడి తీరతాను !
ఇవాగో : చెప్పేది విను. యింటికెళ్ళు.
ఎమీలియా : నేను పోను! (ఇవాగో కత్తిదూసి ఝళిపిస్తాడు)
గ్రాషియానో : ఛీ! ఆడదానిమీద నువ్వు కత్తి దూసేది ?
ఎమీలియా : ఒరే మట్టిబుర్ర సిద్దీ! నువ్వు చెప్పే చేరుమాలు నాకు దొరికితే నేను నా మొగుడి కిచ్చారా. యెందుకంటే

దాన్ని దొంగిలించి తెచ్చి పెట్టమని వాడు నన్ను అనేక సార్లు అదే పనిగా బతిమాలి అడిగాడు.

ఇవాగో : ఓ నీచపులంజా !

ఎమీలియా : ఆమె దాన్ని కేషియో కిచ్చిందా ? అయ్యో, అది నాకు దొరికింది. దాన్ని నేను నా మొగుడి కిచ్చాను.

ఇవాగో : ఛత్, రంకుముండా ! అబద్ధమాడు తున్నావు.

ఎమీలియా : దైవసాక్షిగా నేను అబద్ధమాడటం లేదు బాబూల్లారా ! ఓరి ఖూనీకోరు కేతిగాడా ! ఆ బంగారు తల్లి యీ బుద్ధిహీనుడి వాతనెలా బడిందంట !

ఒథెల్లో : పిడుగులు తప్ప ఆకాశంలో యిక నేరాతి బండలూ లేవా ? వోరి నీచుడా ! (ఒథెల్లో ఇవాగో వైపు పరుగెత్తుతాడు. మాంటేనో అతడి ఖడ్గంలాగేస్తాడు ఇవాగో ఎమీలియాను పొడుస్తాడు..)

గ్రాషియానో : ఆమె పడిపోతూంది. చచ్చేట్లు పొడిచాడను కొంటా.

ఎమీలియా : ఔను, ఔను. అయ్యో నన్ను నా తల్లి పక్కన పడుకో బెట్టండి (ఇవాగో నిష్క్రమణ)

గ్రాషియానో : వాడు వెళ్ళి పోయాడు. వాడి భార్యమాత్రం చచ్చిపోయింది.

మాంటేనో : వాడు పక్కా ద్రోహి. యీ కత్తిని మీ దగ్గరుంచండి. దీన్ని సిద్దీ దగ్గర్నుండి లాక్కొన్నాను. రండి. బయట నుండి తలుపు వద్ద కాపలాగాయండి. వాణ్ణి బైటికి పోనియ్యమాకండి. పోతుంటే చంపండి గాని వదిలి పెట్టమాకండి. నేను ఆ ద్రోహివెంటబడి పట్టుకొస్తా. (మాంటేనో, గ్రాషియానో, యితరుల్తో నిష్క్రమణ)



ఒథెల్లో : వట్టి పనికిరాని వెధవగూడా నా చేతిలోంచి కత్తి లాక్కొంటూ యెదిరించే ధైర్యం గూడా నాకు లేకుండా పోయింది. అయినా, నీతిపోయినాక ఖ్యాతియెందుకు ?

ఎమీలియా : అమ్మా, మీ పాటభావం యేమిటమ్మా ? విను. నా మాట వినపడుతూందా ? రాచహంసనై రాగంపాడుతూ మరణిస్తాను. (పాడుతుంది.) "పాడు, తెల్లని మల్లేపూవు గురియించీ" సిద్దీ, ఆమె పరమ పతివ్రత. నిన్ను యెంతో ప్రేమించిదిరా, కర్కోటక సిద్దీ. సత్యం పలుకు తూండగానే నా ఆత్మ స్వర్గాని కేగుతూంది. అలా మాట్లాడు తూనే నేను మరణిస్తా ననుకొంటా—— (చనిపోతుంది)

ఒథెల్లో : యీ గదిలో నాది మరొక కత్తివుంది. అది స్పానిష్ కత్తి. ఆఁ.యిదుగో——మామగారూ, నేను బైటికి రావాలి.

గ్రాషియానో : (లోననుండి) ఆ ప్రయత్నం చేశావా నీ ప్రాణాలుండవు, నీ వద్ద కత్తిలేదు గనక అనుభవించి తీరాల్సుంటుంది.

ఒథెల్లో : అయితే నావంక చూసి నాతో మాట్లాడు, లేకపోతే కత్తి లేక పోయినా నిన్ను యెదుర్కొంటాను.

(గ్రాషియానో ప్రవేశం)

గ్రాషియానో : యేమిటి సంగతి ?

ఒథెలో : చూడండి. యిదిగో కత్తి. యింతకంటే మంచి కత్తి లేనేలేదు. ఈ చిన్న చేతితో, యీ కత్తితో నేను నువ్వునన్ను

ఆపగల శక్తికంటే యిరవై రెట్లు బలంగా ప్రతి బంధకాల్ని గడిచి గట్టెక్కాను. ఐనా యెందుకీ డంబాలు ! తన రాత నెవడు తప్పించు కోగలడు ? యిప్పుడు అలాలేదు. నా కత్తిజూసి భయపడమాక. యిదుగో నా గమ్యస్థానం. యిక్కడినుండి భయంతో వెనక్కి తిరగటం వృధా. ఒథెల్లోని వత్తి పుల్లతో ఝళిపించు, వెనక్కు తగ్గుతాడు. ఐనా ఒథెల్లో యెక్కడికి పోవాలి ? యెలా వున్నావిప్పుడు ? ఓ దురదుష్టవంతురాలా ! నీ తెల్లని పావడలాగా పాలిపోయావా ? విచారణ దినం నాడు మనం కలిసి కొన్నప్పుడు యీ నీ చూపు నా ఆత్మను స్వర్గంనుండి కిందకు పడగొట్టుతుంది; దాన్ని భూతాలు పట్టుకొని పీకుతాయి. చల్లగా, చల్లగా, వున్నావా ? అచ్చం నీ పవిత్రత లాగానే ఓ నీచాతి నీచుడా ! ఓ భూతప్రేత పిశాచాల్లారా, నే నీ దైవ స్వరూపం యెదట లేకుండా కొరడాల్తో బాది పారదోలండి ! తుపాను గాలిలో తిప్పి తిప్పి కొట్టండి ! నన్ను మలమల మాడ్చండి అగ్నిలో బుగ్గి చేయండి ! ఓ డెస్‌డెమోనా, డెస్‌డెమోనా ! చచ్చి పోయింది ! ఓ ! ఓ! అయ్యో !

(లోడొవికో, కేషియో. మాంటేనో, ఇవాగో, అధికారుల్తో ప్రవేశం)

లోడొవికో : యీ దుడుకు మనిషి, యీ దురదృష్టవంతుడెక్కడ ?

ఒథెల్లో : అతడే వొకప్పుడు ఒథెల్లో. యిదుగో నేనిక్కడున్నా.

లోడొవికో : ఆ చీడ పురుగేడి ? ఆ నీచుణ్ణి యిలా తీసుకు రండి.



ఒథెల్లో : వాడి పాదాలు భూతం పాదాలలాగా చీలివున్నాయేమోనని చూస్తున్నా—కాని అలాలేవు. అదంతా కాకమ్మ కథ. అరే, నువ్వు నిజంగా భూతానివైతే నీకు చావులేదు (ఇవాగోను గాయ పరుస్తాడు)

లోడొవికో : ఆ కత్తి లాక్కోండి. (ఒథెల్లో వద్దనుండి కత్తి తీసుకో బడుతుంది)

ఇవాగో : నెత్తురు గారుతున్నదే గాని నాకు చచ్చేగాయం మాత్రం పడ లేదండీ.

ఒథెల్లో : అందుకు నేను విచారించటం లేదు. గూడాను నువ్వు బతకాలనే నా కోరిక. యెందుకంటే చావటం సుఖం గనక.

లోడొవికో : అయ్యో ఒథెల్లో వొకప్పుడు నువ్వెంతో మంచి వాడివి. వొక బానిస తొత్తు కొడుకు చేతుల్లో చిక్కుకొని పోతావా ? యేమనాలి నిన్ను ?

ఒథెల్లో : యేముంది, యేదైనా సరే. యిష్టముంటే గౌరవ నీయ హంతకుడనండి. యెందుకంటే నేను ద్వేషంతో యేదీ చెయ్యలేదు; గౌరవం కోసరమే చేశాను.

లోడొవికో : యీ ఉచ్ఛాతన నేరంకొంత అంగీకరించాడు. కేషియోను చంపాలని నువ్వూ వాడూ అనుకొన్నారా ?

ఒథెల్లో : ఔను.

కేషియో ! ప్రియ జనరల్ గారూ, మీకు నే నేమీ అన్యాయం చేయలేదు గదండి.

ఒథెల్లో : అని నమ్ముతున్నాను. అందుకు మీ క్షమాపణ కోరుతున్నాను. ఆ పిశాచం నన్నెందుకిలా వలలో వేసు కొన్నాడో అడుగు తారా ?

ఇవాగో : నన్నేమీ అడగొద్దు. మీకు తెలిసిందేదో మీకు తెలుసు. యీ క్షణంనుండీ నేను వొక్కమాట గూడా మాట్లాడను.

లోడొవికో : యేమిటీ, ప్రార్థన చెయ్యటానికి గూడా ?

గ్రాషియానో : చిత్రహింస మొదలెడితే నువ్వే నోరు తెరుస్తావు.

ఒథెల్లో : నీ నిశ్శబ్ధమే మంచిదిరా.

లోడొవికో : అయ్యా జరిగిందేమిటో మీకు తెలవదు గనక అది చెబుతాను. చచ్చి పోయిన రోడరిగో జేబులో యిదుగో యీ జాబు దొరికింది యిదిగో యింకొకటి. కేషియోను రోడరిగో చంపాలని అందులో వొకదాంట్లో వుంది.

ఒథెల్లో : ఓరి ద్రోహీ !

కేషియొ : అతి చండాలుడు. నీచాతి నీచుడు.

లోడొవికో : అతడి జేబులోనే మరొక జాబుగూడా దొరికింది. దీన్ని యీ లుచ్ఛాకి పంపాలను కొన్నట్లుంది. కాని, యీ లోగానే ఇవాగో వచ్చి అతడికేదో నచ్చ జెప్పి శాంత సరి చాడను కొంటాను.

ఒథెల్లో : ఓరి పరమ దుర్మార్గుడా !—కేషియొ గారూ నా భార్య చేరుమాలు. మే చేతికెలా వచ్చింది ?

కేషియో : అది నాకు నా గదిలో దొరికింది. దాన్ని కావాలని తానే ఆ గదిలో పడవేశానని వాడు యింతకు ముందే వొప్పు కొన్నాడు.

ఒథెల్లో : అయ్యో వెర్రివాణ్ణి. వెర్రివాణి, వెర్రివాణ్ణి !

కేషియో : అంతేగాదు. కాపలా మీదుండగ ఇవాగో తనని నా మీదకు రెచ్చ గొట్టినందుకు చీ వాట్లు పెడుతూ రాసిన విషయం గూడా రోడరిగో జాబులోనె వుంది. దాంతో నన్ను



బర్తరపు చేయటం జరిగింది. యింతకు ముందు గూడా అతడు చాలాసేపు చచ్చిపోయినట్లు పడివున్నా తేరుకొని మాట్లాడాడు—ఇవాగో తనని పొడిచాడనీ, ఇవాగో తన నీ పనికి పురికొల్పాడనీ చెప్పాడు.

లోడొవికో : మీరీగది విడిచిపెట్టి మాతోరావాలి. మీ మీ పదవి నుండి తొలగించ బడ్డారు. కేషియో ఆ స్థానంలో నియమించ బడ్డారు. ఇకను యీ యీ నీచ, బానిస వెధవ విషయం: వీణ్ణి యెక్కువ కాలం బతికేట్లు చేసి యెక్కువ చిత్రహింస అనుభవించేట్లు చేసే వుపాయ మేదన్నావుంటే అది వాడికి చేయబడుతుంది. వెనిస్ ప్రభుత్వానికి మీ నేరం విషయం తెలిసే వరకూ మీరు జైలులో వుంచబడుతారు. రండి. ఆయన్ని తీసుకు రండి.

ఒథెల్లో : ఆగండి ! మీరు వెళ్ళేముందు వొక్కమాట. నేను ప్రభుత్వానికి కొంత సేవ చేశాను. అది వారికి తెలుసు. కనక నా ప్రార్థ నేమంటే మీరు వారి జాబులు రాసేప్పుడు జరిగింది జరిగినట్లుగా రాయండి. ప్రేమతో తగ్గించి రాయనూ వద్దు. ద్వేషంతోపెంచి రాయనూ వద్దు అప్పుడు మీరుయుక్తితో గాక హృదయ పూర్వకంగా ప్రేమించిన వాణ్ణి గురిచిం; తేలికగా అనుమానం కలిగే స్వభావం కాకపోయినా అను మానం కలిగించబడినాక అనేక అనుమానాల్తో సతమతమై పోయిన వాణ్ణి గురించి; పన్నీరునుమెచ్చని పందిని గురించి; కన్నీరుగార్చే అలవాటు లేక పోయినా జలజలా కన్నీరు గార్చుతూన్న వాణ్ణి గూర్చి రాస్తారు. అలారాయండి అంతే గాదు. అలెప్పోలో వొకప్పుడొక తలపాగా ధరించిన టర్కీ వాడు ద్వేషంతో వా[illegible]ణ్ణికొట్టి ప్రభుత్వాన్ని

దూషించగా నేను వాడిగొంతు పట్టుకొని కొట్టానని రాయండి—యిదుగో యిలా (కత్తితో పొడుచుకొంటాడు).

లోడొవికో : అయ్యో, విషాదాంతం!

గ్రాషియానో : చెప్పినదంతా చెడిపోయింది.

ఒథెల్లో : నిన్ను చంపేముందు ముద్దుపెట్టు కొన్నాను. యింత కంటే మార్గం లేదు—చస్తూ ముద్దు పెట్టుకొని చస్తాను! (ఆతడు డెస్‌డెమోనా మీదపడి మరణిస్తాడు)

కేషియో : ఆయనవద్ద కత్తి లేకపోయినా యిది జరుగుతుందనే నేను అనుకొన్నా. యెందుకంటే ఆయన గొప్ప హృదయం గలాడు.

లోడొవికో : ఒరే చిత్తకార్తె కుక్కా! ఆవేదనకంటే, ఆకలి కంటే, సముద్రానికంటే నువ్వు దుష్టుడివి! ఆ మంచంమీదున్న ఆ విషాదకరదృశ్యంవంక చూడరా. అది నువ్వుచేసినపని వాడిమొఖం చూస్తేనే పాపం చుట్టుకొంటుంది. వాడి మొఖాన్ని కనపడకుండా చెయ్యండి. గ్రాషియానో యీ యింటి అజమాయిషీ నువ్వు తీసుకో యెందుకంటే సిద్దీకి నువ్వే వారసుడివి. గవర్నరు ప్రభువుగారూ, యికను యీ లుచ్ఛాకి శిక్ష విధించేదెలాగో ఆ భారమంతా మీదే. కాలం, స్థలం, చిత్రహింస—యీ మూడూ తీవ్రంగా వుండాలి. నేను నౌక యెక్కి యిప్పుడే వెనిస్‌కు పోతున్నా. భారమైన హృదయం యీ ఘోర దారుణాన్ని గురించి వివరించుతా. (నిష్క్రమణ)

(సమాప్తం)

